సూర్యః (సుతమ్) నిష్పన్నమ్(దధే)ధరే(జఠరే)ఉదరే. జఠరముదరమ్ భవతి జగ్ధమస్మిన్ ధ్రియతే ధీయతే వా. నిరు. ౪.౭. (వావశానః)భృశం కామయమానః(సహస్త్రియమ్)సహప్రాప్తామ్ భార్యామ్ (వాజమ్)అన్నాదికమ్(అత్యమ్)అతితుం వ్యాప్తుం యోగ్యమ్(న)ఇవ (సప్తిమ్) అశ్వమ్ (ససవాన్) దదత్(సన్)(స్తూయసే)ప్రశస్యసే(జాతవేదః)ఉత్పన్నవిజ్ఞాన॥౪౭॥అన్వయః:- హే జాతవేదో! యథా ససవాన్ సన్ త్వం స్తూయసేఽయమగ్ని రిన్ద్రశ్చ యస్మిన్ సోమం దధాతి యం సుతం జఠరేఽహం దధే. సోఽహం వావశానః సన్ సహస్త్రియం దధే. త్వయా సహ వాజమత్యం న సప్తిం దధే. తాదృశ స్త్వం భవ ॥౪౭॥ భావార్థః :- అత్రోపమా వాచక లుప్తోపమాలంకారౌ. యథా విద్యుత్సూర్యౌ సర్వాన్ రసాన్ గృహీత్వా జగద్రసయతో యథా పత్యా సహ స్త్రీ స్త్రియా సహ పతిశ్చా నందం భుఙ్క్తే, తథాఽహ మేతద్దధే. యథా సద్గుణై ర్యుక్త స్త్వం స్తూయసే తథాఽహమపి ప్రశంసితో భవేయమ్ ॥౪౭॥

పదార్థము:—జాతవేదః = విజ్ఞానమును పొందిన విద్వాంసుడా! ఎటుల, ససవాన్ సన్ = దానమొనర్చుచున్నవాడవై నీవు, స్తూయసే = ప్రశంస నీయుడవగుచున్నావో, అయమ్ అగ్నిః ఇన్ద్రః = ఈ అగ్ని మఱియు సూర్యుడు, యస్మిన్ = ఎందు, సోమమ్ = సర్వౌషధి రసములను ధారణ మొనర్చుచున్నారో, సుతమ్ = సిద్ధమొనర్చ బడిన యే పదార్థమును,జఠరే = ఉదరమునందు నేను, దధే = ధారణ మొనర్చుచున్నానో, సః = అట్టి నేను, వావశానః = అత్యంతము కామించు చున్నవాడనై, సహస్త్రియమ్ = తోడుగనుండు స్వస్త్రీని ధారణ మొనర్చుచున్నానో, నీతో పాటు, వాజమ్ = అన్నాది పదార్థములను, అత్యమ్ న = వ్యాప్తమగుటకు తగిన వానివలె, సప్తిమ్ = అశ్వమును,దధే = ధరించుచున్నానో అటులనే నీవును కమ్ము, ॥౪౭॥

భావార్థము:— ఈ మంత్రమునందు ఉపమా వాచకలుప్తోపమాలంకారము లున్నవి. ఎటుల విద్యుత్సూర్యులు సకలరసములను గ్రహించి జగత్తును రసమయముగ నొనర్చుచున్నారో, ఎటుల భర్తతోపాటు స్త్రీ, స్త్రీతోపాటు పతి అనంద మనుభవించెదరో,అటులనే నేనీ సమస్తమును ధరించు చున్నాను. ఎటుల శ్రేష్ఠగుణయుతుడవై ప్రశంసాపాత్రుడ వగుచున్నావో అటులనే నేనును ప్రశంసా యోగ్యుడ నగుదును గాక! ॥౪౭॥ (౫౭౦)

---

౫౭౧ అగ్నే యత్తే ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ పంక్తి శ్ఛందః, పంచమః స్వరః.
అధ్యాపకై ర్నిష్కపటత్వేన సర్వే విద్యార్థినః పారనీయా ఇత్యాహ,
అధ్యాపకులు నిష్కపటముగ విద్యార్థుల నందరిని చదివించవలయును.

అగ్నే యత్తే దివి వర్చః పృథివ్యాం యదోషధీష్వప్స్వా యజత్ర ।
యేనాన్తరిక్ష ముర్వా తతన్థ త్వేషః స భానురర్ణవో నృచక్షాః ॥౪౮॥

అగ్నే,యత్, తే, దివి, వర్చః, పృథివ్యామ్, యత్, ఓషధీషు, అప్స్విత్యప్+సు, ఆ,యజత్ర, యేన, అన్తరిక్షమ్, ఉరు, ఆతతన్థేత్యా +తతన్థ, త్వేషః, సః, భానుః, అర్ణవః, నృచక్షా ఇతి నృ+చక్షాః. ॥౪౮॥

పదార్థః :- (అగ్నే)విద్వన్(యత్)యస్య(తే) తవ(దివి) ద్యోతనాత్మకే విద్యుదాదౌ(వర్చః) విజ్ఞానప్రకాశః(పృథివ్యామ్)భూమౌ(యత్)(ఓషధీషు)యవాదిషు (అప్సు) ప్రాణేషు జలేషు వా(ఆ)

(యజత్ర)సంగంతుం యోగ్య(యేన)(అన్తరిక్షమ్)ఆకాశమ్ (ఉరు) బహు (ఆ తతన్థ)సమన్తాత్తను (త్వేషః)ప్రకాశః (సః) (భానుః) ప్రభాకరః (అర్ణవః)అర్ణాంసి బహూన్యుదకాని విద్యన్తే యస్మిన్ సః. అర్ణసో లోపశ్చ. అ. ౫. ౨. ౧౦౯ ఇతి మత్వర్థే వః సలోపశ్చ (నృచక్షాః) నౄన్ చక్షతే సః ॥౪౮॥ అన్వయః :— హే యజత్రాగ్నే! యద్యస్య తే తవాఽగ్నేరివ దివి వర్చః యత్ పృథివ్యా మోషధీష్వప్సు వర్చోఽస్తి యేన నృచక్షా భాను రర్ణవో త్వేషః యేనాన్తరిక్ష ముర్వాతతన్థ తథా స త్వం తదస్మాసు ధేహి ॥౪౮॥ భావార్థః :— అత్ర వాచక లుప్తోపమాలంకారః. అస్మిన్ జగతి యస్య సృష్టిపదార్థ విజ్ఞానం యాదృశం స్యాత్తాదృశం సద్యోఽన్యాన్ గ్రాహయేత్. యది న గ్రాహయేత్తర్హి తన్నష్టం సదన్యైః ప్రాప్తు మశక్యం స్యాత్ ॥౪౮॥

పదార్థము:- యజత్ర = సంగత మొనర్చయోగ్యుడా! అగ్నే = విద్వాంసుడా! యత్ తే = ఏ నీయొక్క అగ్నితుల్యమైన, దివి = ద్యోతన శీలమగు నాత్మయందు, వర్చః = విజ్ఞాన ప్రకాశము, యత్ పృథివ్యామ్ ఓషధిషు అప్సు = పృథివియందు, యవాద్యోషధులందు, ప్రాణములందు జలములందు నే, వర్చః = తేజస్సు ఉన్నదో, యేన = దేనిచే. నృచక్షాః భానుః = మానవులకు చూపించు సూర్యుడు, అర్ణవః = బహుజలములను వర్షింప జేయువాడు, త్వేషః = ప్రకాశకుడునై యున్నాడో, యేన = దేనిచే,అన్తరిక్షమ్ = ఆకాశమును, ఉరు ఆతతన్థ = ఎక్కువ విస్తారయుక్తముగ నొనర్చుచున్నావో, సః = ఆ నీవు దాని నంతయు మాయందు ధరింపజేయుము. ॥౪౮॥

భావార్థము :- ఇచట వాచక లుప్తోపమాలంకారము కలదు. ఈ జగత్తునందెవని కెంత సృష్టిలోని పదార్థముల జ్ఞానమున్నదో అంత వెంటనే ఇతరులకు చెప్పనిచో అది నశించిపోవును. ఇతరులు పొందుటకు తెలుసుకొనుటకు వీలు కానిదగును. ॥౪౮॥ (౫౬౧)

---

౫౬౨ అగ్నే దివ ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ పంక్తి శ్ఛందః, పంచమః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నవ్విషయమే.

అగ్నే దివో అర్ణ మచ్ఛా జిగా స్యచ్ఛా దేవాꣳ॥ఊచిషే ధిష్ణ్యా యే।
యా రోచనే పరస్తాత్ సూర్యస్య యాశ్చా వస్తా దుప తిష్ఠన్త ఆపః ॥౪౯

అగ్నే, దివః, అర్ణమ్, అచ్ఛ, జిగాసి, అచ్ఛ, దేవాన్, ఊచిషే, ధిష్ణ్యాః, యే, యాః, రోచనే, పరస్తాత్, సూర్యస్య, యాః, చ, అవస్తాత్, ఉపతిష్ఠన్త ఇత్యుప +తిష్ఠన్తే, ఆపః. ॥౪౯॥

పదార్థః :-(అగ్నే)విద్వన్(దివః)ప్రకాశాత్(అర్ణమ్)విజ్ఞానమ్(అచ్ఛ)(జిగాసి)స్తౌషి(అచ్ఛ)(దేవాన్)దివ్యగుణాన్ విదుషో విద్యార్థినో వా (ఊచిషే)వక్తి (ధిష్ణ్యాః) యే దిధిషన్తి బ్రువన్తి తే ధిషాణ స్తేషు సాధవః. అత్ర ధి ధాతోర్బాహుళకా దౌణాదికః కనిన్ తతో యత్ (యే) (యాః) (రోచనే) ప్రకాశే (పరస్తాత్)పరాః(సూర్యస్య)(యాః)(చ)(అవస్తాత్)అధస్థాః(ఉపతిష్ఠన్తే)(ఆపః) ప్రాణా జలాని వా ॥౪౯॥ అన్వయః :— హే అగ్నే యస్త్వం దివోర్ణం యా ఆపః సూర్యస్య రోచనే పరస్తాద్యాశ్చావస్తా దుపతిష్ఠన్తే తా అచ్ఛ జిగాసి. యే ధిష్ణ్యాః సన్తి తాన్ దేవాన్ ప్రత్యర్ణ మచ్ఛోచిషే స త్వమస్మాక ముపదేష్టా భవ. ॥౪౯॥ భావార్థః :—యే సువిచారేణ విద్యుతః

సూర్యకిరణేషూ పర్యధఃస్థానాం జలానాం వాయూనాం చ బోధం యథా ప్రాప్నువన్తి తేఽన్యాన్ ప్రతి సమ్యగుపదిశన్తు.

పదార్థము.—అగ్నే = విద్వాంసుడా! ఏ నీవు, దివః = ప్రకాశమునుండి, అర్ణమ్ = విజ్ఞానమును, యాః ఆపః = ఏ ప్రాణములు లేక జలములు, సూర్యస్య = సూర్యునియొక్క, రోచనే = ప్రకాశములో, పరస్తాత్ = పరములుగా నున్నవో, చ = మఱియు, యాః అవస్తాత్ = ఏవి క్రిందను, ఉపతిష్ఠన్తే = సమీపమున స్థితములై యున్నవో వానిని, అచ్ఛ = బాగుగ, జిగాసి = స్తుతించుచున్నావు, యే ధిష్ణ్యాః = మాట్లాడు ప్రవీణులెవరున్నారో, దేవాన్ = ఆ దివ్యగుణములుగల విద్యార్థులకు, విద్వాంసులకు విజ్ఞానమును, అచ్ఛ = బాగుగ, ఊచిషే = చెప్పుదువు అట్టి నీవు మాకొఱకు నుపదేశింపుము. ॥౪౯॥

భావార్థము :— ఎవరు సువిచారముచే విద్యుత్తునందు, సూర్యకిరణములందు క్రింద నుండు జలముల యొక్కయు, వాయువుల యొక్కయు జ్ఞానమును పొందుచున్నారో, వారితరులకు నిరంతర ముపదేశించవలయును. ॥౪౯॥ (౫౬)

౫౦. పురీష్యాస ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్చీ పఙ్క్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

మనుష్యై ర్ద్వేషాదికం విహాయానన్దితవ్యమి త్యుపదిశ్యతే.

మానవులు ద్వేషాదులత్యజించి ఆనందించవలయును.

పురీష్యాసో అగ్నయః ప్రావణేభిః సజోషసః ।
జుషన్తాం యజ్ఞమద్రుహోఽనమీవా ఇషో మహీః॥ ॥౫౦॥

పురీష్యాసః, అగ్నయః, ప్రావణేభిరితి ప్ర+వణేభిః, సజోషస ఇతి స+జోషసః, జుషన్తామ్, యజ్ఞమ్, అద్రుహః, అనమీవాః, ఇషః, మహీః. [౫౦]

పదార్థః :— (పురీష్యాసః) పూర్ణాసు గుణక్రియాసు భవాః (అగ్నయః) వహ్నయ ఇవ వర్తమానా విద్వాంసః (ప్రావణేభిః) విజ్ఞానైః. అత్రాన్యేషామపీతి దీర్ఘత్వమ్ (సజోషసః) సమానసేవాప్రీతయః (జుషన్తామ్) సేవన్తామ్ (యజ్ఞమ్) విద్యావిజ్ఞాన దానగ్రహణాఖ్యమ్ (అద్రుహః) ద్రోహరహితాః (అనమీవాః) అరోగాః (ఇషః) ఇచ్ఛాః (మహీః) మహతీః ॥౫౦॥ అన్వయః :— సర్వే మనుష్యాః ప్రావణేభిః సహ వర్తమానా అనమీవా అద్రుహః సజోషసః పురీష్యాసోఽగ్నయ ఇవ సన్తో యజ్ఞం మహీరిషో జుషన్తామ్. ॥౫౦॥ భావార్థః :— అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా విద్యుదవిరుద్ధా సతీ సమానసత్తయా సర్వాన్ పదార్థాన్ సేవతే తథైవ రోగద్రోహాది దోషై రహితాః పరస్పరం ప్రీతిమన్తో భూత్వా విజ్ఞాన వృద్ధికరం యజ్ఞం ప్రతత్య మహాన్తి సుఖాని సతతం భుఞ్జీరన్.

పదార్థము :— మానవులందరు, ప్రావణేభిః = విజ్ఞానములను కలిగినవారు, అనమీవాః = రోగరహితులు, అద్రుహః = ద్రోహమునకు దూరులు, సజోషసః = ఒకేవిధమైన సేవాప్రేమలు గలవారు, పురీష్యాసః = పూర్ణ గుణక్రియలందు నిపుణులు, అగ్నివంటి తేజస్వులు నగు విద్వాంసులునై, యజ్ఞమ్ = విద్యావిజ్ఞానదానము—గ్రహణము అను యజ్ఞమును మఱియు, మహీః ఇషః = పెద్ద పెద్ద కోరికలను, జుషన్తామ్ = సేవించవలయును. ॥౫౦॥

భావార్థము :— ఈ మంత్రమందు వాచకలుప్తోపమాలంకారమున్నది, విద్యుత్తు అనుకూలమైనదై సమాన భావముతో నెటుల సకల పదార్థములను సేవించుచున్నదో అటులనే రోగ ద్రోహాది

దోష రహితులై పరస్పరము ప్రీతియుతులై విజ్ఞానమును వృద్ధిపొనర్చు యజ్ఞమును వ్యాపింపజేసి సతతము మహాసుఖముల ననుభవించవలయును. ॥౫౦॥ (౫౬౩)

---

౫౬౪ ఇడామగ్న ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, భురిగార్షీ పంక్తిశ్ఛందః, పంచమః స్వరః.

మనుష్యై ర్గర్భాధానాది సంస్కారై రపత్యాని సంస్కర్తవ్యానీత్యాహ.

మానవులు గర్భాధానాది సంస్కారములచే బాలకులను సంస్కరించవలయును.

ఇడా మగ్నే పురుదꣳసꣳ సనిం గోః శశ్వత్తమꣳహవమానాయ సాధ।

స్యాన్నః సూనుః స్తనయో విజావాఽగ్నే సా తే సుమతి ర్భూత్వస్మే॥

ఇడామ్, అగ్నే, పురుదꣳసమితి పురు-దꣳసమ్, సనిమ్, గోః, శశ్వత్తమ మితి శశ్వత్+తమమ్, హవమానాయ, సాధ, స్యాత్, నః, సూనుః, తనయః విజావేతి విజా+వా, అగ్నే, సా తే, సుమతిరితి సు-మతిః, భూతు, అస్మే ఇత్యస్మే. ॥౫౧

పదార్థః :- (ఇడామ్) స్తోతుమర్హాం వాచమ్ (అగ్నే) విద్వన్ (పురుదంసమ్) పురూణి బహూని దంసాని కర్మాణి భవన్తి యస్మాత్ (సనిమ్) సంవిభాగమ్ (గోః) వాచః (శశ్వత్తమమ్) అతిశయితమనాదిరూపం వేదబోధమ్ (హవమానాయ) విద్యాం స్పర్ధమానాయ (సాధ) సాధ్నుహి. అత్ర వ్యత్యయేన శప్ (స్యాత్) భవేత్ (నః) అస్మాకం (సూనుః) ఉత్పన్నః (తనయః) పుత్రః (విజావా) వివిధైశ్వర్యజనకః (అగ్నే) అధ్యాపక (సా) (తే) తవ (సుమతిః) శోభనా ప్రజ్ఞా (భూతు) భవతు. అత్ర శపో లుక్. భూ సువోస్తిఙీతి గుణాభావః. (అస్మే) అస్మాకమ్. ॥౫౧॥ అన్వయః :- హే అగ్నే తే సా సుమతి రస్మే భూతు యయా తే నోఽస్మాకం చ యో విజావా సూనుః తనయః స్యాత్. తయా త్వం తస్మై హవమానాయేడాం గోః శశ్వత్తమం పురుదంసం సనిం సాధాగ్నే వయం చ సాధ్నుయామ. ॥౫౧॥

భావార్థః :- మాతాపితృభ్యా మాచార్యేణ చ సావధానతయా గర్భాధానాది సంస్కారరీత్యా సుసంతానానుత్పాద్య వేదేశ్వర విద్యాయుక్తా ధీరుత్పాద్యా. నహీదృశోఽన్యో ధర్మోఽపత్య సుఖనిధి ర్వర్తత ఇతి నిశ్చేతవ్యమ్. ॥౫౧॥

పదార్థము :- అగ్నే = విద్వాంసుడా! తే సా సుమతిః = నీ యొక్క ఆ సుందరబుద్ధి అస్మే భూతు = మాకు లభించుగాక! దేనిచే నీకు, నః = మఱియు మాకు, విజావా సూనుః తనయః = ఉత్పన్నుడగుపుత్రుడు వివిధైశ్వర్యములను త్పాదనమొనర్చువాడుగ, స్యాత్ = అగునో, ఆ బుద్ధిచే నీవు, హవమానాయ = విద్యను గ్రహించునతనికై, ఇడామ్ = స్తుతికి యోగ్యమగు వాణిని, గోః = వాణి సంబంధమగు, శశ్వత్తమమ్ = అత్యంత అనాదిరూపమైన వేదజ్ఞానమును మఱియు, పురుదంసమ్ = బహుకర్మలు సిద్ధింపజేయు, సనిమ్ = ఋగ్వేదాది వేదవిభాగమును, సాధ = సిద్ధింపజేయుము. మఱియు నో అధ్యాపకా ! మేమును సిద్ధింపజేయుదుము గాక ! ॥౫౧॥

భావార్థము :- సావధానముతో గర్భాధానాది సంస్కార పద్ధతుల ననుసరించి మంచి సంతానమును కని, వారికి వేదమందు, ఈశ్వరునియందు విద్యలందు [శ్రద్ధయుంచు] బుద్ధిని లభింపజేయవలయును. అపత్య సుఖముల నిధిగ నుండు నితరధర్మ మెద్దియు నిటువంటిది లేదని మాతాపితృ ఆచార్యులు నిశ్చయము చేసుకొనవలయును. ॥౫౧॥ (౫౬౪)

౫౬౫ అయం త ఇత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, నిచృదార్ష్యనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.
అథ జన్యజనకానాం కర్తవ్యం కర్మాహ.
మాతా పితృపుత్రాదుల పరస్పర కర్తవ్యము చెప్పబడుచున్నది.

అయ న్తే యోని రృత్వియో యతో జాతో అరోచథాః ।
తం జానన్నగ్న ఆ రోహాథానో వర్ధాయ రయిమ్ ॥౫౨॥

అయమ్, తే, యోనిః, ఋత్వియః, యతః, జాతః, అరోచథాః, తమ్, జానన్, అగ్నే, ఆ, రోహ, అథ, నః, వర్ధయ, రయిమ్ ॥ [౫౨]

పదార్థః :- (అయమ్) (తే) తవ (యోనిః) దుఃఖ వియోజకః సుఖ సంయోజకో వ్యవహారః (ఋత్వియః) ఋతుసమయోఽస్య ప్రాప్తః. అత్ర ఛన్దసి ఘసితి ఘస్ ప్రత్యయః) (యతః) యస్మాత్ (జాతః) ప్రాదుర్భూతః సన్ (అరోచథాః) ప్రదీప్యేథాః (తమ్) (జానన్) (అగ్నే) అగ్నిరివ స్వచ్ఛాత్మన్ (ఆ) (రోహ) ఆరూఢో భవ (అథ) అనన్తరమ్. అత్ర నిపాతస్య చేతి సంహితాయాం దీర్ఘః (నః) అస్మభ్యమ్ (వర్ధయ) అత్రాన్యేషా మపీతి సంహితాయాం దీర్ఘత్వమ్ రయిమ్ ప్రశస్తాం శ్రియమ్. ॥౫౨॥ అన్వయః :- హే అగ్నే త్వం యస్తే తవ ఋత్వియోఽయం యోని రస్తి యతో జాత స్త్వమరోచథాః. తం జానన్త్సమారోహథ, నో రయిం వర్ధయ. ॥౫౨॥ భావార్థః :- హే మాతా పిత్రాచార్యా! యూయం పుత్రాన్ పుత్రీశ్చ ధర్మ్యేణ బ్రహ్మచర్యేణ సేవితేన సద్విద్యా జనయిత్వోప దిశత. హే సన్తానా! యూయం సద్విద్యయా సదాచారేణాస్మాన్ సుసేవయా ధనేన చ సతతం సుఖయతేతి,

పదార్థము :- అగ్నే = అగ్నివలె శుద్ధాంతః కరణముగల విద్వాంసుడా! తే = నీయొక్క, ఋత్వియః = ఋతుకాలమునందు లభించినదైన, అయం యోనిః = ఏ యీ దుఃఖనాశకము, సుఖవర్ధకమునగు వ్యవహారమున్నదో, యతః = దేనిచే, జాతః = పుట్టినమీరు, అరోచథాః = ప్రకాశితులగుదురో, తమ్ జానన్ = దానిని ఎఱుగుచు నీవు, ఆరోహ = శుభగుణము లందారూఢుడవు కమ్ము. అథ = తర్వాత, నః = మాకై, రయిమ్ = ప్రశంసిత లక్ష్మిని, వర్ధయ = వృద్ధి యొనర్పుము. ॥౫౨॥

భావార్థము :- ఓ మాతపిత్రా చార్యులారా! మీరు పుత్రులకు పుత్రికలకు ధర్మానుకూలముగ సేవిత బ్రహ్మచర్యముచే శ్రేష్ఠవిద్యను ప్రసిద్ధ మొనర్చి ఉపదేశించుడు. ఓ సంతానమా! మీరు సద్విద్య ద్వారా సదాచారము ద్వారా మంచి సేవచేతను ధనముచేతను, మమ్ము నిరంతరము సుఖయుక్తులుగ నొనర్చుడు.

౫౨. (౫౬౫)

౫౬౬ చిదసీత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, స్వరాడనుష్టుప్ ఛన్దః, గాంధారః స్వరః.
కన్యాభిః కిం కృత్వా కిం కార్య మిత్యాహ ? కన్య లేమియొనర్చి ఏమి ఆచరించ వలయును ?

చిదసి తయా దేవతయాఽఙ్గిరస్వద్ ధ్రువా సీద ।
పరిచిదసి తయా దేవతయాఙ్గిరస్వద్ ధ్రువా సీద॥ ॥౫౩॥

చిత్, అసి, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువా, సీద, పరిచిదితి

పరి+చిత్, అసి, తయా, దేవతయా అఙ్గిరస్వత్, ధ్రువా, సీద. ॥౫౩॥

పదార్థః :- (చిత్) సఞ్జ్ఞప్తా (అసి) (తయా) (దేవతయా) దివ్యగుణ ప్రాపికయా (అఙ్గిరస్వత్) ప్రాణవత్ (ధ్రువా) నిశ్చలా (సీద) భవ (పరిచిత్) విద్యాపరిచయం ప్రాప్తా (అసి) (తయా) ధర్మానుష్ఠాన యుక్తయా క్రియయా (దేవతయా) దివ్యసుఖ ప్రదయా (అఙ్గిరస్వత్) హిరణ్యగర్భవత్ (ధ్రువా) నిష్కమ్పా (సీద) అవతిష్ఠస్వ. ॥౫౩॥ అన్వయః :- హే కన్యే! యా చిదసి సా త్వం తయా దేవతయా సహాఙ్గిరస్వత్ ధ్రువా సీద. హే బ్రహ్మచారిణి! యా త్వం పరిచిదసి సా తయా దేవతయా సహాఙ్గిరస్వద్ ధ్రువా సీద, ॥౫౩॥ భావార్థః :- సర్వై ర్మాతా పిత్రాదిభి రధ్యాపికాభి ర్విదుషీభిశ్చ కన్యాః సంబోధనీయాః:- భో కన్యాః! యూయం యది పూర్ణేనాఖణ్డితేన బ్రహ్మచర్యే ణాఖిలా విద్యాః సుశిక్షాః ప్రాప్య యువతయో భూత్వా స్వసదృశై ర్వరైః స్వయంవరం వివాహం కృత్వా గృహాశ్రమం కుర్యాత, తర్హి సర్వాణి సుఖాని లభేధ్వం సన్తానాశ్చ జాయేరన్. ॥౫౩॥

పదార్థము :- ఓ కన్యా ! ఏ నీవు, చిత్ అసి = సంజ్ఞప్తురాలవై యున్నావో ఆ నీవు, తయా దేవతయా = దివ్యగుణములను లభింపజేయు నా విదుషీ స్త్రీతో. అఙ్గిరస్వత్ = ప్రాణతుల్యముగ, ధ్రువా సీద = ధ్రువురాలవు గమ్ము. ఓ బ్రహ్మచారిణీ ! ఏ నీవు, పరిచిత్ అసి = వివిధ విద్యలను పొందిన దానవో ఆ నీవు, తయా దేవతయా = ధర్మానుష్ఠానముతో కూడిన దివ్యసుఖదాయక మగు క్రియచే, అంగిరస్వత్ = ఈశ్వరునివలె, ధ్రువా సీద = అచలముగ అవస్థితవు గమ్ము. ॥౫౩॥

భావార్థము:-సకల మాతాపితరులు, విదుషీమతల్లులగు అధ్యాపికలు కన్యలకు[ఇటుల]చక్కగ బుద్ధిగఱప వలయును :— ఓ కన్యలారా ! మీరు అఖండితమగు పూర్ణ బ్రహ్మచర్యముతో సంపూర్ణ విద్యను, సుశిక్షను పొంది యువతులై, స్వతుల్యులగు వరులతో స్వయంవర వివాహమాడి గృహాశ్రమమును అనుష్ఠించుచో సకలసుఖములు లభించును. మంచి సంతానము కూడ కలుగును.

---

౫౪ లోకం పృణేత్యస్య విశ్వామిత్ర ఋషిః, అగ్నిర్దేవతా, విరాడనుష్టుప్ఛన్దః, గాంధారః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల విషయ మయ్యదియే.

లోకం పృణ ఛిద్రం పృణాథో సీద ధ్రువా త్వమ్।
ఇన్ద్రాగ్నీ త్వా బృహస్పతి రస్మిన్ యోనావసీషదన్ ॥౫౪॥

లోకం, పృణ, ఛిద్రమ్, పృణ, అథో ఇత్యథో, సీద, ధ్రువా, త్వమ్ ఇన్ద్రాగ్నీ ఇతీన్ద్రాగ్నీ, త్వా, బృహస్పతిః, అస్మిన్, యోనౌ, అసీషదన్, అసీషదన్నిత్యసీ సదన్

పదార్థః :- (లోకమ్) సంప్రేక్షితవ్యమ్ (పృణ) తర్పయ (ఛిద్రమ్) ఛినత్తి యత్తత్ (పృణ) పిపూర్ధి (అథో) (సీద) (ధ్రువా) దృఢనిశ్చయా (త్వమ్) (ఇన్ద్రాగ్నీ) మాతా పితరౌ (త్వా) త్వామ్ (బృహస్పతిః) బృహత్యా వేదవాచః పాలికాధ్యాపికా (అస్మిన్) విద్యాబోధే (యోనౌ) బన్ధచ్ఛేదకే మోక్ష ప్రాపకే (అసీషదన్) ప్రాపయన్తు. ॥౫౪॥ అన్వయః :- హే కన్యే! యాం త్వా యోనా వస్మిన్నిన్ద్రాగ్నీ బృహస్పతిశ్చాసీషదన్ తస్మిన్ త్వం ధ్రువా సీదాథో ఛిద్రం పృణ లోకం పృణ. ॥౫౪॥ భావార్థః :- మాతా పిత్రాచార్యై రీదృశీ ధర్మ్యా విద్యాశిక్షా క్రియేత యాం స్వీకృత్య సర్వాః కన్యా నిశ్చిన్తా భూత్వా సర్వాణి దుర్వ్యసనాని త్యక్త్వా సమావర్తనానన్తరం

స్వయం వరం వివాహం కృత్వా సుపురుషార్థే నానన్దయేయుః. ॥౫౪॥

పదార్థము :- ఓ కన్యా! త్వా = ఏ నీకు, యోనౌ = బంధనములభేదకము, మోక్షప్రాప్తికి హేతువగు, అస్మిన్ = ఈ విద్యాబోధయందు, ఇంద్రాగ్నీ = మాతాపితలు మఱియు, బృహస్పతిః = పెద్ద పెద్ద వేదవాణులను రక్షించు అధ్యాపిక స్త్రీ, అసీషదన్ = లభింప జేయుదురో! అందు, త్వమ్ = నీవు, ధ్రువా = దృఢనిశ్చయముతో, సీద = స్థితపడుము, అథో = అనంతరము. ఛిద్రమ్ = ఛిద్రమును, పృణ = పూరించుము. మఱియు, లోకమ్ = చూడదగిన ప్రాణులను, పృణ = తృప్తపఱచుము. ॥౫౪॥

భావార్థము :- తల్లి దండ్రులు గురువులు ధర్మయుక్తములగు విద్యాశిక్షలను గఱపవలయును వానిని స్వీకరించి సకల కన్యలు నిశ్చింతలై సకల దుర్వ్యసనముల త్యజించి సమావర్తనానంతరము స్వయంవర వివాహ మొనర్చుకొని మంచి పురుషార్థముతో నానందముగ నుండవలయును. ౫౪ (౫౬౭)

౫౬లా తా అస్యేత్యస్య ప్రియమేధా ఋషిః, ఆపో దేవతా, విరాడనుష్టుప్ఛన్దః, గాంధారః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఙ్గల నా విషయమే.

తా అస్య సూదదోహసః సోమꣳ శ్రీణన్తి పృశ్నయః ।
జన్మన్దేవానాం విశస్త్రిష్వా రోచనే దివః॥ ॥౫౫॥

తాః, అస్య, సూదదోహస ఇతి సూద+దోహసః, సోమమ్, శ్రీణన్తి,
పృశ్నయః, జన్మన్, దేవానామ్, విశః, త్రిషు, ఆ, రోచనే, దివః. [౫౫]

పదార్థః :- (తాః) బ్రహ్మచారిణీః, (అస్య) గృహాశ్రమస్య (సూదదోహసః) సూదాః సుష్ఠు పాచకా దోహసో గవాది దోగ్ధారశ్చ యాసాం తాః (సోమమ్) సోమరసాన్వితం పాకమ్ (శ్రీణన్తి) పరిపక్వం కుర్వన్తి (పృశ్నయః) సుస్పర్శా స్తన్వఙ్గ్యః. అత్ర స్పృశధాతో ర్నిః ప్రత్యయః స లోపశ్చ (జన్మన్) జన్మని ప్రాదుర్భావే (దేవానామ్) దివ్యానాం విదుషాం పతీనామ్ (విశః) ప్రజాః (త్రిషు) భూతభవిష్య ద్వర్తమానేషు కాలావయవేషు (ఆ) (రోచనే) రుచికరే వ్యవహారే (దివః) దివ్యస్య. ॥౫౫॥ అన్వయః :- యా దేవానాం సూదదోహసః పృశ్నయః పత్న్యో జన్మన్ ద్వితీయే విద్యాజన్మని విదుష్యో భూత్వా దివోఽస్య సోమం శ్రీణన్తి తా ఆరోచనే త్రిషు సుఖదా భవన్తి విశశ్చ ప్రాప్నువన్తి. ॥౫౫॥ భావార్థః :- యదా సుశిక్షితానాం విదుషాం యూనాం స్వసదృశా రూపగుణ సమ్పన్నాః స్త్రియో భవేయు స్తదా గృహాశ్రమే సర్వదా సుఖం సుసన్తానాశ్చ జాయేరన్. నహ్యేవం వినా వర్తమానేఽభ్యుదయో మరణానన్తరం నిఃశ్రేయసం చ ప్రాప్తుం శక్యమ్.

పదార్థము:- దేవానామ్ = దివ్య విద్వాంసులగు పతులకు, సూదదోహసః = సుందర పాచకులను, గవాదులను దోహన మొనర్చు సేవకులను గలవారలై, పృశ్నయః = ఏ కోమల శరీరిణులు, తన్వంగులు, జన్మన్ = ద్వితీయ విద్యారూపజన్మయందు విదుషీ మణులై, దివః = దివ్యమైన, అస్య = ఈ గృహాశ్రమమందు. సోమమ్ = ఉత్తమౌషధుల రసముతో కూడిన భోజనమును, శ్రీణన్తి = పక్వ మొనర్చుచున్నారో. తాః = ఆ బ్రహ్మచారిణులు, ఆరోచనే = మంచి రుచికారకమగు వ్యవహారమునందు, త్రిషు = గతము, ఆగామి, వర్తమాన మను మూడు కాలవిభాగములందును సుఖము నొసగు

వారగుదురు. పితః = ఉత్తమ సంతానమును కూడ పొందెదరు. ॥౫౪॥

భావార్థము :- మంచి శిక్షను పొందిన యువతి విద్వాంసులకు స్వసదృశ రూపగుణములుగలిగి యున్న స్త్రీలు లభించినట్లయితే గృహాశ్రమమున సుఖము, సు సంతానము ఉత్పన్న మగును. ఇటు లొనర్చనిదే సాంసారిక సుఖములు. మరణానంతరము నిశ్రేయసము ఎన్నటికి లభించవు. ॥౫౫॥

౫౬— ఇన్ద్రం విశ్వేత్యస్య కుత్సజేతృ మధుచ్ఛన్దా ఋషిః, ఇంద్రో దేవతా. నిచృదనుష్టు ప్ఛన్దః, గాన్ధారః స్వరః.

కుమార కుమారీభి రిత్థం కర్తవ్య మిత్యాహ. కుమార కుమార్తె లిటు లొనరించ వలెను.

ఇన్ద్రం విశ్వా అవీవృధన్ త్సముద్రవ్యచసం గిరః ।
రథీతమꣳ రథీనాం వాజానాꣳ సత్పతిం పతిమ్॥ ॥౫౬॥

ఇన్ద్రమ్, విశ్వాః, అవీవృధన్, సముద్రవ్యచసమితి సముద్ర+వ్యచసమ్,
గిరః, రథీతమమ్ రథితమమితి రథి+తమమ్, రథీనామ్, రథినామితి
రథినామ్ వాజానామ్, సత్పతిమితి సత్+పతిమ్, పతిమ్. [౫౬]

పదార్థః :— (ఇన్ద్రమ్) పరమైశ్వర్యమ్ (విశ్వాః) అఖిలాః (అవీవృధన్) వర్ధేయుః (సముద్రవ్యచసమ్) సముద్రస్య వ్యచసో వ్యాప్త్యా ఇవ యస్మింస్తమ్ (గిరః) వేదవిద్యా సంస్కృతా వాచః (రథీతమమ్) అతిశయేన ప్రశస్తరథయుక్తమ్ (రథీనామ్) ప్రశస్తానాం వీరాణామ్. అత్ర ఛన్దసి వనిపా వితీకారః (వాజానామ్) సంగ్రామాణాం మధ్యే (సత్పతిమ్) సత ఈశ్వరస్య వేదస్య ధర్మస్య జనస్య వా పాలకమ్ (పతిమ్) అఖిలైశ్వర్యం స్వామినమ్. ॥౫౬॥ అన్వయః :- హే స్త్రీ పురుషాః యూయం యథా విశ్వా గిరః సముద్ర వ్యచసం వాజానాం రథీనాం మధ్యే రథీతమం సత్పతిం పతి మవీవృధంస్తథా సర్వాన్వర్ధయత. ॥౫౬॥ భావార్థః :- యే కుమారా యాశ్చ కుమార్యో దీర్ఘేణ బ్రహ్మచర్యేణ సాంగోపాఙ్గాన్ వేదానధీత్య స్వప్రసన్నతయా స్వయం వరం వివాహం కృత్వైశ్వర్యాయ ప్రయతేరన్. ధర్మ్యేణ వ్యవహారేణా వ్యభిచారతయా సుసన్తానముత్పాద్య పరోపకారే ప్రవర్త్తేరంస్త ఇహాముత్ర సుఖమశ్నువీరన్ న చేతరేఽవిద్వాంసః ॥౫౬॥

పదార్థము :—ఓ స్త్రీ పురుషులారా! ఎటుల, విశ్వాః గిరః = సమస్త వేదవిద్యచే సంస్కరించ బడిన వాణులు. సముద్ర వ్యచసమ్ = సముద్రవ్యాప్తి వంటి వ్యాప్తి కలిగియున్న, వాజానామ్ = సంగ్రామములందును. రథీనామ్ = ప్రశంసిత రథములు గలిగియున్న వీరపురుషులలోను, రథీతమమ్ = అతి ప్రశంశితమైన రథముకలిగియున్న, సత్పతిమ్ = సత్యమును, ఈశ్వరుని, వేదమును, ధర్మమును, రక్షించు శ్రేష్ఠపురుషుడునగు, పతిమ్ = సకలైశ్వర్యముల స్వామిని, అవీ వృధన్ = పెంపొంద జేయుడు. మఱియు, ఇంద్రమ్ = పరమైశ్వర్యమును వృద్ధిజేయుడు. అటులనే సకల ప్రాణులను పెంపొంప జేయుడు. ॥౫౬॥

భావార్థము :- ఏ కుమార కుమారీగణము దీర్ఘ బ్రహ్మచర్యమాచరించి సాంగో పాంగముగ వేదము నభ్యసించి, తమతమ ప్రసన్నతతో స్వయంవరవివాహమాడి ఐశ్వర్యమునకై ప్రయత్నించెదరో ధర్మయుక్త వ్యవహారముచే వ్యభిచారమును వదలి సుందర సంతానమును కని పరోపకార మొనర్చుటకు ప్రయత్నించెదరో వా రీ లోకమున పరలోకమున సుఖముల ననుభవించగలరు. ఇతరులు అవిద్వాంసులు పొందజాలరు. ౫౬. (౫౯౯)

౫౩౦ సమితమిత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.
అథ వివాహం కృత్వా కథం పర్తితవ్య మిత్యాహ.
వివాహమొనర్చుకొని ఎటుల ప్రవర్తించ వలెను?

సమితꣳసంకల్పేథాꣳసంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ ।
ఇష మూర్జమభి సంవసానౌ॥ ॥౫౭॥

సమ్, ఇతమ్, సమ్, కల్పేథామ్, సంప్రియావితి సమ్+ప్రియౌ, రోచిష్ణూ ఇతి రోచిష్ణూ, సుమనస్యమానావితి సు+మనస్యమానౌ, ఇషమ్, ఊర్జమ్, అభి, సంవసానావితి సమ్+వసానౌ. [౫౭]

పదార్థః :- (సమ్) ఏకీభావమ్ (ఇతమ్) ప్రాప్నుతమ్ (సమ్) సమానాభి ప్రాయే (కల్పేథామ్) సమర్థయతామ్ (సంప్రియౌ) పరస్పరం సమ్యక్ ప్రీతియుక్తౌ (రోచిష్ణూ) విషయాసక్తి విరహత్వేన దేదీప్యమానౌ (సుమనస్యమానౌ). సుమనసౌ సఖాయౌ విద్వాంసౌ వివాచరన్తౌ (ఇషమ్) ఇచ్ఛామ్ (ఊర్జమ్) పరాక్రమమ్ (సంవసానౌ) సమ్యక్ సువస్త్రాలంకారై రాచ్ఛాదితౌ. ॥౫౭॥
అన్వయః:- హే వివాహితౌ స్త్రీ పురుషౌ! యువాం సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ సంవసానౌ సన్తావిషం సమిత మూర్జమభి సంకల్పేథామ్. ॥౫౭॥ భావార్థః :- యది స్త్రీ పురుషౌ సర్వథా విరోధం విహాయాన్యోన్యస్య ప్రియాచరణే రతౌ విద్యావిచారయుక్తౌ సువస్త్రాలంకృతౌ భూత్వా ప్రయతేతాం తదా గృహే కల్యాణ మారోగ్యం వర్ధేతామ్. యది చ విద్వేషిణౌ భవేతాం తదా దుఃఖసాగరే సంమగ్నౌ భవేతామ్. ॥౫౭॥

పదార్థము:- వివాహిత స్త్రీపురుషులారా ! మీరు, సంప్రియౌ = పరస్పర ప్రేమగలవారు, రోచిష్ణూ = విషయాశక్తికి దూరులై ప్రకాశించువారు, సుమనస్యమానౌ = మిత్రులగు విద్వాంసులవలె మెలగువారు, సంవసానౌ = సుందర వస్త్రాభూషణములు కలిగినవారును నై, ఇషమ్ = ఇచ్ఛను, సమితమ్ = ఒకేసారి పొందుడు. మఱియు, ఊర్జమ్ = పరాక్రమమును, అభి = సన్ముఖమున, సంకల్పేథామ్ = ఏకాభిప్రాయమున సమర్పించుడు. ॥౫౭॥

భావార్థము:- స్త్రీపురుషులు అన్నివిధముల విరోధమును వదలి, పరస్పర ప్రీతియందు తత్పరులై, విద్యావిచారముచే యుక్తులై, సుందర వస్త్రాభూషణములను ధరించినవారలై ప్రయత్న మొనర్చుచో నింటిలో కల్యాణము ఆరోగ్యము అభివృద్ధి చెందును. పరస్పర విరోధుల గుచో దుఃఖ సాగరమున తప్పక మునిగెదరు. ౫౭. (౫౩౦)

---

౫౩౧ సం వామిత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగుపరిష్టాద్ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
అధ్యాపకోపదేశకౌ యావ త్సామర్థ్యం తావద్ వేదాధ్యయనోపదేశౌ కుర్యా రిత్యాహ.
అధ్యాప కోపదేశకులు శక్తికొలది వేదములను చదివించ వలెను, ఉపదేశించవలెను.

సం వాం మనాꣳసి సం వ్రతా సము చిత్తా న్యాకరమ్ ।
అగ్నే పురీష్యాధిపా భవ త్వం న ఇషమూర్జం యజమానాయ ధేహి. ॥౫౮॥

సమ్, వామ్, మనాంసి, సమ్, వ్రతా, సమ్, ఊఇతి ఇత్యూ, చిత్తాని, ఆ, అకరమ్, అగ్నే, పురీష్య, అధిపా ఇత్యధి+పాః, భవ, త్వమ్, నః, ఇషమ్. ఊర్జమ్, యజమానాయ, ధేహి [౫౮]

పదార్థః :- (సమ్) ఏకస్మిన్ ధర్మే (వామ్) యువయోః (మనాంసి) సంకల్ప వికల్పాద్యా అంతఃకరణ వృత్తయః (సమ్) (వ్రతా) సత్యభాషణాదీని (సమ్) (ఉ) సముచ్చయే (చిత్తాని) సంజ్ఞప్తాని ధర్మ్యాణి కర్మాణి (ఆ) సమన్తాత్ (అకరమ్) కుర్యామ్ (అగ్నే) ఉపదేశకాచార్య (పురీష్య) పురీషేషు పాలకేషు వ్యవహారేషు భవ స్తత్సంబుద్ధౌ (అధిపాః) అధికః పాలకః (భవ) (త్వమ్) (నః) అస్మాకమ్ (ఇషమ్) అన్నాదికమ్ (ఊర్జమ్) శరీరాత్మబలమ్ (యజమానాయ) ధర్మేణ సంగంతుం శీలాయ (ధేహి). ॥౫౮॥ అన్వయః :- హే స్త్రీ పురుషౌ! యథాऽహ మాచార్యో వాం సంమనాంసి సంవ్రతా సంచిత్తాన్యాకరం తథా యువాం మమ ప్రియమాచరే తమ్, హే పురీష్యాగ్నే! త్వం నోऽధిపా భవ యజమానాయేష మూర్జం చ ధేహి. ॥౫౮॥ భావార్థః:- ఉపదేశకా యావచ్ఛక్యం తావత్ సర్వేషామైకధర్మ్య మైక కర్మ్య మేకనిష్ఠాం తుల్య సుఖదుఃఖే యథా స్యాత్తథా శిక్షయేయుః. సర్వే స్త్రీ పురుషా ఆప్త విద్వాంసమే వోపదేష్టార మధ్యాపకం సేవే రన్న చైతేషా మైశ్వర్య పరాక్రమ వృద్ధిం కుర్యాత్. నైకధర్మాదిభి ర్వినాऽత్మను సౌహార్దం జాయతే. నైతేన వినా సతతం సుఖం చ. ॥౫౮॥

పదార్థము :- స్త్రీపురుషులారా ! ఆచార్యుడనైన నేను ఎటుల, వామ్ = మీ యిరువురియొక్క, సంమనాంసి = సంకల్ప వికల్పాద్యన్తఃకరణ ప్రవృత్తులను ఒకే ధర్మమందు, సంవ్రతా = సత్య భాష ణాదులందు, ఉ = మఱియు, సమ్ చిత్తాని = చక్కగా నెరిగిన కర్మలందు, ఆ అకరమ్ = చక్కగా, ఒనర్చెదనో, అటులనే మీరిరువురు నా ప్రీతి కనుకూలముగ చరించుడు. పురీష్య = రక్షాయోగ్య వ్యవ హారములందు మెలగువాడా! అగ్నే = ఉపదేశకా! ఆచార్యా! రాజా! త్వమ్ = నీవు, నః = మమ్మ అధిపాః = అధికముగ రక్షించువాడవు, భవ = కమ్ము. యజమానాయ = ధర్మానుకూలమగు సత్సంగ మొనర్చు స్వభావముగల పురుషునికొఱకు, లేక అట్టి స్త్రీ కొఱకు, ఇషమ్ = అన్నాద్యుత్తమ పదార్ధ ములను మఱియు, ఊర్జమ్ = శరీరాత్మల బలమును, ధేహి = ధారణ మొనర్చుము. ॥౫౮॥

భావార్థము :- ఉపదేశకుడు సామర్థ్యమున్నంత వరకు మానవులందరొకేధర్మము, ఒకే కర్మ, ఒకే విధమైన చిత్తవృత్తి, సమానమైన సుఖదుఃఖములు కలిగియుండునటుల శిక్ష గఱప వల యును. స్త్రీపురుషులందరు ఆప్తవిద్వాంసునినే ఉపదేశకుడుగను అధ్యాపకుడుగను స్వీకరించి సేవించ వలయును. ఉపదేశకాచార్యులు వీరి ఐశ్వర్య పరాక్రమములను వృద్ధిపఱచ వలెను. మానవుల కందరి కొకే ధర్మాదులు లేనిదే ఆత్మలందు మైత్రి కలుగదు. మైత్రిలేనిదే నిరంతర సుఖము లభించజాలదు.

౫౯- అగ్నే త్వమిత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, అగ్నిర్దేవతా, భురిగుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

కేऽధ్యాప నోపదేశాయ నియోజనీయా ఇత్యాహ.

చదివించుటకు, ఉపదేశించుట కెవరిని నియుక్తమొనర్చ వలెను ?

అగ్నే త్వం పురీష్యో రయిమాన్ పుష్టిమాఀ౨॥ అసి శివాః కృత్వా దిశః సర్వాః స్వాం యోని మిహాసదః ॥ ॥౫౯॥

అగ్నే, త్వమ్, పురీష్యః, రయిమానితి రయి+మాన్, పుష్టిమానితి పుష్టి+మాన్ అసి, శివాః, కృత్వా, దిశః, సర్వాః, స్వమ్, యోనిమ్. ఇహ, ఆ, అసదః ॥

పదార్థః :- (అగ్నే) ఉపదేశక విద్వన్ (త్వమ్) (పురీష్యః) ఐకమత్య పాలనేషు భవః (రయిమాన్) విద్యా విజ్ఞాన ధనయుక్తః (పుష్టిమాన్) ప్రశస్త శరీరాత్మ బలసహితః (అసి) (శివాః) కల్యాణోపదేశయుక్తాః (కృత్వా) (దిశః) ఉపదేష్టవ్యాః ప్రజాః (సర్వాః) సమగ్రాః (స్వమ్) స్వకీయమ్ (యోనిమ్) సుఖసాధకం దుఃఖ విచ్ఛేదక ముపదేశమ్ (ఇహ) అస్మిన్ సంసారే (ఆ) (అసదః) ఆస్వ. ॥౫౯॥ అన్వయః :- హే అగ్నే! యత స్త్వమిహ పురీష్యో రయిమాన్ పుష్టిమానసి తస్మాత్సర్వా దిశః శివాః కృత్వా స్వం యోని మాసదః. ॥౫౯॥ భావార్థః :- రాజ ప్రజాజనై ర్యేఽత్ర జితేన్ద్రియా ధార్మికాః పరోపకారప్రియా విద్వాంసో భవేయు స్తే ప్రజాసు ధర్మోపదేశాయ నియోజనీయాః. ఉపదేశకాశ్చ ప్రయత్నేన సర్వాన్ శిష్టాన్ ధర్మయుక్తాన్ సతత మవిరోధినః సుఖినః సంపాదయేయుః. ॥౫౯॥

పదార్థము:- అగ్నే = ఉపదేశక విద్వాంసుడా! త్వమ్ = నీవు, ఇహ = ఈ సంసారమున, పురీష్యః = ఐకమత్యమును పాలించుటలో తత్పరుడవు, రయిమాన్ = విద్యా విజ్ఞాన ధనములచే యుక్తుడవు మరియు, పుష్టిమాన్ = ప్రశంసిత శరీరాత్మబలములు కలిగిన వాడవున్నై, అసి = ఉన్నావు. కనుక, సర్వాః దిశః = ఉపదేశమునకు యోగ్యులగు సకల ప్రజలను, శివాః = కల్యాణకరములగు నుపదేశములచే యుక్తులగ, కృత్వా = ఒనరించి, స్వమ్ యోనిమ్ = స్వకీయమైన సుఖదాయకమును, దుఃఖ నాశకమును నగు ఉపదేశగృహమును, ఆసదః = పొందుము. (౫౯)

భావార్థము :- రాజు ప్రజలు ఇరువురు జితేంద్రియులు ధార్మికులు పరోపకారప్రియులు విద్వాంసులు నగువారినే ధర్మోపదేశమునకై నియమించవలయును. ఉపదేశకులు కూడ ప్రయత్నముతో నందఱిని సుశిక్షచే నేకధర్మ నిరతులుగను, అవిరోధులుగను సుఖులుగ నొనర్చవలయును. (౫౯)

భవతం న్న ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః. దమ్పతీ దేవతా, ఆర్షీ పఙ్క్తిశ్ఛన్దః, పఞ్చమః, స్వరః.

పునః సర్వై ర్విద్యా ప్రదానా యాప్తా విద్వాంసః ప్రార్థనీయా ఇత్యాహ.

విద్యగఱపుటకై ఆప్త విద్వాంసులను అందరు ప్రార్థించ వలయును.

భవతన్నః సమనసౌ సచేతసా వరేపసౌ। మా యజ్ఞꣳ హిꣳసిష్టం మా యజ్ఞపతిం జాతవేదసౌ శివౌ భవత మద్య నః॥ ॥౬౦॥

భవతమ్, నః, సమనసావితి స+మనసౌ, సచేతసావితి స+చేతసౌ, అరేపసౌ, మా, యజ్ఞమ్, హిꣳసిష్టమ్, మా, యజ్ఞపతిమితి యజ్ఞ+పతిమ్, జాతవేదసావితి జాత+వేదసౌ, శివౌ, భవతమ్, అద్య, నః. ॥౬౦॥

పదార్థః :- (భవతమ్) (నః) అస్మభ్యమ్ (సమనసౌ) సమానవిచారౌ (సచేతసౌ) సమానసంజ్ఞానౌ (అరేపసౌ) అనపరాధినౌ (మా) (యజ్ఞమ్) సంగంతవ్యం ధర్మమ్ (హింసిష్టమ్) హింస్యాతామ్ (మా) (యజ్ఞపతిమ్) ఉపదేశేన ధర్మరక్షకమ్ (జాతవేదసౌ) ఉత్పన్నాఽఖిలవిజ్ఞానౌ (శివౌ) మంగళకారిణౌ (భవతమ్) (అద్య) (నః) అస్మభ్యమ్. ॥౬౦॥ అన్వయః :- హే వివాహితౌ స్త్రీ పురుషౌ! యువా

నః సమనసౌ సచేతసా వరేపసౌ భవతమ్, యజ్ఞం మా హింసిష్టం యజ్ఞపతిం మా హింసిష్టమ్. అద్య నో జాతవేదసౌ శివౌ భవతమ్. ॥౬౦॥ భావార్థః :- స్త్రీ పురుషజనైః సత్యోపదేశా యాధ్యాపనాయ పూర్ణవిద్యాః ప్రగల్భాః నిష్కపటా ఆప్తా నిత్యం ప్రార్థనీయా విద్వాంసస్తు సర్వేభ్య ఏవ ముపదిశేయు రతః సర్వే ధర్మాచారిణః స్యుః. ॥౬౦॥

పదార్థము :- వివాహితులైన స్త్రీ పురుషులారా! మీరిరువురు. నః = మాకై, సమనసౌ = ఒకే మనస్సుగలవారు, సచేతసౌ = ఒకే జ్ఞానముగలవారు, అరేపసౌ = అపరాధరహితులు, భవతమ్ = కండు. యజ్ఞమ్ = పొందదగిన ధర్మమును, మా హింసిష్టమ్ = చెఱపకుడు. యజ్ఞపతిమ్ = ఉపదేశముచే ధర్మరక్షణ మొనర్చువానిని, మా = హింసించకుడు. అద్య = నేడు, నః = మాకొఱకు, జాతవేదసౌ = సంపూర్ణ విజ్ఞానమును పొందినవారలు, శివౌ = మంగళకరులు, భవతమ్ = కండు. ౹౬౦౹

భావార్థము :- స్త్రీ పురుషులు సత్యోపదేశము కొఱకు, అధ్యాపనము కొఱకు, పూర్ణ విద్వాంసులు, ప్రగల్భులు, నిష్కపటులు, ఆప్తులనగువారిని నిత్యము ప్రార్థించి సేవించవలయును. విద్వాంసులును అందఱు ధర్మాచరణ మొనర్చువారగునటుల నుపదేశించవలయును. ౬౦. (౫౭౩)

౫౭౪ మాతేవేత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, పత్నీ దేవతా, ఆర్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.
మాతా కింవత్సంతానాన్ పాలయ తీత్యాహ. మాత దేనివలె సంతానమును పాలించుచున్నది?

మాతేవ పుత్రం పృథివీ పురీష్యమగ్నిꣳ స్వే యోనావభారుఖా ।
తాం విశ్వై ర్దేవై రృతుభిః సంవిదానః ప్రజాపతి ర్విశ్వకర్మా వి ముఞ్చతు॥౬౧

మాతేవేతి మాతా ఇవ, పుత్రమ్, పృథివీ,పురీష్యమ్, అగ్నిమ్, స్వే, యోనౌ, అభాః, ఉఖా, తామ్, విశ్వైః, దేవైః ఋతుభిరిత్యృతు+భిః, సంవిదాన ఇతి సమ్+విదానః, ప్రజాపతి రితి ప్రజా+పతిః,విశ్వకర్మేతి విశ్వ+కర్మా,వి,ముఞ్చతు.

పదార్థః :- (మాతేవ) (పుత్రమ్) (పృథివీ) భూమి వద్వర్తమానా విదుషీ స్త్రీ (పురీష్యమ్) పుష్టికరేషు గుణేషు భవమ్ (అగ్నిమ్) విద్యుతమివ సుప్రకాశమ్ (స్వే) స్వకీయే (యోనౌ)గర్భాశయే (అభాః) పుష్ణాతి ధరతి వా (ఉఖా) జ్ఞాతు మర్హా (తామ్) (విశ్వైః) సర్వైః (దేవైః) దివ్యైర్గుణైః సహ (ఋతుభిః) వసన్తాద్యైః (సంవిదానః)సమ్యగ్ జ్ఞాపయన్ (ప్రజాపతిః) పరమేశ్వరః (విశ్వకర్మా) అఖిలోత్తమక్రియాః (వి) విరుద్ధార్థే (ముఞ్చతు). ॥౬౧॥ అన్వయః :-యోఖా పృథివీ వద్వర్తమానా స్త్రీ స్వే యోనౌ పురీష్య మగ్నిం పుత్రం మాతేవాభా ధరతి తాం సంవిదానో విశ్వకర్మా ప్రజాపతి ర్విశ్వై ర్దేవై రృతుభిః సహ సతతం దుఃఖా ద్విముఞ్చతు పృథగ్రక్షతు. ॥౬౧॥ భావార్థః:- అత్రోపమాలంకారః.యథా జననీ సన్తానానుత్పాద్య పాలయతి తథైవ పృథివీ కారణస్థాం విద్యుతం ప్రకటయ్య రక్షతి. యథా పరమేశ్వరో యాథాతథ్యేన పృథివ్యాది గుణాన్ జానాతి ప్రతి నియత సమయమృత్వాదీన్ పృథివ్యాదీంశ్చ ధృత్వా స్వస్వనియత పరిధౌ చాలయిత్వా ప్రలయసమయే భినత్తి తథైవ విద్వద్భి ర్యథా బుధ్యైతాన్ విదిత్వా కార్యసిద్ధయే ప్రయతితవ్యమ్. ॥౬౧॥

పదార్థము:- ఉఖా = ఎఱుగదగినది, పృథివీ = భూమివలె నుండు నే విదుషీస్త్రీ, స్వే యానౌ = స్వకీయ గర్భాశయమందు, పురీష్యమ్ = పుష్టికర గుణముగలవాడు, అగ్నిమ్ = విద్యుత్తువలె

చక్కని ప్రకాశముతో కూడిన గర్భరూపమున నున్న, పుత్రమ్ = పుత్రుని, మాతేవ = తల్లివలె, అభాః = పుష్టపరచు చున్నదో లేక ధారణమొనర్చు చున్నదో, తామ్ = ఆబిడను, సంవిదానః = చక్కగ బోధించువాడు, విశ్వకర్మా = సర్వోత్తమ కర్మలొనర్చువాడు, ప్రజాపతిః = పరమేశ్వరుడు, విశ్వైః దేవైః = సకల దివ్యగుణములచేతను, ఋతుభిః = వసంతాది ఋతువుల చేతను, నిరంతరము దుఃఖమునుండి, వి ముఞ్చతు = వేరుపఱచుగాక। ॥౬౧॥

భావార్థము :- ఈ మంత్రమునందు ఉపమాలంకారమున్నది. తల్లి యెటుల సంతానమును కని రక్షించుచున్నదో అటులనే భూమి కారణరూపమగు విద్యుత్తును ప్రసిద్ధ పఱచి రక్షించుచున్నది. పరమేశ్వరుడెటుల యాథాత్థ్యముగ పృథివ్యాది గుణముల నెఱుగుచున్నాడో, ప్రతి నియత సమయము నందు ఋత్వాదులను, పృథివ్యాదులను ధరించి స్వకీయనియత పరిధుల మధ్య నడిపించి ప్రళయ సమయమున భేదించుచున్నాడో అటులనే విద్వాంసులును యథాబుద్ధి వీనినెఱిగి కార్యసిద్ధికై ప్రయత్నించవలయును, ౬౧. (౫౦౪)

౫౦౫ అసున్వన్తమిత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, నిరృతి ర్దేవతా, నిచృత్త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.
స్త్రియః కీదృశాన్పతీన్నే చ్ఛేయురిత్యాహ. స్త్రీ లెటువంటి పతిని అభిలషించకూడదు?

అసున్వన్త మయజమానమిచ్ఛ స్తేనస్యేత్యా మన్విహి తస్కరస్య।
అన్యమస్మదిచ్ఛ సా త ఇత్యా నమో దేవి నిరృతే తుభ్యమస్తు॥ ॥౬౨॥

అసున్వన్తమ్, అయజమానమ్, ఇచ్ఛ, స్తేనస్య, ఇత్యామ్, అను, ఇహి, తస్కరస్య, అన్యమ్, అస్మత్, ఇచ్ఛ, సా, తే, ఇత్యా, నమః, దేవి, నిరృత ఇతి నిః+ఋతే, తుభ్యమ్, అస్తు. [౬౨]

పదార్థః :- (అసున్వన్తమ్)అభిషవాది క్రియానుష్ఠాన రహితమ్(అయజమానమ్)అదాతారం (ఇచ్ఛ)(స్తేనస్య) అప్రసిద్ధచోరస్య(ఇత్యామ్)ఏతుమర్హాం క్రియాం(అను) (ఇహి)గచ్ఛ(తస్కరస్య) ప్రసిద్ధచోరస్య(అన్యమ్) భిన్నం (అస్మత్)(ఇచ్ఛ)(సా)(తే) తవ(ఇత్యా) ఏతుమర్హా క్రియా (నమః) అన్నం (దేవి)విదుషి(నిరృతే)నిత్యే సత్యాచార పృథివీ వద్వర్తమానే(తుభ్యం)(అస్తు)భవతు, ॥౬౨॥

అన్వయః :- హే నిరృతే దేవి త్వమస్మత్ స్తేనస్య తస్కరస్య సమ్బన్ధినం విహాయాన్య మిచ్ఛాసున్వన్త మయజమానం మేచ్ఛ. యామిత్యా మన్విహి సేత్యా తేఽస్తు నమశ్చ తస్యై తుభ్య మస్తు. ౬౨

భావార్థః:- హే స్త్రియో యూయమపురుషార్థినః స్తేన సమ్బన్ధినః పురుషాన్ పతీన్ మేచ్ఛత. ఆప్తనీతీన్ గృహ్ణీత యథా పృథి వ్యనేకోత్తమ ఫలప్రదానేన జనాన్ రఞ్జయతి తథా భవత. ఏవం భూతాభ్యో యుష్మభ్యం వయం నమః కుర్మః. యథా వయ మలసేభ్యః స్తేనేభ్యశ్చ పృథగ్ వర్తేమహి తథా యూయమపి వర్తధ్వమ్. ॥౬౨॥

పదార్థము :- నిరృతే = [నిత్యము సత్యాచారమునందు] పృథివివలె నుండుదానా! దేవి = విదుషీమణీ!నీవు, అస్మత్ = మాకంటె భిన్నులగు, స్తేనస్య = అప్రసిద్ధుడగు(చాటు)దొంగను, తస్కరస్య = ప్రసిద్ధచోరుని, వానికి సంబంధించిన వానిని త్యజించి, అన్యమ్ = ఇతరుని, ఇచ్ఛ = కోరుము వరించుము. మఱియు, అసున్వంతమ్ = అభిషవాది క్రియానుష్ఠాన రహితుడు, అయజమానమ్ =

దానధర్మ రహితుడు నగు పురుషని. ఇచ్ఛ = కోరకుము. మఱియు నీవు. ఇత్యామ్ = పొందదగిన యే క్రియను, అన్విహి = వెదకెదవో, సా ఇత్యా = ఆక్రియ, తే = నీది యగుగాక ; మఱియు, తుభ్యమ్ = అట్టినీకు, నమః = అన్నము,లేక సత్కారము, అస్తు = కలుగుగాక ! ॥౬౨॥

భావార్థము ;— ఓ స్త్రీలారా ! మీరు పురుషార్థ రహితులు, దొంగలకు సంబంధించిన వారునగు వారిని పతులుగ స్వీకరించకుడు, ఆప్తుల నీతివలె నీతి కలిగినవారిని వరించుడు. పృథివి యెటుల అనేకోత్తమ ఫలముల దానముతో మానవులను రంజింపజేయుచున్నదో అటుల గండు. ఇటువంటి గుణములు కలిగియున్న మీకు మేము నమస్కార మొనర్చుచున్నాము. సోమరులనుండి, దొంగలనుండి మేము వేరుగ నుండుచున్నటుల మీరును వేరుగ నుండుడు. ౬౨, (౫౭౫)

---

౫౭౬ నమః సుత ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, నిర్ఋతి ర్దేవతా, భురిగార్షీ పంక్తి శ్ఛన్దః, పంచమః స్వరః.

పునరేతాః కథం భవేయు రిత్యాహ. ఈ స్త్రీలె టులుండవలయును?

నమః సుతే నిర్ఋతే తిగ్మతేజోఽయస్మయం విచృతా బన్ధమేతమ్ ।

యమేన త్వం యమ్యా సంవిదానోత్తమే నాకే అధి రోహయైనమ్ ॥ ॥౬౩॥

నమః, సు, తే, నిర్ఋత, ఇతి నిః+ఋతే, తిగ్మతేజ ఇతి తిగ్మ+తేజః, అయస్మయమ్, వి, చృత, బన్ధమ్, ఏతమ్, యమేన, త్వమ్, యమ్యా, సంవిదానేతి సమ్+విదానా, ఉత్తమ ఇత్యుత్+తమే, నాకే, అధి, రోహయ,ఏనమ్. [౬౩]

పదార్థః :- (నమః)అన్నాదికమ్(సు)(తే)తవ(నిర్ఋతే)నితరామృతం సత్యం యస్యాం తత్సమ్బుద్ధౌ(తిగ్మతేజః)తీవ్రాణి తేజాంసి యస్మాత్తత్(అయస్మయమ్)సువర్ణాది పరిష్కృతమ్. అయ ఇతి హిరణ్య నా. . .నిఘం. ౧. ౨.(వి)(చృత)విముఞ్చ. ద్వ్యచోఽతస్తి ఙ ఇతి దీర్ఘః (బన్ధమ్) బధ్నాతి యేన తం (ఏతమ్) యమేన న్యాయాధీశేన (త్వమ్) (యమ్యా)న్యాయకర్త్ర్యా (సంవిదానా) సమ్యక్కృత ప్రతిజ్ఞా(ఉత్తమే)(నాకే)అనన్దే భోక్తవ్యే సతి(అధి)(రోహయ)(ఏనమ్) ॥౬౩॥ అన్వయః:- హే నిర్ఋతే యస్యాస్తే తిగ్మతేజోఽయస్మయం నమోఽస్తి సా త్వమేతం బన్ధః సువిచృత. యమేన యమ్యా సహ చ సంవిదానా సత్యేనం పతిముత్తమే నాకేఽధిరోహయ ॥౬౩॥ భావార్థః:- హే స్త్రియో! యూయం యథేయం పృథివీ తేజః సువర్ణాన్నాది సంబన్ధాస్తి తథా భవత యథా యుష్మాకం పతయో న్యాయాధీశా భూత్వా సాపరాధా నపరాధినాం సత్యన్యాయేన వివేచనం కృత్వా సాపరాధాన్ దణ్డయంతి నిరపరాధినః సత్కుర్వన్తి యుష్మానన్నుత్తమానా నన్దాన్ ప్రదదతి తథా యూయమపి భవత. ॥౬౩॥

పదార్థము :- నిర్ఋతే = నిరంతరము సత్యాచరణములను కలిగియున్న ఓ స్త్రీ! తే = ఏ నీకు తిగ్మతేజః = మూడు తేజస్సులు కలిగిన, అయస్మయమ్ = సువర్ణాదులు, నమః = అన్నాది పదార్థము లున్నవో, త్వమ్ = ఆ నీవు, ఏతమ్ బన్ధమ్ = బంధనహేతువగు నీయజ్ఞానమును, వి చృత = చక్కగ త్యజించుము. యమేన = న్యాయాధీశునితోను, యమ్యా = న్యాయమొనర్చు స్త్రీ తోను, సంవిదానా = చక్కనిబుద్ధి కలిగినదానవై, ఏనమ్ = ఈ నీ పతిని, ఉత్తమే నాకే = ఉత్తమానందమును అనుభవించుటలో, అధిరోహయ = ఆరూఢ మొనర్చుము. ॥౬౩॥

భావార్థము :_ఓ స్త్రీలారా! ఎటులీ పృథ్వి తేజః సువర్ణాన్నాదులతో సంబంధమును చేయు చున్నదో అటులనే మీరును గండు. ఎటుల మీపతులు న్యాయాధీశులై అపరాధులను నిరపరాధులను సత్యన్యాయములతో విచారించి అపరాధులను దండించి నిరపరాధులను సత్కరించుచున్నారో, మీకై ఉత్తమానందములను చేకూర్చుచున్నారో అటులనే మీరును గండు. ౬౩. (౫౬౬)

---

౫౬౭ యస్యాస్త ఇత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, అగ్నిర్దేవతా, ఆర్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
కస్మై ప్రయోజనాయ దమ్పతీ భవేతా మిత్యుపదిశ్యతే.
ఏ ప్రయోజనమునకై స్త్రీ పురుషులు దంపతులుగ గావలయును?

యస్యా స్తే ఘోర ఆసన్ జుహోమ్యేషాం బన్ధానా మవసర్జనాయ ।
యాం త్వా జనో భూమిరితి ప్రమన్దతే నిరృతిం త్వాహం పరి వేద విశ్వతః ॥౬౪॥

యస్యాః, తే, ఘోరే, ఆసన్, జుహోమి, ఏషామ్, బన్ధానామ్, అవసర్జనాయే త్యవ+సర్జనాయ, యామ్, త్వా, జనః, భూమిః, ఇతి, ప్రమన్దత ఇతి ప్ర+మన్దతే, నిరృతిమితి నిః+ఋతిమ్, త్వా, అహమ్, పరి, వేద, విశ్వతః. [౬౪]

పదార్థః:-(యస్యాః)సువ్రతాయాః ప్రియా(తే)తవ(ఘోరే)భయానకే(ఆసన్)ఆస్యే ముఖే(జుహోమి)దదామి(ఏషామ్)వర్తమానానామ్(బన్ధానామ్)దుఃఖకారకత్వేన నిరోధకానామ్(అవ సర్జనాయ) త్యాగాయ (యామ్)(త్వా)త్వామ్(జనః)(భూమిః)(ఇతి)ఇవ(ప్రమన్దతే)ఆనన్దయతి (నిరృతిమ్) భూమి మివ(త్వా)(అహమ్)(పరి)సర్వతః (వేద) జానీయామ్(విశ్వతః)సర్వతః. ॥౬౪॥ అన్వయః:- హే ఘోరే పత్ని! యస్యాస్త ఆసన్నేషాం బన్ధానా మవ సర్జనాయామృతాత్మక మన్నాదికం జుహోమి యో జనో భూమి రితి యాం త్వా ప్రమన్దతే తా మహం విశ్వతో నిరృతి మివ త్వా పరి వేద సా త్వమి త్థం మాం విద్ధి. ॥౬౪॥ భావార్థః :- అత్రోపమావాచక లుప్తోపమాలంకారౌ. యథా పతయః స్వానన్దాయ ప్రియో గృహ్ణన్తి తథైవ తస్మై స్త్రియోఽపి పతీన్ గృహ్ణీయుః, అత్ర గృహాశ్రమే పతి వ్రతా స్త్రీ స్త్రీవ్రతః పతిశ్చ సుఖనిధి రివ భవతి క్షేత్రభూతా స్త్రీ బీజరూపః పుమాన్. యద్యేతయోః శుద్ధయో ర్బలవతోః సమాగమేనోత్తమా వివిధాః ప్రజా జాయేరంస్తర్హి సర్వదా భద్రం భవతీతి వేద్యమ్. ॥౬౪॥

పదార్థము :- ఘోరే = దుష్టులకు భయమునుగొల్పు మహిళ! యస్యాః తే = సువ్రతురాల వైన ఏ నీయొక్క, ఆసన్ = ముఖమునందు, ఏషామ్ బంధానామ్ = దుఃఖమొసగు నీ నిరోధకులను, అవ సర్జనాయ = త్యజించుటకై అమృతరూపములగు అన్నాది పదార్థములను, జుహోమి = ఇచ్చు చున్నానో, జనః = ఏ జనుడు, భూమిరితి = భూమివలె, యామ్ త్వా = ఏనిన్ను, ప్రమన్దతే = ఆ నంద పఱచుచున్నాడో, ఆ నిన్ను, అహమ్ = నేను, విశ్వతః = అన్ని వైపులనుండి. నిరృతిమ్ = భూమివలె, త్వా = నిన్ను, పరి = అన్ని విధముల, వేద = ఎఱుగుదును. ఆనీవును ఈవిధముగ నన్ను ను ఎఱుగుము. ॥౬౪॥

భావార్థము :- ఈ మంత్రమునం దుపమా వాచక లుప్తోపమాలంకారములున్నవి. ఎటుల పతులు స్వకీయానందముకొఱకు స్త్రీలను గ్రహించుచున్నారో, అటులనే [ఆ ఆనందముకొఱకు] స్త్రీ

లును పతులను గ్రహించెదరుగాక! ఈ గృహాశ్రమమునందు పతివ్రత స్త్రీ, స్త్రీవ్రతుడైన పతి సుఖము నకు నిధివలె నుందురు. స్త్రీ క్షేత్రరూపము, పురుషుడు బీజరూపము బలవంతులు శుద్ధులునగు నీ దంపతుల సమాగమమువలన ఉత్తమమగు వివిధ సంతానము కలుగుచో ఎల్లప్పుడు కల్యాణ మభివృద్ధి యగునని ఎఱుగవలయును. ౬౪. (౫౭౭)

౫౭౮ యం తే దేవీత్యస్య మధుచ్ఛన్దా ఋషిః, యజమానో దేవతా, ఆర్షీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

వివాహ సమయే కీదృశీః ప్రతిజ్ఞాః కుర్యు రిత్యాహ.

వివాహ సమయమున నెటువంటి ప్రతిజ్ఞల నొనర్చవలయును?

యన్తే దేవీ నిర్ఋతి రాబబన్ధపాశం గ్రీవాస్వవిచృత్యమ్ । తం తే విష్యామ్యాయుషో న మధ్యాదథైతం పితుమద్ధి ప్రసూతః । నమో భూత్యై యేదం చకార ॥ ॥౬౫॥

యమ్, తే, దేవీ, నిర్ఋతి రితి నిః+ఋతిః, ఆబబన్ధేత్యా+బబన్ధ, పాశమ్, గ్రీవాసు, అవిచృత్యమిత్యవి+చృత్యమ్, తమ్, తే, వి, స్యామి, ఆయుషః, న, మధ్యాత్, అథ, ఏతమ్, పితుమ్, అద్ధి, ప్రసూత ఇతి ప్ర+సూతః, నమః, భూత్యై, యా, ఇదమ్, చకార. [౬౫]

పదార్థః :- (యమ్)(తే)తవ(దేవీ) దివ్యా స్త్రీ(నిర్ఋతిః) పృథివీవ(ఆబబన్ధ)సమన్తాద్బధ్నామి (పాశమ్)ధర్మ్యం బన్ధనమ్(గ్రీవాసు) కణ్ఠేషు (అవిచృత్యమ్) అమోచనీయమ్ (తమ్) (తే)తవ(వి) (స్యామి)ప్రవిశామి(ఆయుషః)జీవనస్య(న)ఇవ(మధ్యాత్)(అథ)ఆనన్తర్యే(ఏతమ్) (పితుమ్)అన్నాదికమ్(అద్ధి)భుఙ్క్ష్వ(ప్రసూతః)ఉత్పన్నః సన్ (నమః)సత్కారే(భూత్యై)ఐశ్వర్యకారికాయై(యా) (ఇదమ్)ప్రత్యక్షం నియమనమ్(చకార) కుర్యాత్. ॥౬౫॥ అన్వయః :-హే పతే! నిర్ఋతిరివాహం తే తవ యం గ్రీవా స్వవిచృత్యం పాశమాబబన్ధ తం తే తవాప్యహం విష్యామి, ఆయుషోఽన్నస్య న విష్యామి. అథావయో ర్మధ్యాత్కశ్చిదపి నియమాత్ పృథఙ్ న గచ్ఛేత్, యథాఽహమేతం పితుమద్మి తథా ప్రసూతః సంస్త్వమేన మద్ధి. హేస్త్రి! యా త్వమిదం పతివ్రతాధర్మేణ సుసంస్కృతం చకార తస్యై భూత్యై నమోఽహం కరోమి. ॥౬౫॥ భావార్థః :-అత్రోపమాలంకారః. వివాహసమయే యానవ్యభిచారాఖ్యాదీన్ నియమాన్ కుర్యు స్తేభ్యోఽన్యథా కదాచి న్నాచరేయుః, కుతః యదా పాణిం గృహ్ణన్తి తదా పురుషస్య యావత్ స్వం తావత్సర్వం స్త్రియా యావత్స్త్రియా స్తావదఖిలం పురుషస్యైవ భవతి.యది పురుషో వివాహితాం విహాయాన్యస్త్రీగో భవేత్ స్త్రీచ పరపురుషగామినీ స్యాత్తావుభౌ స్తేనవత్పాపాత్మానౌ స్యాతామ్.అతో స్త్రియా అనుమతి మన్తరాపురుషః పురుషాజ్ఞయా చ వినా స్త్రీ కించిదపి కర్మ న కుర్యాత్.ఇదమేవ స్త్రీపురుషయోః ప్రీతికరం కర్మ యదవ్యభిచరణమితి.

పదార్థము :-స్త్రీ కథనము :-నిర్ఋతిః = భూమి సదృశమైన నేను, తే గ్రీవాసు = నీ కంఠములందు, అవిచృత్యమ్ = అమోచనీయమగు, యమ్ పాశమ్ = ధర్మయుక్తమగు నే బంధనమును, ఆబబంధ = చక్కగ బంధించుచున్నానో, తమ్ = దానిని, తే = నీ కొఱకు ప్రవేశింపజేయుచున్నాను. ఆయుషః న = ఆయువునకు బంధనమగు అన్నమువలె, వి స్యామి = ప్రవేశించుచున్నాను. అథ = తరువాత, మధ్యాత్ = మనయిరువురిలో నెవరును నియమ విరుద్ధముగ చరించకూడదు. నే

నెటుల, ఏతమ్ పితుమ్ = ఈ అన్నాదిపదార్థములను, అద్మి = భోగించుచున్నానో, అటులనే, ప్రసూతః = ఉత్పన్నుడవైన నీవు ఈ అన్నాదిపదార్థములను, భోగించుము. ఓ స్త్రీ! యా దేవీ = దివ్య గుణములుగల ఏ నీవు, ఇదమ్ = పతివ్రతా ధర్మముచే సంస్కరించ బడిన ఈ వ్యభిచారత్యాగనియమమును, చకార = ఒనర్చెదవో, భూత్యై = ఐశ్వర్య కారిణియైన అట్టి నీకై. నమః = అన్నాది పదార్థముల నిచ్చు చున్నాను. ॥౬౫॥

భావార్థము :- ఈ మంత్రము నందుపమాలంకార మున్నది. వివాహసమయ మందే వ్యభిచార త్యాగాది నియమముల నొనర్చెదరో వానికి భిన్నముగ నెన్నటికి ఆచరించరాదు. ఏలయన-పురుషుడు వివాహ సమయమున స్త్రీహస్తమును గ్రహించినప్పుడే పురుషునకున్న పదార్థ మంతయు స్త్రీదిగాను, స్త్రీకి యున్న దంతయు పురుషునిదిగాను భావించబడుచున్నది. ఏ పురుషుడు వివాహిత స్త్రీని వదలి అన్య స్త్రీని సమీపించునో, లేక ఏ స్త్రీ పరపురుషుని అభిలషించునో వారిరువురు దొంగవలె పాపాత్ములగు చున్నారు. కనుక స్త్రీ సమ్మతిలేకుండ పురుషుడు, పురుషుని యనుజ్ఞ లేనిదే స్త్రీ ఏ పని చేయకూడదు. స్త్రీ పురుషులు అన్ని వేళలందు వ్యభిచరించకుండుటయే పరస్పర ప్రేమను పెంచునదియై యున్నది.

---

౫౪౭ నివేశన ఇత్యస్య విశ్వావసు ఋషిః, అగ్ని ర్దేవతా, విరాడార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

కీదృశౌ స్త్రీపురుషౌ గృహాశ్రమం కర్తుం యోగ్యౌ స్త ఇత్యాహ.

ఎటువంటి స్త్రీ పురుషులు గృహాశ్రమ మొనర్చుటకు యోగ్యులు ?

నివేశనః సఙ్గమనో వసూనాం విశ్వా రూపాఽభిచష్టే శచీభిః ।
దేవ ఇవ సవితా సత్యధర్మేన్ద్రో న తస్థౌ సమరే పథీనామ్ ॥ ॥౬౬॥

నివేశన ఇతి నివేశనః, సఙ్గమన ఇతి సమ్+గమనః, వసూనామ్, విశ్వా, రూపా, అభి,చష్టే, శచీభిః, దేవ ఇవేతి దేవః+ఇవ, సవితా, సత్యధర్మేతి సత్యధర్మా, ఇన్ద్రః, న, తస్థౌ. సమర ఇతి సమ్+అరే, పథీనామ్. [౬౬]

పదార్థః :-(నివేశనః) యః స్త్రియాం నివిశతే(సంగమనః)సమ్యగ్గన్తా(వసూనామ్) పృథివ్యాదీనాం పదార్థానాం(విశ్వా)సర్వాణి (రూపా)రూపాణి(అభి)(చష్టే)పశ్యతి (శచీభిః)ప్రజ్ఞాభిః కర్మభి ర్వా (దేవ ఇవ)యథేశ్వరః(సవితా) సకలజగతః ప్రసవితా(సత్యధర్మా) సత్యో ధర్మో యస్య సః(ఇన్ద్రః) సూర్యః(న)ఇవ(తస్థౌ)తిష్ఠేత్(సమరే)సంగ్రామే. సమర ఇతి సంగ్రామ నా...౨. ౧౭. (పథీనామ్) గచ్ఛతామ్. ॥౬౬॥ అన్వయః :- యః సత్యధర్మా సవితా దేవ ఇవ నివేశనః సంగమనః శచీభి ర్వసూనాం విశ్వా రూపాఽభిచష్టే. ఇన్ద్రో న సమరే పథీనాం సమ్ముఖే తస్థౌ స ఏవ గృహాశ్రమాయ యోగ్యో జాయతే. ॥౬౬॥ భావార్థః :- అత్రోపమాలంకారః. మనుష్యా యథేశ్వరేణ మనుష్యోపకారాయ కారణాత్కార్యాఖ్యా అనేకే పదార్థా రచితా ఉపయుజ్యన్తే యథా సూర్యో మేఘేన సహ యుద్ధాయ వర్తతే తథా సృష్టిక్రమవిజ్ఞానేన సుక్రియయా చ భూమ్యాది పదార్థేభ్యోఽనేకే వ్యవహారాః సంసాధనీయాః. ॥౬౬॥

పదార్థము :-ఎవడు, సత్యధర్మా = సత్యధర్మయుతుడు, సవితా = సకలజగదుత్పాదకుడునగు, దేవ ఇవ = దేవునివలె, నివేశనః = స్త్రీకి స్నేహితుడు, సంగమనః = శీఘ్రగతి గలవాడును నై, శచీభిః = బుద్ధులతో లేక కర్మలతో, వసూనామ్ = పృథివ్యాది పదార్థములయొక్క, విశ్వా రూపా =

సకలరూపములను, అభిచష్టే = చూచుచున్నాడో, ఇన్ద్రః న = సూర్యునివలె, సమరే = యుద్ధము నందు, పథీనామ్ = నడచుచున్న మనుష్యుల సమ్ముఖమున, తస్థౌ = స్థితుడగుచున్నాడో, అతనే గృహాశ్రమమునకు యోగ్యుడగుచున్నాడు. ॥౬౬॥

భావార్థము :- ఈ మంత్రమందు రెండుపమాలంకారము లున్నవి ఈశ్వరు డెటుల అందటి యుపకారమునకై కారణమునుండి కార్యరూపములగు ననేక పదార్థములను సృజించి ఉపయుక్తమొ నర్చుచున్నాడో, సూర్యుడెటుల మేఘముతో సంగ్రామమొనర్చి జగత్తున కుపకార మొనర్చుచున్నాడో, అటులనే సృష్టిక్రమ విజ్ఞానముతో మంచి క్రియచేత భూమ్యాదిపదార్థముల నుండి అనేక వ్యవ హారములను సిద్ధమొనర్చి ప్రజలను సుఖపెటవలెను. ॥౬౬॥

౫౮౦ సీరా ఇత్యస్య విశ్వావసు ఋషిః, కృషీవలాః కవయో దేవతాః, గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ కృషియోగవిద్యా ఆహ. వ్యవసాయవిద్యను చెప్పుచున్నాడు.

సీరా యుఞ్జన్తి కవయో యుగా వి తన్వతే పృథక్ ।
ధీరా దేవేషు సుమ్నయా ॥ ॥౬౭॥

సీరా, యుఞ్జన్తి, కవయః, యుగా, వి, తన్వతే, పృథక్, ధీరాః, దేవేషు, సుమ్నయేతి సుమ్న+యా. [౬౭]

పదార్థః:-(సీరా)సీరాణి హలాని(యుఞ్జన్తి)యుఞ్జన్తు(కవయః)మేధావినః కవి రితి మేధావి నా.. ౩.౧౫ (యుగా)యుగాని (వి)(తన్వతే) విస్తృణన్తి (పృథక్) (ధీరాః)ధ్యానవన్తః(దేవేషు)విద్వత్సు (సుమ్నయా)సుమ్నేన సుఖేన, అత్ర తృతీయైకవచనస్యాయా దేశః. ॥౬౭॥ అన్వయః :- హే మనుష్యాః యథా ధీరాః కవయః సీరా యుగా చ యుఞ్జన్తి సుమ్నయా దేవేషు పృథగ్ వితన్వతే తథా సర్వైరేత దనుష్ఠేయమ్. ॥౬౭॥ భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలఙ్కారః. మనుష్యై రిహ విద్వచ్ఛిక్షయా కృషి కర్మోన్నేయం యథా యోగినో నాడీషు పరమేశ్వరం సమాధియోగే నోపసర్పన్తి తథైవ కృషి కర్మద్వారా సుఖోపయోగః కర్తవ్యః. ॥౬౭॥

పదార్థము :- మానవులారా! ఎటుల, ధీరాః = ధ్యానశీలురు, కవయః = బుద్ధిమంతులు, సీరాః = నాగళ్లను, యుగా = కాడి మొదలైనవానిని, యుంజన్తి = జోడించుచున్నారో మఱియు, సుమ్నయా = సుఖముతోపాటు, దేవేషు = విద్వాంసులలో, పృథక్ = వేఱుగ, వితన్వతే = విస్తారయుక్తముగ నొనర్చుచున్నారో, అటులనే అంద ఱీకృషి కర్మ ననుష్ఠించవలయును. ॥౬౭॥

భావార్థము :- ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది. విద్వాంసుల శిక్షచే నిలలో కృషికర్మను వృద్ధిపఱచుట మానవులకర్తవ్యము. యోగులెటుల నాడులలో పరమేశ్వరుని సమాధియోగముచే పొందుచున్నారో అటులనే కృషికర్మద్వారా సుఖములను పొందవలయును.

---

౫౮౧ యునక్తేత్యస్య విశ్వావసు ఋషిః, కృషీవలాః కవయో వా దేవతాః, విరాడార్షీ త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయ మాహ, మఱల నవ్విషయమే.

యునక్త సీరా వి యుగా తనుధ్వం కృతే యోనౌ వపతేహ బీజమ్ ।
గిరా చ శ్రుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్సృణ్యః పక్వ మేయాత్ ॥ ॥౬౮॥

యునక్త, సీరా, వి, యుగా, తనుధ్వమ్, కృతే, యోనౌ, వపత, ఇహ, బీజ గిరా, చ, శ్రుష్టిః, సభరా ఇతి స+భరాః, అసత్, నః, నేదీయః, ఇత్, సృణ్యః, పక్వమ్, ఆ, ఇయాత్. [౬౮]

పదార్థః :- (యునక్త) యుఙ్క్వమ్(సీరా) హలాదీని కృష్యుపకారణాని నాడీ ర్వా(వి)వివిధార్థే (యుగా)యుగాని(తనుధ్వమ్)విస్తృణీత(కృతే)హలాదిభిః కర్షితేయోగాఙ్గై ర్నిష్పాదితేఽన్తః కరణే వా (యోనౌ)క్షేత్రే(వపత)(ఇహ)అస్యాం భూమౌ బుద్ధౌ వా(బీజమ్)యవాదికం సిద్ధిమూలం వా (గిరా) కృషియోగకర్మోపయుక్తయా సుశిక్షితయా వాచా(చ)స్వసువిచారేణ (శ్రుష్టిః) శీఘ్రమ్. శ్రుష్టీతి క్షిప్ర నామా. శు అష్టీతి. నిరు. ౬.౧౨. (సభరాః)సమాన ధారణపోషణాః(అసత్)అస్తు(నః) అస్మాన్(నేదీయః)అతిశయేనాన్తికమ్(ఇత్)ఏవ(సృణ్యః)యాః క్షేత్రయోగాన్ గతా యవాది జాతయః (పక్వమ్)(ఆ)(ఇయాత్)ప్రాప్నుయాత్ ॥౬౮॥ అన్వయః :- హే మనుష్యా ! యూయ మిహ సాధనాని వితనుధ్వం సీరా యుగా యునక్త. కృతే యోనౌ బీజం వపత గిరా చ సభరాః శ్రుష్టి ర్భవత యాః సృణ్యః సన్తి తాభ్యో యన్నేదీయోఽసత్ పక్వం భవేత్త దిదేవ న ఏయాత్. ॥౬౮॥

భావార్థః :— హే మనుష్యాః యూయం విద్వద్భ్యః కృషీవలేభ్యశ్చ కృషియోగకర్మ శిక్షాం ప్రాప్యానేకాని సాధనాని సంపాద్య కృషిం యోగం చ కురుత. తస్మా ద్యద్యత్పక్వం స్యాత్త త్తద్ గృహీత్వోపభుఙ్ధ్వం భోజయత వా. ॥౬౮॥

పదార్థము :- మానవులారా! మీరు, ఇహ = ఈ భూమియందు లేక బుద్ధియందు సాధనములను వితనుధ్వమ్ = వివిధ విధముల విస్తారమొనరించుడు, సీరా = కృషిసాధనములగు హలాదులను లేక నాడులను, మఱియు, యుగా = కాడులను, యునక్త = కలుపుడు, కృతే = హలాదులచే దున్నిపదునుచేసిన, లేక యోగాంగములచే శుద్ధమైన అంతఃకరణము అను, యోనౌ = క్షేత్రమునందు, బీజమ్ = యవాదులను, లేక సిద్ధియొక్క మూలమును, వపత = వపనమొనర్చుడు, గిరా = కృషి విషయపు కర్మల కుపయోగించు సుశిక్షితవాణి, చ = మఱియు మంచి ఆలోచనచే, సభరాః = ఒకే విధమైన ధారణ పోషణల కలిగియున్నవారుగ, శ్రుష్టిః = శీఘ్రముగ కండు, సృణ్యః = క్షేత్రమందు ఉత్పన్నములగు యవాద్యన్నజాతుల పదార్థము లేవియున్నవో, వానిలో, నేదీయః = ఏది అత్యంత సమీపము, పక్వమ్అసత్ = పచనమగునో, ఇత్ = అదియే, నః = మాకు, ఆ ఇయాత్ = లభించును గాక ! ॥౬౮॥

భావార్థము :—మానవులారా! మీరు విద్వాంసులనుండి, కృషీవలులనుండి కృషి యోగకర్మల శిక్షనుపొంది అనేక సాధనముల సమకూర్చి కృషిని యోగాభ్యాసమును ఒనర్చుడు. దానివలన అన్నాదు లేవేవి పక్వములగునో వాని వానిని గ్రహించి భుజించుడు. భుజింపజేయుడు. ౬౮ (౫౭౧)

---

౫౮-౨ శునమిత్యస్య కుమారహారిత ఋషిః, కృషీవలా దేవతాః, త్రిష్టుప్ఛన్దః, ధైవతః స్వరః
పునస్తమేవ విషయ మాహ. మరల విషయ మయ్యదియే.

శునꣳ సుఫాలా వికృషన్తు భూమిꣳ శునం కీనాశా అభి యన్తు వాహైః ।
శునాసీరా హవిషా తోశమానా సుపిప్పలా ఓషధీః కర్తనాస్మై ॥ ॥౬౯॥

శునమ్, సు, ఫాలాః, వి, కృషన్తు, భూమిమ్, శునమ్, కీనాశాః, అభి, యన్తు,

వాహైః, శునాసీరా, హవిషా, తోశమానా, సుపిప్పలా ఇతి సు+పిప్పలాః,

ఓషధీః, కర్తన, అస్మే ఇత్యస్మే. [౬౯]

పదార్థః :– (శునమ్)సుఖమ్, శునమితి సుఖనా...నిఘం. ౩. ౬. (సు)(ఫాలాః) ఫలన్తి విస్తీర్ణాం భూమిం కుర్వన్తి యై స్తే(వి)(కృషన్తు)విలిఖన్తు(భూమిమ్)(శునమ్) సుఖమ్ (కీనాశాః)యే శ్రమేణ క్లిశ్యన్తి తే కృషీవలాః, అత్ర క్లిశేరీచ్చోపధాయాః కన్ లోపశ్చ లోనామ్ చ. ఉ ౫.౫౬. క్లిశధాతోః కని ప్రత్యయే లోప ఉపధాయా ఈత్వం ధాతో ర్నామాగమశ్చ(అభి)(యన్తు)ప్రాప్ను వన్తు(వాహైః)వహన్తి యై స్తై ర్వృషభాదివాహనైః(శునాసీరా)యథా వాయుసూర్యౌ. శునాసీరౌ శునో వాయుః సరత్యన్తరిక్షే సీర ఆదిత్యః సరణాత్, నిరు. ౯-౪౦. (హవిషా)సంస్కృతేన ఘృతాదినా సంస్కృతౌ(తోశమానా)సన్తుష్టికారౌ. అత్ర వర్ణవ్యత్యయేన శః, వికరణాత్మనేపద వ్యత్యయౌ చ(సుపిప్పలాః)శోభనాని పిప్పలాని ఫలాని యాసు తాః(ఓషధీః)యవాదీన్(కర్తన)కుర్వన్తు(అస్మే) అస్మభ్యమ్. ॥౬౯॥ అన్వయః :– యే కీనాశాస్తే ఫాలా వాహైః సహ వర్తమానై ర్హలాదిభి ర్భూమిం వికృషన్తు శున మభియన్తు. హవిషా తోశమానా శునాసీరేవాస్మే సుపిప్పలా ఓషధీః కర్తన తాభిః సు శునం చ. ॥౬౯॥ భావార్థః :–యే చతురాః కృషికారా గోవృషభాదీన్ సంరక్ష్య విచారేణ కృషింకుర్వన్తి తేఽత్యన్తం సుఖం లభన్తే.నాత్ర క్షేత్రేఽమేధ్యం కించిత్ప్రక్షేప్యమ్.కింతు బీజాన్యపి సుగన్ధ్యాదియుక్తాని కృత్వైవ వపన్తు యతో ఽన్నాన్యారోగ్యకరాణి భూత్వా బలబుద్ధీ వర్ధయేయుః.

పదార్థము :–కీనాశాః = పరిశ్రమచే క్లేశ మనుభవించుచు వ్యవసాయ మొనర్చు వారెవ రున్నారో వారు, ఫాలాః = భూమిని దున్ను కఱ్ఱులతో, వాహైః = వృషభముతోకూడియున్న హలాదులతో, భూమిమ్ = భూమిని, వికృషన్తు = దున్నెదరుగాక: మఱియు, శునమ్ = సుఖమును, అభియన్తు = పొందుదురుగాక: హవిషా = శుద్ధమైన ఘృతాదులచే శుద్ధములు, తోశమానా = సంతోష కారకములు నగు, శునాసీరా = వాయు సూర్యులవలె కృషి సాధనములు, అస్మే = మాకు, సుపిప్పలాః = సుందర ఫలయుక్తములైన, ఓషధీః = యవాదులను, కర్తన = పండించుగాక : మఱల ఆ ఓషధులచే, సు = సుందరమైన, శునమ్ = సుఖమును అనుభవించెదము. ॥౬౯॥

భావార్థము :–చతురులైన కృషికారు లెవరు గో వృషభాదులను సంరక్షించి ఆలోచనతోపాటు వ్యవసాయము నొనర్చుదురో వారు అత్యంత సుఖమును పొందుదురు. ఆ పొలములం దమేధ్య మేమాత్రమును వేయగూడదు. ఇంతియగాక బీజములను సుగంధ్యాదియుక్తములుగ నొనర్చియే విత్తవలయును. ఆ అన్నము ఆరోగ్యకరమైనదై బలమును, బుద్ధిని అభివృద్ధిపఱచును. ౬౯ (౧౮౨)

---

౫౮౩ ఘృతేనేత్యస్య కుమారహారిత ఋషిః, కృషీవలా దేవతాః, ఆర్షీత్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మఱల నా విషయమే.

ఘృతేన సీతా మధునా సమజ్యతాం విశ్వైర్దేవై రనుమతా మరుద్భిః ।

ఊర్జస్వతీ పయసా పిన్వమానాస్మాన్త్సీతే పయసాభ్యా వవృత్స్వ ॥ ॥౭౦॥

ఘృతేన, సీతా, మధునా. సమ్, అజ్యతామ్, విశ్వైః, దేవైః, అనుమతే త్యను + మతా, మరుద్భిరితి మరుత్ + భిః, ఊర్జస్వతీ, పయసా, పిన్వమానా

అస్మాన్, సీతే, పయసా, అభి, ఆ, వవృత్స్వ. [౭౦]

పదార్థః :–(ఘృతేవ) ఆజ్యేన (సీతా) సాయన్తి క్షేత్రస్థలోష్ఠాన్ క్షయన్తి యయా సా కాష్ఠపట్టికా (మధునా) క్షౌద్రేణ శర్కరాదినా వా (సమ్) ఏకీభావే (అజ్యతామ్) సంయుజ్యతామ్ (విశ్వైః) సర్వైః (దేవైః) అన్నాదిం కామయమానై ర్విద్వద్భిః (అనుమతా)అనుజ్ఞాపితా(మరుద్భిః)మనుష్యైః (ఊర్జస్వతీ) ఊర్జః పరాక్రమసమ్బన్ధో విద్యతే యస్యాః సా (పయసా) జలేన దుగ్ధేన వా(పిన్వమానా) సిక్తా సేవితా (అస్మాన్) (సీతే) సీతా (పయసా)జలేన(అభి)(ఆ)(వవృత్స్వ) ప్రవర్తితా భవతు ॥౭౦॥

అన్వయః :–విశ్వై ర్దేవై ర్మరుద్భి ర్యష్మాభి రనుమతా పయసోర్జస్వతీ పిన్వమానా సీతా ఘృతేన మధునా సమజ్యతామ్. సా సీతే సీతాస్మాన్ ఘృతాదినా సంయోత్స్యతీతి పయసాఽభ్యావవృత్స్వాభ్యావర్త్యతామ్. ॥౭౦॥ భావార్థః :–సర్వే విద్వాంసః కృషీవలా విద్యయాఽనుజ్ఞాతా ఘృతమధుజలాదినా సుసంస్కృతా మనుమతాం క్షేత్రభూమి మన్నసుసాధికాం కుర్వన్తు యథా సుగంధాదియుక్తాని బీజాని కృత్వా వపన్తి తథైవ తామపి సుగన్ధేన సంస్కృతాం కుర్వన్తు. ॥౭౦॥

పదార్థము :–విశ్వైః దేవైః = అన్నాదిపదార్థములను ఆకాంక్షించు విద్వాంసులైన, మరుద్భిః = మానవులందరు, అనుమతా = అనుజ్ఞాపించబడిన, పయసా = జలముచే లేక దుగ్ధముచే, ఊర్జస్వతీః = పరాక్రమసంబన్ధముగలది, పిన్వమానా = తడిపినది, సేవించబడినదియునగు, సీతా = నాగటిచాలును, ఘృతేన మధునా = నేయి మఱియు తేనె లేక పంచదార మొదలైన పదార్థములచే, సమజ్యతామ్ = సంయుక్తపఱచవలయును. సీతే = నాగటిచాలు,మనలను ఘృతాదిపదార్థములు కలిగినవారుగ నొనర్చును కావున, పయసా = జలముతో, అభ్యావవృత్స్వ = మాటిమాటికి వర్తింపజేయుడు.

భావార్థము :–విద్వాంసులైన కృషీవలురు విద్యచే ననుజ్ఞాతులై ఘృతమధుజలాదులచే సుసంస్కృతము, అనుమతమునగు క్షేత్రభూమిని చక్కగా అన్నమును పండునదిగ నొనర్చవలెను. సుగంధయుక్తబీజములను విత్తినటుల గానే భూమిని కూడ సంస్కారయుక్తముగ నొనర్చవలెను.

---

౭౧॥ లాఙ్గల మిత్యస్య కుమారహారిత ఋషిః, కృషీవలా దేవతాః, విరాట్పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మరల విషయ మదియే.

లాఙ్గలం పవీరవత్సుశేవꣳ సోమపిత్సరు। తదుద్వపతి
గామవిం ప్రఫర్వ్యం చ పీవరీం ప్రస్థావద్రథవాహనమ్॥ ॥౭౧॥

లాఙ్గలమ్, పవీరవత్, సుశేవమితి + సు శేవమ్, సోమపిత్సర్వితి సోమపిత్ + సరు, తత్, ఉత్, వపతి, గామ్, అవిమ్,ప్రఫర్వ్యమితి ప్ర + ఫర్వ్యమ్, చ, పీవరీమ్, ప్రస్థావదితి ప్రస్థా + వత్, రథవాహనమ్, రథవాహనమితి రథ + వాహనమ్. [౭౧]

పదార్థః :–(లాఙ్గలమ్) సీరాపశ్చాద్భాగే దార్ఢ్యాయ సంయోజ్యం కాష్ఠమ్ (పవీరవత్) ప్రశస్తః పవీరః ఫాలో విద్యతే యస్మిన్ తత్(సుశేవమ్)సుష్ఠు సుఖకరమ్ (సోమపిత్సరు) యే సోమ యవాద్యోషధీః పాలయన్తి తాన్త్సరయతి కుటిలం గమయతి (తత్) (ఉత్) (వపతి) (గామ్) పృథివీమ్ (అవిమ్) రక్షణాదిహేతుమ్ (ప్రఫర్వ్యమ్) ప్రఫర్వితుం గమయితుం యోగ్యమ్ (చ) (పీవరీమ్)

ఊర్ధ్వో భవ ప్రతి విధ్యాధ్యస్మదావిష్కృణుష్వ దైవ్యాన్యగ్నే
అవ స్థిరా తనుహి యాతుజూనాం జామి మజామిం
ప్రమృణీహి శత్రూన్ అగ్నేష్ట్వా తేజసా సాదయామి ॥ ॥౧౩॥

ఊర్ధ్వః, భవ, ప్రతి, విధ్య, అధి, అస్మత్, ఆవిః, కృణుష్వ, దైవ్యాని, అగ్నే, అవ, స్థిరా, తనుహి, యాతుజూనామితి యాతు+జూనామ్, జామిమ్, అజామిమ్, ప్ర, మృణీహి, శత్రూన్, అగ్నేః, త్వా, తేజసా, సాదయామి [13]

పదార్థః :—(ఊర్ధ్వః) ఉత్కృష్టః (భవ)(ప్రతి) (విధ్య) తాడయ(అధి) (అస్మత్) (ఆవిః) ప్రాకట్యే(కృణుష్వ)(దైవ్యాని)దేవై ర్విద్వద్భి ర్నివృత్తాని వస్తూని (అగ్నే)(అవ) (స్థిరా)నిశ్చలాని (తనుహి) విస్తృణుహి (యాతుజూనామ్) యే యాంతి యే చ జవన్తే తేషామ్(జామిమ్) భోజనయుక్తమ్(అజామిమ్)భోజనరహితం స్థానమ్. అత్ర జము ధాతో ర్వపాదిభ్య ఇతీఞ్(ప్ర)(మృణీహి)హిన్ధి (శత్రూన్)అరీన్ (అగ్నేః)పావకస్య(త్వా)త్వామ్(తేజసా)ప్రకాశేన సహ(సాదయామి)స్థాపయామి. అన్వయః :—హే అగ్నే ! విద్వన్రాజన్ ! యతస్త్వమూర్ధ్వో భవ శత్రూన్ ప్రతి విధ్యాస్మత్ స్థిరా దైవ్యాన్యాకృణుష్వ. సుఖాని తనుహి యాతుజూనాం జామి మజామి మవతనుహి వినాశయ. శత్రూన్ ప్రమృణీహి తస్మాదహం త్వాఽగ్నే స్తేజసాధిసాదయామి. ॥౧౩॥ భావార్థః :—మనుష్యా రాజ్యైశ్వర్యం ప్రాప్యోత్తమగుణకర్మస్వభావా భవేయుః ప్రజాభ్యో దరిద్రేభ్యశ్చ సతతం సుఖం దద్యుః, ధర్మే స్థిరాః సన్తో దుష్టాధర్మాచారిణో మనుష్యాన్ సతతం శిక్షయేయుః. సర్వోత్కృష్టం సభాపతిం చ మన్యేరన్. ॥౧౩॥

పదార్థము :—అగ్నే = తేజస్వీ ! విద్వాంసుడా ! నీవు, ఊర్ధ్వః భవ = ఉత్తముడవు కమ్ము. ప్రతి = ధర్మానుకూలుడవై, విధ్య = దుష్టశత్రువులను వేధింపుము. అస్మత్ = మాయొక్క, స్థిరా = నిశ్చలములైన, దైవ్యాని = విద్వాంసులు రచించినపదార్థములను, ఆవిః కృణుష్వ = ప్రకటించుము. సుఖములను, తనుహి = విస్తరింపజేయుము. యాతుజూనామ్ = పరపదార్థముల దోచుకొనువారి యొక్కయు వేగవంతులగు శత్రువులయొక్కయు, జామిమ్ = భోజనస్థానమును, అజామిమ్ = అన్య వ్యవహారములస్థానమును, అవ = బాగుగ నిర్మూలనమొనర్పుము. శత్రూన్ ప్రమృణీహి = శత్రువులను బలముతో సంహరింపుము. ఇందులకై నేను, త్వా = నిన్ను, అగ్నేః = అగ్నియొక్క, తేజసా అధి = ప్రకాశసమ్ముఖమున, సాదయామి = స్థాపించుచున్నాను. ॥౧౩॥

భావార్థము :—మానవులు రాజ్యైశ్వర్యమును పొంది యుత్తమగుణకర్మ స్వభావయుక్తులు గావలయును. ప్రజలకు దరిద్రులకు నిరంతరము సుఖము చేకూర్చుచుండవలయును. దుష్టకర్మలొనర్చు వారిని సతతము దండించవలయును. సర్వశ్రేష్ఠుడైనవానిని సభాపతిగ భావించవలయును. ॥౧౩॥(౬౪౩)

---

౬౪౪ అగ్ని ర్మూర్ధేత్యస్య వామదేవ ఋషిః, అగ్నిర్ దేవతా, భురిగనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
పునః స కీదృశో భవే దిత్యాహ. ఆ రాజపురుషు డెటు లుండవలయును ?

అగ్ని ర్మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా అయమ్ ।

అ॒పాꣳ రేతాంసి జిన్వ॒తి॒ ఇన్ద్ర॑స్య॒ త్వౌజసా సాదయామి ॥ ॥౧౪॥

అ॒గ్నిః, మూ॒ర్ధా, ది॒వః, క॒కుత్, పతిః, పృ॒థి॒వ్యాః అ॒యమ్, అ॒పామ్,

రేతాꣳసి. జి॒న్వ॒తి॒, ఇ॒న్ద్ర॑స్య, త్వా॒, ఓజసా, సా॒ద॒యా॒మి॒. [14]

పదార్థః :–(అగ్నిః) సూర్యః (మూర్ధా) సర్వేషాం శిర ఇవ (దివః) ప్రకాశయుక్తస్యాకాశస్య మధ్యే (కకుత్)మహాన్ కకుహ ఇతి మహన్నా. నిఘం. ౩.౩; అస్యాన్త్యలోపో వర్ణవ్యత్యయేన హస్య దః(పతిః)పాలకః(పృథివ్యాః)భూమేః(అయమ్)(అపామ్)జలానామ్(రేతాంసి) వీర్యాణి (జిన్వతి) ప్రీణాతి తర్పయతి (ఇన్ద్రస్య)సూర్యస్య(త్వా)త్వామ్ (ఓజసా)పరాక్రమేణ (సాదయామి.) అన్వయః :–హే రాజన్ ! యథాఽయమగ్నిర్దివః పృథివ్యా మూర్ధా కకుత్పతి రపాం రేతాంసి జిన్వతి తథా త్వం భవ. అహం త్వా త్వామిన్ద్రస్యౌజసా సహ రాజ్యాయ సాదయామి. ॥౧౪॥ భావార్థః :– అత్ర వాచక లుప్తోపమాలంకారః. యో మనుష్యః సూర్యవద్ గుణకర్మస్వభావో న్యాయేన ప్రజాపాలనతత్పరో ధార్మికో విద్వాన్ భవేత్తం రాజత్వేన సర్వే మనుష్యాః స్వీకుర్యుః. ॥౧౪॥

పదార్థము :– ఓ రాజా! ఎటుల, అయమ్ అగ్నిః = ఈసూర్యుడు, దివః = ప్రకాశయుక్తాకాశము మధ్య, పృథివ్యాః = భూమికి, మూర్ధా = సకలప్రాణుల శిరస్తుల్యముగ నుత్తముడు, కకుత్ = గొప్పవాడు, పతిః = సకలపదార్థముల రక్షకుడునై, అపాం రేతాంసి = జలముయొక్క సారములచే ప్రాణులను, జిన్వతి = తృప్తపఱచుచున్నాడో, అటులనే నీవు కమ్ము. నేను,త్వా = నిన్ను,ఇంద్రస్య ఓజసా = సూర్యుని పరాక్రమముతోపాటు రాజ్యమునకై, సాదయామి = స్థాపించుచున్నాను. ॥౧౪॥

భావార్థము :–ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. సూర్యునివలె గుణకర్మస్వభావములుగలవాడు, న్యాయముతో ప్రజాపాలనతత్పరుడు, ధర్మాత్ముడునగు విద్వాంసునినే రాజ్యాధికారిగ ప్రజలు స్వీకరించవలయును. ॥౧౪॥ (౬౪౪)

౬౪౫ భువో యజ్ఞస్యేత్యస్య త్రిశిరా ఋషిః, నిచృదార్షీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునః స కీదృశో భవేదిత్యాహ. అత డెట్లుండవలయును?

భువో॑ య॒జ్ఞస్య॒ రజ॑సశ్చ నే॒తా యత్రా॑ ని॒యుద్భిః॒ సచ॑సే శి॒వాభిః॑ ।

ది॒వి మూ॒ర్ధానం॑ దధిషే స్వ॒ర్షాం జి॒హ్వామ॑గ్నే చకృషే హవ్య॒వాహ॑మ్ ॥

భువః, య॒జ్ఞస్య॑, రజ॑సః, చ॒, నే॒తా, యత్ర॑, ని॒యుద్భి॒రితి॑ ని॒యుత్+భిః,

సచ॑సే, శి॒వాభిః॑, ది॒వి, మూ॒ర్ధాన॑మ్, ద॒ధి॒షే॒, స్వ॒ర్షామ్, స్వః॑సామి॒తి స్వః॑సామ్,

జి॒హ్వామ్. అ॒గ్నే॒, చ॒కృ॒షే॒, హ॒వ్య॒వాహ॒మి॑తి హవ్య+వాహ॑మ్. [15]

పదార్థః :– (భువః)పృథివ్యాః (యజ్ఞస్య) రాజధర్మస్య (రజసః) లోకస్యైశ్వర్యస్య వా (చ) పశ్వాదీనామ్ (నేతా) నయనకర్తా (యత్ర)రాజ్యే. అత్ర నిపాతస్య చేతి దీర్ఘః(నియుద్భిః) వాయోర్వేగాదిగుణైః సహ (సచసే) సమవైషి (శివాభిః) కల్యాణకారికాభి ర్నీతిభిః (దివి) న్యాయప్రకాశే (మూర్ధానమ్) శిరః (దధిషే) ధరసి(స్వర్షామ్)స్వః సుఖాని సనన్తి భజన్తి యయా తామ్(జిహ్వామ్) జోహవీతి యయా తాం వాచమ్ (అగ్నే)విద్వన్ (చకృషే) కరోషి (హవ్యవాహమ్) హవ్యాని

హోతుం దాతుమర్హాణి ప్రజ్ఞానాని యయా తామ్. ॥౧౫॥ అన్వయః :-హే అగ్నే విద్వన్! యథాఽగ్నిర్నియుద్భిః సహ వాయునా రజసో నేతా సన్ దివి మూర్ధానం ధరతి తథా యత్ర శివాభిః సహ ధువో యజ్ఞస్య సచసే రాజ్యం దధిషే హవ్యవాహం స్వర్షాం జిహ్వాఞ్చక్ృషే తత్ర సర్వాణి సుఖాని వర్ధన్త ఇతి విజానీహి. భావార్థః :-యస్మిన్ రాజ్యే రాజాదయః సర్వే ధార్మికా మఙ్గలచారిణో ధర్మేణ ప్రజాః పాలయేయు స్తత్ర విద్యాసుశిక్షాజాని సుఖాని కుతో న వర్ధేరన్? ॥౧౫॥

పదార్థము :—అగ్నే = విద్వాంసుడా! యత్ర = ఏరాజ్యమునందు, నియుద్భిః = వేగాది గుణయుక్తమగువాయువు, ఎటుల, రజసః నేతా = లోకైశ్వర్యములనడుపునదై, దివి = న్యాయప్రకాశమునందు, మూర్ధానమ్ = శిరస్సునుధారణమొనర్చుచున్నదో, అటులనే నీవు, యత్ర = ఎచ్చట, శివాభిః = కల్యాణకరములగు నీతులతో, ధువః = తనభూమిమీది, యజ్ఞస్య = రాజధర్మపాలకుడవై, సచసే = సంయుక్తుడవగుచున్నావో, మంచిపురుషులతో రాజ్యమును, దధిషే = ధారణమొనర్చుదువో మఱియు, హవ్యవాహమ్ = ఇవ్వదగినది, విద్వాంసులనుపొందుటకు హేతువైనది, స్వర్షామ్ = సుఖములనుసేవింపజేయునది, జిహ్వామ్ = మంచివిషయములను గ్రహించునదియునగు వాణిని, చకృషే = చేయుదువో అక్కడ సకలసుఖములు వర్ధిల్లునని నిశ్చయముగ నెఱుగుము. ॥౧౫॥

భావార్థము :—ఏ రాజ్యములో రాజాదిరాజపురుషులందరు మంగలాచరణమొనర్చువారు ధర్మాత్ములునై ధర్మానుకూలముగ ప్రజలను పాలించుదురో ఆ రాజ్యమునందు విద్యా సుశిక్షలద్వారా కలుగు సుఖములెందుకు వృద్ధిజెందవు ? ॥౧౫॥ (౬౪౫)

౧౬-౬౪౬ ధ్రువాసీత్యస్య త్రిశిరా ఋషిః, అగ్నిర్ దేవతా, స్వరాడార్ష్యనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.
పునః సా కీదృశీ భవే దిత్యాహ. రాజపత్ని ఎటు లుండవలయును ?

ధ్రువాసి ధరుణాస్తృతా విశ్వకర్మణా । మా త్వా సముద్ర
ఉద్ బధీన్మా సుపర్ణో అవ్యథమానా పృథివీం దృꣳహ ॥ ॥౧౬॥

ధ్రువా, అసి, ధరుణా, ఆస్తృతేత్యా+స్తృతా, విశ్వకర్మణేతి విశ్వ+కర్మణా, మా, త్వా, సముద్రః, ఉత్, బధీత్, మా, సుపర్ణ ఇతి సు + పర్ణః, అవ్యథమానా, పృథివీమ్, దృꣳహ. [16]

పదార్థః :-(ధ్రువా)నిష్కమ్పా (అసి)(ధరుణా)విద్యాధర్మధర్త్రీ (ఆస్తృతా) వస్త్రాలంకారశుభగుణైః సమ్యగాచ్ఛాదితా (విశ్వకర్మణా)విశ్వాని సమగ్రాణి ధర్మ్యకర్మాణి యస్య పత్యుస్తేన(మా) (త్వా)త్వామ్(సముద్రః)సముద్రవన్తి కాముకా యస్మిన్ వ్యవహారే సః(ఉత్)(బధీత్)హన్యాత్(మా) (సుపర్ణః) శోభనాని పర్ణాని పాలితాన్యఙ్గాని యస్య సః (అవ్యథమానా) పీడామప్రాప్తా (పృథివీమ్) స్వరాజ్యభూమిమ్(దృꣳహ)వర్ధయ. ॥౧౬॥ అన్వయః :-హే రాజపత్ని ! యతో విశ్వకర్మణా పత్యా సహ వర్తమానాఽఽస్తృతా ధరుణా ధ్రువాఽసి, సాఽవ్యథమానా సతీ త్వం పృథివీముద్దృంహ త్వా సముద్రో మా బధీత్ సుపర్ణశ్చ మా బధీత్. ॥౧౬॥ భావార్థః :-యాదృశీం రాజనీతివిద్యాం రాజాఽధీతవాన్ భవేత్ తాదృశీమేవ రాజ్ఞ్యప్యధీతవతీ స్యాత్. సదైవోభౌ పతివ్రతా స్త్రీవ్రతౌ భూత్వా న్యాయేన పాలనం కుర్యాతామ్. వ్యభిచారకామవ్యథారహితౌ భూత్వా ధర్మేణ సన్తానానుత్పాద్య స్త్రీన్యాయం స్త్రీ, పురుషన్యాయం పురుషశ్చ కుర్యాత్. ॥౧౬॥

పదార్థము :–రాజపత్ని! విశ్వకర్మణా = సకలధార్మిక కార్యములొనర్చు స్వపతివెంటనుండు దానవు, ఆస్తృతా = వస్త్రాభూషణముల తోను, శ్రేష్ఠగుణములతోను కప్పబడినదానవు, ధరుణా = విద్యాధర్మములను ధరించుదానవు, ధ్రువా అసి = నిశ్చలురాలవునై ఉన్నావు కనుక ఆనీవు, అవ్యథమానా = పీడ లేనిదానివై, పృథివీమ్ = స్వకీయరాజ్యభూమిని. ఉద్దృంహ = బాగుగ సభివృద్ధి పరచుము, త్వా = నిన్ను, సముద్రః = కాముకజనుల విచలిత వ్యవహారమెద్దియు, మా వధీత్ = బాధించకుండునుగాక : సువర్ణః = సుందరములును పుష్టములునగు నవయవములుగలిగిన నీపతియు, మా = హింసించకుండును గాక ! ॥౧౬॥

భావార్థము :–రాజెటువంటి రాజనీతి విద్య చదివియుండునో రాణియు నటువంటి విద్యయే నేర్చియుండవలయును. ఎల్లకాల మిరువురు పతివ్రత స్త్రీవ్రతులై న్యాయముతో పాలించవలయును. స్వైరాచార కామపీడాదులచే రహితులై ధర్మానుకూలముగ పుత్రుల గని స్త్రీలకు రాణియు, పురుషులకు రాజుయు న్యాయమొనర్చ వలయును, [తీర్పు చెప్పవలయును.] ॥౧౬॥ (౯౪౭)

౮౪౭ ప్రజాపతి ష్ట్వేత్యస్య త్రిశిరా ఋషిః, ప్రజాపతి ర్దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః పతి స్తాం కథం వర్తయే దిత్యాహ. రాజు నామె నెటుల ప్రవర్తింపజేయవలెను ?

ప్రజాపతిష్ట్వా సాదయత్వపాం పృష్ఠే సముద్రస్యేమన్ ।

వ్యచస్వతీం ప్రథస్వతీం ప్రథస్వ పృథివ్యసి ॥ ॥౧౭॥

ప్రజాపతిరితి ప్రజా+పతిః, త్వా, సాదయతు, అపామ్, పృష్ఠే, సముద్రస్య, ఏమన్, వ్యచస్వతీమ్, ప్రథస్వతీమ్, ప్రథస్వ, పృథివీ, అసి. [17]

పదార్థః :–(ప్రజాపతిః)ప్రజాయాః స్వామి(త్వా) త్వామ్ (సాదయతు)స్థాపయతు (అపామ్) జలానామ్(పృష్ఠే)ఉపరి(సముద్రస్య)సాగరస్య(ఏమన్)ప్రాప్తవ్యే స్థానే. అత్ర సప్తమ్యా లుక్, అత్ర ఏమన్నాదిషు ఛన్దసి పరరూపమితి వార్తికేన పరరూపమ్. (వ్యచస్వతీమ్) బహూవ్యచో వ్యఞ్చనం విద్యాగమనం సత్కారణం వా విద్యతే యస్యా స్తామ్ (ప్రథస్వతీమ్)ప్రథాః ప్రఖ్యాతా కీర్తి ర్విద్యతే యస్యా స్తామ్(ప్రథస్వ)ప్రఖ్యాతా భవ(పృథివి)భూమిరివ సుఖప్రదా (అసి) ॥౧౭॥ అన్వయః :– హే విదుషి ప్రజాపాలికే ! రాజ్ఞి ! యథా ప్రజాపతిః సుముద్రస్యాపామేమన్ పృష్ఠే నౌకేవ వ్యచస్వతీం ప్రథస్వతీం త్వా త్వాం సాదయతు యత స్త్వం పృథివ్యసి తస్మాత్ స్త్రీన్యాయకరణే ప్రథస్వ తథా తే పతి ర్భవేత్. ॥౧౭॥ భావార్థః :–అత్ర వాచక లుప్తోపమాలంకారః. రాజపురుషాదయః స్వయం యస్మిన్ రాజకర్మణి ప్రవర్తేరం స్తస్మిన్ స్వాం స్వాం స్త్రియం స్థాపయేయుః. యః పురుషః పురుషాణాం న్యాయాధికారే తిష్ఠేత్తస్య స్త్రీ స్త్రీణాం న్యాయాసనే స్థితా భవేత్. ॥౧౭॥

పదార్థము :–విదుషీమణీ ! [ప్రజాపాలికా]రాణీ! ]ప్రజాపతిః = ప్రజలస్వామి,పరమాత్మ, సముద్రస్య అపామ్ = సముద్రపు జలముల యొక్క, ఏమన్ పృష్ఠే = ప్రాప్తవ్యస్థానముమీద నౌకవలె, వ్యచస్వతీమ్ = బహువిద్యాసత్కారములుగలిగినదానవు, ప్రథస్వతీమ్ = ప్రశంసనీయమైన కీర్తిగలదానవునగు, త్వా = నిన్ను, సాదయతు = స్థాపించుగాక? నీవు, పృథివీఅసి = భూమివలె సుఖమును కలిగించుదానవు, కనుక స్త్రీలకు న్యాయమొనర్చుటలో. ప్రథస్వ = ఎటుల ప్రసిద్ధురాల వయ్యెదవో అటులనే నీపతియు పురుషులకు న్యాయమొనర్చుగాక ! ॥౧౭॥

భావార్థము:—ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకార మున్నది. రాజపురుషులు రామే యే రాజకర్మలందు నియుక్తులయ్యేదరో ఆ యా కర్మలందు స్వస్త్రీలను స్థాపించవలయును. పురుషుడు పురుషుల న్యాయాధికారమున నధిష్ఠితుడగుచో నతనిపత్ని స్త్రీలన్యాయాసనము నధిరోహించ వలయును.

---

౬౪౮ భూరసీత్యస్య త్రిశిరా ఋషిః, అగ్నిర్ దేవతా, ప్రస్తార ప ఙ్క్తి ఛ్ఛన్దః, పఞ్చమః స్వరః.
పునః సా కీదృశీ భవేదిత్యాహ. ఆరాణి యెటులుండవలయును ?

భూరసి భూమి రస్యదితిరసి విశ్వధాయా విశ్వస్య భువనస్య ధర్త్రీ ।
పృథివీం యచ్ఛ పృథివీం దృꣳహ పృథివీం మా హిꣳసీః ॥ ॥౧౮॥

భూః, అసి, భూమిః, అసి, అదితిః, అసి, విశ్వధాయా ఇతి విశ్వ+ధాయాః, విశ్వస్య, భువనస్య, ధర్త్రీ, పృథివీమ్, యచ్ఛ, పృథివీమ్, దృꣳహ, పృథివీమ్, మా, హిꣳసీః.

పదార్థః :—(భూః)భవతీతి భూః(అసి) (భూమిః)పృధివీవత్(అసి) (అదితిః)అఖణ్డితైశ్వర్యమన్తరిక్ష మివాఖణ్డా(అసి) (విశ్వధాయాః) యా విశ్వం సర్వం గృహ్ణాతి గృహాశ్రమి రాజవ్యవహారం దధాతి సా(విశ్వస్య)సర్వస్య(భువనస్య)భవన్తి భూతాని యస్మిన్రాజ్యే తస్య(ధర్త్రీ) ధారికా(పృధివీమ్) (యచ్ఛ)నిగృహ్ణా (పృధివీమ్)(దృంహ)వర్ధయ (పృథివీమ్) (మా)(హింసీః)హింస్యాః. ॥౧౮॥)

అన్వయః :—హే రాజపత్ని ! యత స్త్వం భూరివాసి తస్మాత్ పృధివీం యచ్ఛ. యత స్త్వం విశ్వధాయా విశ్వస్య భువనస్య ధర్త్రీ భూమి రివాసి తస్మాత్ పృధివీం దృంహ, యత స్త్వమదితి రివాసి తస్మాత్ పృథివీం మా హింసీః. ॥౧౮॥ భావార్థః :—యా రాజకులస్త్రియః పృధివ్యాదివద్ధైర్యాది గుణయుక్తాః సన్తి తా ఏవ రాజ్యం కర్తుమర్హన్తి. ॥౧౮॥

పదార్థము :—రాజపత్నీ ! నీవు, భూః అసి = భూమివంటి దానవు, కనుక, పృధివీమ్యచ్ఛ = పృధివిని నిరంతరము చేపట్టుము, నీవు, విశ్వధాయాః = సకలగృహాశ్రమమును, రాజ్యవ్యవహారములను ధరించుదానవు, విశ్వస్య భువనస్య = సకలరాజ్యమును, ధర్త్రీ = ధారణమొనరించుదానవు, భూమిః అసి = భూమివంటిదానవు కావున, పృధివీమ్ = భూమిని, దృంహ = వృద్ధియొనర్చుము. నీవు, అదితిః = అఖండైశ్వర్యములుగల ఆకాశమువలె క్షోభరహితవు, అసి = అయియున్నావు కనుక, పృథివీమ్ మా హింసీః = భూమిని హింసించవలదు. ॥౧౮॥

భావార్థము :—పుడమివలె ధైర్యక్షమాదిగుణములు కలిగియున్న రాజవంశపు స్త్రీయే రాజ్యమొనర్చుటకు తగినదె యుండును. ॥౧౮॥ (౬౪౮)

---

౬౪౯ విశ్వస్మా ఇత్యస్య త్రిశిరా ఋషిః, అగ్నిర్ దేవతా, భురిగతి జగతీ ఛన్దః, నిషాదః స్వరః.
పునస్తౌ పరస్పరం కథం వర్తేయాతా మిత్యాహ. ఆ దంపతులు పరస్పరమెటుల ప్రవర్తించవలెను ?

విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై చరిత్రాయ । అగ్నిష్ట్వాభి పాతు మహ్యా స్వస్త్యా ఛర్దిషా శన్తమేన తయా దేవతయాఙ్గిరస్వద్ ధ్రువా సీద ॥

విశ్వస్మై, ప్రాణాయ, అపానాయేత్యప+ఆనాయ, వ్యానాయేతి వి+ఆనాయ, ఉదానాయేత్యుత్+ఆనాయ, ప్రతిష్ఠాయై, ప్రతిష్ఠాయా ఇతి ప్రతి+స్థాయై, చరి

త్రాయ, అగ్నిః, త్వా, అభి, పాతు, మహ్యా, స్వస్త్యా, ఛర్దిషా, శన్తమేనేతి
శమ్ + తమేన, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువా, సీద. [19]

పదార్థః :-(విశ్వస్మై)సంపూర్ణాయ(ప్రాణాయ)జీవనహేతవే(అపానాయ)దుఃఖ నివారణాయ (వ్యానాయ)వివిధోత్తమవ్యవహారాయ (ఉదానాయ)ఉత్కృష్టాయ బలాయ (ప్రతిష్ఠాయై)సత్కృతయే (చరిత్రాయ)ధర్మాచరణాయ(అగ్నిః)విజ్ఞానవాన్ పతిః(త్వా)త్వామ్(అభి)అభిముఖ్యతయా(పాతు)రక్షతు(మహ్యా)మహత్యా(స్వస్త్యా)ప్రాపకసుఖక్రియయా (ఛర్దిషా)ప్రదీప్తేన(శన్తమేన) అత్యన్తసుఖరూపేణ కర్మణా (తయా) (దేవతయా)వివాహితపతిరూపయా సుఖప్రదయా(అఙ్గిరస్వత్) కారణవత్ (ధ్రువా)నిశ్చలస్వరూపా(సీద)అవస్థితా భవ. ॥౧౯॥ అన్వయః :-హే స్త్రీ! యోఽగ్నిస్తే పతిర్మహ్యా స్వస్త్యా శన్తమేన ఛర్దిషా విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై చరిత్రాయ యాం త్వాభిపాతు సా త్వం తయా దేవతయా సహాఽఙ్గిరస్వద్ ధ్రువా సీద. ॥౧౯॥ భావార్థః:- పురుషాః స్వస్వస్త్రీణాం సత్కారసుఖాభ్యా మవ్యభిచారేణ చ ప్రియాచరణం పాలనాదికం చ సతతం కుర్యుః, స్త్రియోఽప్యేవమేవ, న స్వస్త్రియం విహాయాన్యాం పురుషః స్వపురుషం విహాయాన్యం స్త్రీ చ సంగచ్ఛేత. ఏవం పరస్పరస్య ప్రియాచరణా వుభౌ సదా వర్తేయాతామ్, ॥౧౯॥

పదార్థము:-ఓ స్త్రీ! అగ్నిః = విజ్ఞానవంతుడగునే నీపతి,మహ్యా స్వస్త్యా = సుఖమిచ్చు పెద్ద క్రియ చేతను, ఛర్దిషా శంతమేన = ప్రకాశయుక్తము నత్యంత సుఖదాయకము నగు కర్మచేతను, విశ్వస్మై ప్రాణాయ = సంపూర్ణ జీవనమునకు హేతువగు ప్రాణముకొఱకు, అపానాయ = దుఃఖనివృత్తికొఱకు, వ్యానాయ = అనేకవిధములైన యుత్తమ వ్యవహారముల సిద్ధికొరకు, ఉదానాయ = ఉత్తమ బలము కొఱకు, ప్రతిష్ఠాయై = సత్కారార్థము, చరిత్రాయ = ధర్మము నాచరించుటకై, త్వా = ఏ నిన్ను అభిపాతు = అభిముఖుడై రక్షించునో ఆ నీవు, తయా దేవతయా = ఆ దివ్యస్వరూపుడగు పతితోపాటు, అఙ్గిరస్వత్ = కార్యకారణసంబంధమువలె,ధ్రువా = నిశ్చలురాలవై ,సీద = ప్రతిష్ఠాయుక్తురాలవుకమ్ము

భావార్థము :-పురుషులు తమతమ సతులను సత్కార సుఖములచేతను, వ్యభిచారరాహిత్యము చేతను ప్రియాచరణపాలనాదులు సతతమొనర్చవలయును. స్త్రీలును ఇటులనే యొనర్చవలయును. పురుషుడు స్వస్త్రీని త్యజించి యన్యస్త్రీనికామించకూడదు. స్త్రీయు పతిని తప్ప నితరునికామించగూడదు. ఇటులనే పరస్పరము ప్రీతిపూర్వకముగ నిరువురు సర్వదా ప్రవర్తించవలయును. ॥౧౯॥ (౬౪౯)

---

౬౫౦ కాండా త్కాండా దిత్యస్యాగ్ని ఋషిః, పత్నీ దేవతా, అనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః సా కీదృశీ భవేదిత్యాహ. పతివ్రతా స్త్రీ యెటులుండవలయును ?

కాణ్డాత్కాణ్డాత్ప్రరోహన్తీ పరుషః పరుషస్పరి ।
ఏవా నో దూర్వే ప్ర తను సహస్రేణ శతేన చ ॥ ॥౨౦॥

కాణ్డాత్కాణ్డాదితి కాణ్డాత్ + కాణ్డాత్, ప్రరోహన్తీతి ప్ర + రోహన్తీ, పరుషః పరుష ఇతి పరుషః + పరుషః, పరి, ఏవ, నః, దూర్వే, ప్ర, తను, సహస్రేణ, శతేన, చ.

పదార్థః :-(కాణ్డాత్కాణ్డాత్)గ్రన్థే గ్రన్థేః (ప్రరోహన్తీ)ప్రకృష్టతయా వర్ధమానా (పరుషః పరుషః) మర్మణో మర్మణః (పరి)సర్వతః (ఏవా)నిపాతస్య చేతి దీర్ఘః(నః)అస్మాన్ (దూర్వే)

దూర్వావద్వర్తమానే (ప్రి)(తను)విస్తృణుహి(సహస్రేణ)అసంఖ్యాతేన(శతేన)అనేకైః(చ)॥౨౦॥ అన్వయః :–హేస్త్రి ! త్వం యథా సహస్రేణ శతేన చ కాణ్డాత్కాణ్డాత్పరుషః పరుషస్పరి ప్రరోహన్తీ దూర్వౌషధీ వర్తతే తథైవ నోఽస్మాన్ పుత్రపౌత్రైశ్వర్యాదిభిః ప్రతను.॥౨౦॥ భావార్థః:- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా దూర్వౌషధీ రోగప్రణాశికా సుఖవర్ధికా సువిస్తీర్ణా చిరం స్థాత్రి తథా సతీ విదుషీ స్త్రీ కులం శతధా సహస్రధా వర్ధయేత్ తథా పురుషోఽపి ప్రయతేత.॥౨౦॥

పదార్థము :–ఓ స్త్రీ ! నీవు, సహస్రేణ = అసంఖ్యాక విధములతో, చ = మఱియు, శతేన = అనేకవిధములతో, కాండాత్కాండాత్ = సకలావయవములనుండి, పరుషః పరుషః = కణుపుకణుపునుండి, పరి = అన్నివైపులనుండి, ప్రరోహంతీ = అతిశయముగ వృద్ధిజెందుచు, దూర్వే = దూర్వారతృణ మెటులుండునో ఏవ = అటులనే, నః = మమ్ము పుత్రపౌత్రైశ్వర్యములతో, ప్రతను = విస్తృతపఱచుము, ॥౨౦॥

భావార్థః :–ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. దూర్వాతృణము రోగములనాశనమొనర్చుచు సుఖములనభివృద్ధియొనర్చుచు సుందరముగ నభివృద్ధితో విస్తరించుచున్నటుల విదుషీమణియు ననేకవిధముల స్వకులమును అభివృద్ధిపఱచవలయును. ॥౨౦॥ (౬౫౦)

---

౬౫౧ యా శతేనేత్యస్యాగ్ని ఋషిః, పత్నీ దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః

పునః సా కీదృశీ భవేదిత్యాహ, ఆబిడ ఎటువంటిదిగ నుండవలయును ?

యా శతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి ।
తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషా వయమ్ ॥ ॥౨౧॥

యా, శతేన, ప్రతనోషీతి ప్ర+తనోషి, సహస్రేణ, విరోహసీతి వి+రోహసి, తస్యాః, తే, దేవి, ఇష్టకే, విధేమ, హవిషా, వయమ్. [21]

పదార్థః :-(యా)(శతేన)అసంఖ్యాతేన (ప్రతనోషి)(సహస్రేణ)అసంఖ్యాతేన (విరోహసి) వివిధతయా వర్ధసే(తస్యాః)(తే) తవ(దేవి)దేదీప్యమానే(ఇష్టకే) ఇష్టకేవ శుభైర్గుణైః సుశోభితే(విధేమ)పరిచరేమ(హవిషా)హోతుమర్హేణ(వయమ్). ॥౨౧॥ అన్వయః :–హే ఇష్టకే! ఇష్టకావద్దృఢాంగే దేవి స్త్రి ! యథేష్టకా శతేన ప్రతనోతి సహస్రేణ విరోహతి తథా యా త్వమస్మాన్ శతేన ప్రతనోషి సహస్రేణ చ విరోహసి తస్యాస్తే తవ హవిషా వయం విధేమ త్వాం పరిచరేమ. భావార్థః :–అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా శతశః సహస్రాణీష్టకా గృహాకారా భూత్వా సర్వాన్ సుఖయన్తి తథైవ యాః సాధ్వ్యః స్త్రియః పుత్రపౌత్రభృత్యాదిభిః సర్వానానన్దయేయుస్తాః పురుషాః సతతం సత్కుర్యుర్నహి సత్పురుషస్త్రీ సమాగమేన వినా శుభగుణాఢ్యాన్యపత్యాని జాయేరన్. ఏవం భూతైః సన్తానైర్వినా మాతాపితౄణాం కుతః సుఖం జాయేత? ॥౨౧॥

పదార్థము :– ఇష్టకే = ఇటుకవంటి దృఢావయవములు గలిగి శుభగుణశోభాయమానవైన, దేవి = ప్రకాశయుక్తురాలవగు నో స్త్రీ! ఎటుల ఇటుకలు శతసంఖ్యాకములై వేలకొలదియై గృహాదుల విస్తరణమును అత్యంతవృద్ధిపఱచుచున్నవో అటులనే, యా = ఏ నీవు, మమ్ములను, శతేన = వందలకొలది పుత్రపౌత్రాది సంపత్తితో, ప్రతనోషి = విస్తారయుక్తముగ నొనర్చుచున్నావో మఱియు, సహస్రేణ = వేలరకముల పదార్థములతో, విరోహసి = పలువిధముల్గ నభివృద్ధిపఱచుచున్నావో

తస్యాః తే = ఆనిన్ను, హవిషా = దాతవ్యపదార్థములతో, వయమ్ = మేము, విధేమ = సేవించెదము.

భావార్థము:—ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. వందలకొలది వేలకొలది యిటుకలు ఇండ్లుగా నిర్మించబడి సకలప్రాణులకెటుల సుఖము చేకూర్చుచున్నవో అటులనే శ్రేష్ఠస్త్రీలు పుత్రపౌత్రభృత్యాదులతో నందబిని ఆనందపఱచవలయును. వారిని పురుషులెల్లప్పుడు సత్కరించవలయును, ఉత్తమస్త్రీ పురుషుల సంగమము లేనిదే శుభగుణాఢ్యమైన సంతానమెన్నటికి సంభవించజాలదు, అట్టి సంతానము లేనిదే మాతాపితరులకు సుఖమెన్నడు లభించగలదు ? ॥౨౧॥ (౬౫౧)

---

౬౫౨ యా స్త ఇత్యస్యేన్ద్రాగ్నీ ఋషీ, అగ్నిర్ దేవతా, భురిగనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః సా కీదృశీ భవేదిత్యుపదిశ్యతే. ఆస్త్రీ ఎటువంటిది కావలయును ?

యాస్తే అగ్నే సూర్యే రుచో దివమాతన్వన్తి రశ్మిభిః ।
తాభి ర్నో అద్య సర్వాభీ రుచే జనాయ నస్కృధి ॥ ॥౨౨॥

యాః, తే, అగ్నే, సూర్యే, రుచః, దివమ్, ఆతన్వన్తీత్యాతన్వన్తి, రశ్మిభిరితి రశ్మి+భిః, తాభిః, నః, అద్య, సర్వాభిః, రుచే, జనాయ, నః, కృధి.

పదార్థః :—(యాః)(తే) తవ (అగ్నే)అగ్నిరివ వర్తమానే (సూర్యే) అర్కే (రుచః)దీప్తయః (దివమ్) ప్రకాశమ్(ఆతన్వన్తి)సమన్తాద్విస్తృణ్వన్తి (రశ్మిభిః) కిరణైః (తాభిః)రుచిభిః(నః) అస్మాన్ (అద్య) (సర్వాభిః) (రుచే) రుచికారకాయ(జనాయ)ప్రసిద్ధాయ(నః)అస్మాన్(కృధి)కురు. అత్ర వికరణలుక్. ॥౨౨॥ అన్వయః :—హే అగ్నే విదుష్యధ్యాపికే స్త్రి! యాస్తే రుచయః సన్తి తాభిః సర్వాభి ర్నో యథా రుచః సూర్యే రశ్మిభి ర్దివ మాతన్వన్తి తథా త్వమాతను అద్య రుచే జనాయ నః ప్రీతాన్ కృధి. ॥౨౨॥ భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా బ్రహ్మాణ్డే సూర్యస్య దీప్తయః సర్వాణి వస్తూని ప్రకాశ్య రోచయన్తి తథైవ విదుష్యః సాధ్వ్యః పతివ్రతాః స్త్రియః సర్వాణి గృహకర్మాణి ప్రకాశయన్తి. యత్ర స్త్రీ పురుషౌ పరస్పరం ప్రీతిమన్తౌ స్యాతాం తత్ర సర్వం కల్యాణ మేవ. ॥౨౨॥

పదార్థము :—అగ్నే = అగ్నివలె తేజస్సును ధరించి చదివించు విదుషీమణీ ! రుచః = దీప్తులెటుల, సూర్యే = సూర్యునియందు, రశ్మిభిః = కిరణములతో, దివమ్ = ప్రకాశమును, ఆ తన్వంతి = బాగుగ విస్తారయుక్తమొనర్చుచున్నవో, యాః తే = నీయభిరుచు లేవి యున్నవో, తాభిః సర్వాభిః = ఆ రుచులన్నిటితో, నః = మమ్ము. అటులనే నీవును చక్కగా సుఖయుక్తులుగ నొనర్చుము. మఱియు, అద్య = నేడు, రుచే జనాయ = రుచినికలిగించు జనునికై, నః = మమ్ము ప్రీతియుక్తులుగ, కృధి = ఒనర్చుము. ॥౨౨॥

భావార్థము :– ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది. బ్రహ్మాండమునం దెటుల సూర్యదీప్తి సకలపదార్థములను ప్రకాశపఱచి రుచియుక్తములుగ నొనర్చుచున్నదో అటులనే శ్రేష్ఠపతివ్రతలు విదుషీమణులు సకలగృహకార్యములను ప్రకాశపఱచుచున్నారు. ఏ కులమునందు స్త్రీ పురుషులు పరస్పరము ప్రీతియుక్తులుగ నుందురో అచ్చట సకలవిషయములందు కల్యాణమే జరుగును. ॥౨౨॥ (౬౫౨)

౬౩౩ యా వో దేవా ఇత్యస్యేన్ద్రాగ్నీ ఋషీ, బృహస్పతి ర్దేవతా, అనుష్టుప్ ఛందః, గాన్ధారః స్వరః
అథ స్త్రీ పురుషైః కథం విజ్ఞానం సంపాద్య మిత్యాహ.
స్త్రీ పురుషులు విజ్ఞానము నెటుల సాధించవలయును ?

యా వో దేవాః సూర్యే రుచో గోష్వశ్వేషు యా రుచః ।
ఇన్ద్రాగ్నీ తాభిః సర్వాభీ రుచం నో ధత్త బృహస్పతే ॥ ॥౨౩॥

యా, వః, దేవాః, సూర్యే, రుచః, గోషు, అశ్వేషు, యాః, రుచః, ఇన్ద్రాగ్నీ, తాభిః, సర్వాభిః, రుచమ్, నః, ధత్త, బృహస్పతే. [23]

పదార్థః :-(యాః)(వః)యుష్మాకమ్(దేవాః)విద్వాంసః (సూర్యే)సవితరి (రుచః)రుచయః (గోషు)ధేనుషు (అశ్వేషు)గవాదిషు (యాః)(రుచః) ప్రీతయః (ఇన్ద్రాగ్నీ) విద్యుత్సూర్యవదధ్యాపకోపదేశకౌ(తాభిః)(సర్వాభిః)(రుచమ్) కామనామ్ (నః) అస్మాకం మధ్యే (ధత్త) (బృహస్పతే) బృహతాం విదుషాం పాలక. ॥౨౩॥ అన్వయః :- హే దేవాః యూయం యా వః సూర్యే రుచో యా గోష్వశ్వేషు రుచశ్చేవ రుచః సన్తి తాభిః సర్వాభీ రుగ్భి ర్నో రుచ మిన్ద్రాగ్నీ ఇవ ధత్త, హే బృహస్పతే పరీక్షక ! భవానస్మాకం పరీక్షాం కురు. ॥౨౩॥ భావార్థః :-యావన్మనుష్యాణాం విద్వత్సఙ్గ ఈశ్వరేఽస్య సృష్టౌ చ రుచిః పరీక్షా చ న జాయతే తావద్విజ్ఞానం న వర్ధతే. ॥౨౩॥

పదార్థము :-దేవాః = విద్వాంసులారా ! మీరందరు, యాః వః = మీయొక్క, సూర్యే రుచః = సూర్యునియందలి యే రుచులున్నవో, గోషు అశ్వేషు = గోవులందు తురంగములందు, యా రుచః = ఏప్రీతులున్నవో ఆప్రీతులవలె, తాభిః సర్వాభిః = ఆరుచులన్నిటితో, నః = మామధ్య, రుచమ్ = కామనలను, ఇంద్రాగ్నీ = విద్యుత్సూర్యులవలె నధ్యాపకోపదేశకులు ధారణ మొనర్చుచున్నారో అటుల, ధత్త = ధారణమొనర్చుడు. బృహస్పతే = పక్షపాతము విడలి పరీక్షతీసుకొను పూర్ణవిద్వాంసుడా ! నీవు, నః = మమ్ము పరీక్షించుము. ॥౨౩॥

భావార్థము:-మానవులకు విద్వాంసుల సాంగత్యమునందు, ఈశ్వరునియందు, అతని రచనయందు రుచి యుండనంతవరకు, పరీక్ష జరగనంతవరకు విజ్ఞాన మెన్నటికి వృద్ధి కాజాలదు. ॥౨౩॥ (౬౩౩)

---

౬౩౪ విరాడ్ జ్యోతి రిత్యస్యేన్ద్రాగ్నీ ఋషీ, ప్రజాపతి ర్దేవతా, నిచృద్బృహతీ ఛందః, ఋషభః స్వరః.
దమ్పతీ అన్యోఽన్యం కథం వర్తేయాతా మిత్యాహ.
స్త్రీ పురుషులు పరస్పరమెటుల ప్రవర్తించవలయును ?

విరాడ్ జ్యోతిరధారయత్ స్వరాడ్ జ్యోతిరధారయత్ । ప్రజాపతిష్ట్వా సాదయతు పృష్ఠే పృథివ్యా జ్యోతిష్మతీమ్ విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయ విశ్వం జ్యోతి ర్యచ్ఛ అగ్నిష్టేఽధిపతి స్తయా దేవతయాఙ్గిరస్వద్ ధ్రువా సీద ॥

విరాడితి వి+రాట్, జ్యోతిః, అధారయత్, స్వరాడితి స్వ+రాట్, జ్యోతిః, అధారయత్, ప్రజాపతిరితి ప్రజా+పతిః, త్వా, సాదయతు, పృష్ఠే, పృథివ్యాః,

జ్యోతిష్మతీమ్, విశ్వస్మై, ప్రాణాయ, అపానాయేత్యప+ఆనాయ, వ్యానా యేతి వి+ఆనాయ, విశ్వమ్, జ్యోతిః, యచ్ఛ, అగ్నిః, తే, అధిపతిరిత్యధి+ పతిః, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువా, సీద. [24]

పదార్థః :-(విరాట్)యా వివిధాసు రాజతే (జ్యోతిః)విద్యాప్రకాశమ్ (అధారయత్)ధారయేత్ (స్వరాట్)సర్వేషు ధర్మాచరణేషు స్వయం రాజతే (జ్యోతిః)విద్యుదాది ప్రకాశమ్ (అధారయత్) (ప్రజాపతిః) ప్రజాయాః పాలకః (త్వా) త్వామ్ (సాదయతు) సంస్థాపయతు (పృష్ఠే) తలే (పృథివ్యాః) భూమేః (జ్యోతిష్మతీమ్)ప్రశస్తం జ్యోతి ర్విద్యావిజ్ఞానం విద్యతే యస్యాస్తామ్ (విశ్వస్మై) అఖిలాయ (ప్రాణాయ) ప్రాణితి సుఖం యేన తస్మై (అపానాయ) అపానితి దుఃఖం యేన తస్మై (వ్యానాయ) వ్యానితి సర్వాన్ శుభగుణకర్మస్వభావాన్ యేన తస్మై (విశ్వమ్) సమగ్రమ్(జ్యోతిః) విజ్ఞానమ్ (యచ్ఛ)గృహాణ (అగ్నిః) విజ్ఞానవాన్ (తే) తవ (అధిపతిః) స్వామీ (తయా) దేవతయా) దివ్యయా (అఙ్గిరస్వత్)సూత్రాత్మవత్(ధ్రువా)నిష్కమ్పా(సీద)స్థిరా భవ.॥౨౪॥అన్వయః:- యా విరాట్ స్త్రీ జ్యోతి రధారయత్ సా సహాఽఖిలం సుఖం ప్రాప్నుయాత్. హే స్త్రి! యేఽగ్ని స్తేఽధిపతిరస్తి తయా దేవతయా సహ త్వమఙ్గిరస్వద్ ధ్రువా సీద. హే పురుష! యాఽగ్నిస్తవాఽధిపత్న్యస్తి తయా దేవతయా సహ త్వమఙ్గిరస్వద్ ధ్రువః సీద. హే స్త్రి! యః ప్రజాపతిః పృథివ్యాః పృష్ఠే విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయ జ్యోతిష్మతీం విద్యుతా మివ త్వా సాదయతు, సా త్వం విశ్వం జ్యోతిర్యచ్ఛైతస్మా ఏనం పతిం త్వం సాదయ. ॥౨౪॥ భావార్థః :-యే స్త్రీపురుషాః సత్సంగవిద్యాభ్యాసాభ్యాం విద్యుదాది పదార్థవిద్యాం వర్ధయన్తే త ఇహ సుఖినో భవన్తి. పతిః స్త్రియం సదా సత్కుర్యాత్. స్త్రీ పతిఞ్చ కుర్యాత్. ఏవం పరస్పరం ప్రీత్యా సహైవ సుఖం భుఞ్జాతామ్.

పదార్థము :-విరాట్ = విద్యలచే ప్రకాశించు నే స్త్రీ, జ్యోతిఃఅధారయత్ = విద్యోన్నతిని ధరించి ధరింపజేయునో. స్వరాట్ = సకలధర్మయుక్త వ్యవహారములందు శుద్ధాచరణవంతుడగు నే పురుషుడు,జ్యోతిః = విద్యుదాదిప్రకాశములను, అధారయత్ = ధరించునో. ధరింపజేయునో, ఆ స్త్రీపురుష లిరువురు సకలసుఖములను పొందుదురు. ఓ స్త్రీ! అగ్నిః తే అధిపతిః = అగ్నివలె తేజస్వియు విజ్ఞానవంతుడునగు నే నీ పతియున్నాడో, తయా దేవతయా = ఆసుందరాకారుడైన పతితోపాటు నీవు, అఙ్గిరస్వత్ = సూత్రాత్మయైన వాయువువలె, ధ్రువా = దృఢముగ, సీద = ఉండుము. పురుషుడా! అగ్నివలె తేజోధారిణియై నిన్ను రక్షించు నే స్త్రీయున్నదో ఆ దేవితోపాటు నీవు ప్రాణమువలె ప్రేమతో నిశ్చయముగ స్థితుడవు కమ్ము. ఓ స్త్రీ! ప్రజాపతిః = ప్రజారక్షకుడైన యే నీభర్త, పృథివ్యాః పృష్ఠే = భూతలమునందు, విశ్వస్మై ప్రాణాయ = సకలసుఖచేష్టలకు హేతువు, అపానాయ = దుఃఖములను దూరపరచుటకు సాధనము, వ్యానాయ = సకలసుందరగుణకర్మ స్వభావములప్రచారమునకు హేతువునగు ప్రాణవిద్యకై,జ్యోతిష్మతీమ్ త్వామ్ = ప్రశంసనీయ విద్యాజ్ఞానయుతురాలవగు నేనిన్ను, సాదయతు = ఉత్తమాధికారమునందు స్థాపించునో, ఆ నీవు, విశ్వమ్ జ్యోతిః = సమగ్ర విజ్ఞానమును, యచ్ఛ = గ్రహించుము. మఱియు నా విజ్ఞానప్రాప్తికై స్వపతిని స్థిరపఱచుము. ॥౨౪॥

భావార్థము:-ఏ స్త్రీపురుషులు సత్సంగ విద్యాభ్యాసములతో విద్యుదాది పదార్థవిద్యను,ప్రీతిని నిరంతర మభివృద్ధి పఱచుదురో, వారీ సంసారమున సుఖమును భోగించుదురు. పతి స్త్రీని, స్త్రీ పతిని నిత్యము సత్కరించవలయును. ఈ విధముగ పరస్పరము ప్రీతియుతులై సుఖముల ననుభవించవలయును.

౨౫ మధుశ్చ త్యస్యేన్ద్రాగ్నీ ఋషీ, ఋతువో దేవతాః, పూర్వస్య భురిగతి జగతీ ఛన్దః, నిషాదః స్వరః.
యే అగ్నయ ఇత్యుత్తరస్య భురిగ్బ్రాహ్మీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
అథ వసన్తర్తుర్వర్ణనమాహ. వసంత ఋతువు వర్ణనము.

మధుశ్చ మాధవశ్చ వాసన్తికావృతూ అగ్నేరన్తఃశ్లేషోఽసి కల్పేతాం ద్యావాపృథివీ కల్పన్తామాప ఓషధయః కల్పన్తామగ్నయః పృథఙ్ మమ జ్యైష్ఠ్యాయ సవ్రతాః । యే అగ్నయః సమనసోఽన్తరా ద్యావాపృథివీ ఇమే వాసన్తికావృతూ అభి కల్పమానా ఇన్ద్రమివ దేవా అభిసంవిశన్తు తయా దేవతయాఙ్గిరస్వద్ ధ్రువే సీదతమ్ ॥ ॥౨౫॥

మధుః, చ, మాధవః, చ, వాసన్తికౌ, ఋతూ ఇత్యృతూ, అగ్నేః, అన్తఃశ్లేష ఇత్యన్తః+శ్లేషః, అసి, కల్పేతామ్, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, కల్పన్తామ్, ఆపః, ఓషధయః, కల్పన్తామ్, అగ్నయః, పృథక్, మమ, జ్యైష్ఠ్యాయ, సవ్రతా ఇతి స+వ్రతాః, యే, అగ్నయః, సమనస ఇతి స+మనసః, అన్తరా, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, ఇమే ఇతీమే, వాసన్తికౌ, ఋతూ ఇత్యృతూ, అభికల్పమానా ఇత్యభి+కల్పమానాః, ఇన్ద్రమివేతీన్ద్రమ్+ఇవ, దేవాః అభిసంవిశన్త్విత్యభి + సంవిశన్తు, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువే ఇతి ధ్రువే, సీదతమ్. [25]

పదార్థః :-(మధుః)మధురసుగన్ధయుక్తశ్చైత్రః(చ) (మాధవః)మధురాది ఫలనిమిత్తో వైశాఖః (చ)(వాసన్తికౌ)వసన్తే భవౌ(ఋతూ)సర్వాన్ ప్రాపకౌ(అగ్నేః)ఉష్ణత్వనిమిత్తస్య (అన్తఃశ్లేషః) ఆభ్యన్తరే సమ్బన్ధః(అసి)భవతి. అత్ర వ్యత్యయః (కల్పేతామ్) సమర్థయతః (ద్యావాపృథివీ) సూర్యభూమీ (కల్పన్తామ్)సమర్థయన్తు (ఆపః)జలాని (ఓషధయః)యవాదయః సోమాదయశ్చ (కల్పన్తామ్)(అగ్నయః)పావకాః(పృథక్)(మమ)(జ్యైష్ఠ్యాయ)జ్యేష్ఠే మాసి భవాయ వ్యవహారాయ మమ వృద్ధత్వాయ వా (సవ్రతాః) వ్రతైః సత్యైర్వ్యవహారైః సహ వర్తమానాః (యే) (అగ్నయః)పావక ఇవ కాలవిదో విద్వాంసః (సమనసః)(సమానవిజ్ఞానాః)(అన్తరా)మధ్యే(ద్యావాపృథివీ) ప్రకాశాన్తరిక్షే (ఇమే) ప్రత్యక్షే (వాసన్తికౌ)(ఋతూ)(అభికల్పమానాః)ఆభిముఖ్యేన సమర్థయన్తః (ఇన్ద్రమివ)యథాపరమైశ్వర్యమ్(దేవాః)(అభిసంవిశన్తు)(తయా)(దేవతయా) పరమపూజ్యయా పరమేశ్వరాఖ్యయా (అఙ్గిరస్వత్) ప్రాణవత్(ధ్రువే) నిశ్చితే దృఢే (సీదతమ్) భవేతామ్. అత్ర పురుషవ్యత్యయః. ॥౨౫॥అన్వయః :-యథా మమ జ్యైష్ఠ్యాయ యావగ్నేరుత్పద్యమానౌ యయోరన్తః శ్లేషోఽసి భవతి తౌ మధుశ్చ మాధవశ్చ వాసన్తికౌ సుఖాయర్తూ కల్పేతాం యాభ్యాం ద్యావాపృథివీ చాపః కల్పన్తామ్ పృథగోషధయః కల్పన్తామగ్నయశ్చ. హే సవ్రతాః సమనసో దేవాః వాసన్తికావృ

తూ యేఽన్త్రా న్తరాగ్నయశ్చ సన్తి తాంశ్చాభికల్పమానాః సన్తో భవన్త ఇన్ద్రమివాభిసంవిశంతు యథే మే ద్యావాపృథివీ తయా దేవతయా సహాఙ్గిరస్వద్ ధ్రువే వర్తేతే తథా యువాం స్త్రీపురుషౌ నిశ్చలౌ సీదతమ్. ॥౨౫॥ భావార్థః :- హే మనుష్యాః! యూయం యస్మిన్ వసన్తర్తౌ శ్లేష్మోత్పద్యతే యస్మిన్ తీవ్రప్రకాశః పృథివీ శుష్కా ఆపో మధ్యస్థా ఓషధయో నూతనపుష్పపత్రాన్వితా అగ్నిజ్వాలా ఇవ భవన్తి తం యుక్త్యా సేవిత్వా పురుషార్థేన సర్వాణి సుఖాన్యాప్నుత. యథా విద్వాంసః పరమప్రయత్నేనాన్వృతుసుఖాయైశ్వర్యమున్నయన్తి తథైవ ప్రయతధ్వమ్. ॥౨౫॥

పదార్థము:- ఎటుల, మమ = నాయొక్క, జ్యైష్ఠ్యాయ = జ్యేష్ఠమాసమునందలి వ్యవహారమునకై లేక శ్రేష్ఠత్వమునకై, అగ్నేః = ఉష్ణతానిమిత్తమగు అగ్నినుండి యేవి జనించినవో, అంతః శ్లేషః అసి = వేనిమధ్య అనేకవిధముల వాయుసంబంధమున్నదో, మధుః = ఆ మధురసుగంధయుక్త చైత్రము. చ = మఱియు, మాధవః = మధురాదిగుణములకు నిమిత్తమగు వైశాఖము, చ = మఱియు వానికి సంబంధించిన పదార్థములతో కూడిన, వాసంతికౌ = వసంతమాసములందు కలుగు, ఋతూ = సుఖప్రాప్తికి సాధనములైన ఋతువులు సుఖమునకై, కల్పేతామ్ = సమర్థములగు గాక! ఏ చైత్రవైశాఖమాసముల యాశ్రయమున, ద్యావాపృథివీ = సూర్యుడు భూమి, ఆపః = జలములు భోగమునందు, కల్పంతామ్ = ఆనందదాయకములో, పృథక్ ఓషధయః = వేర్వేరు సస్యములు లేక సోమలతాద్యోషధులు, అగ్నయః = విద్యుదగ్నులు, కల్పంతామ్ = కార్యసాధకములై యున్నవో. సవ్రతాః = నిరంతరము సత్యభాషణాది వ్రతములతో కూడినవారలారా! సమనసః దేవాః = విజ్ఞానవంతులైనవిద్వాంసులారా! వాసంతికౌ ఋతూ = వసంతర్తువునందుండు చైత్రవైశాఖమాసములు, యే అన్తరా అగ్నయః = మధ్యనున్న అగ్నులేవియున్నవో వానికి, అభికల్పమానాః = సమ్ముఖులై కార్యనిమగ్నులగుచున్నమీరు, ఇంద్రమివ = ఉత్తమైశ్వర్యమును పొందునటుల, అభిసంవిశంతు = అన్నివైపులనుండి ప్రవేశమొనరించుడు, ఎటుల, ఇమే ద్యావాపృథివీ = ఈప్రకాశభూములు, తయా దేవతయా = ఆ పరమపూజ్యుడైన పరమేశ్వర దేవతా సామర్థ్యముతో, అఙ్గిరస్వత్ = ప్రాణమువలె, ధ్రువే = దృఢములు నిశ్చలములుగ ఉండుచున్నవో అటులనే మీ స్త్రీ పురుష లిరువురు నిశ్చలులై సదాసంయుక్తులై, సీదతమ్ = స్థిరులుగ నుండుడు. ॥౨౫॥

భావార్థము :- మానవులారా! ఏ వసంతర్తువునందు ఫలపుష్పాదు లుత్పన్నములగుచున్నవో, ఎందు తీవ్రప్రకాశము, శుష్కపృథివి. జలములు, మధ్యమౌషధులు పుష్పఫలయుతములై అగ్నిజ్వాలలవలె వేర్వేరుగ నుండుచున్నవో దానిని యుక్తితో సేవించి పురుషార్థముతో సకలసుఖములను పొందుడు. విద్వాంసులెటుల అత్యంతప్రయత్నముతో సర్వర్తువుల సుఖమునకై సంపత్తిని నభివృద్ధి పఱచుచున్నారో అటులనే మీరును ప్రయత్నించుడు. ॥౨౫॥ (౬౨౫)

౬౨౬ అషాఢాసీత్యస్య సవితా ఋషిః, క్షత్రపతిర్ దేవతా, నిచృదనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః.

పునః సా కీదృశీ భవేదిత్యాహ. అబిడ[రాణి]ఎటువంటిదిగ నుండవలయును?

అషాఢాసి సహమానా సహస్వారాతీః సహస్వ
పృతనాయతః। సహస్రవీర్యాసి సా మా జిన్వ॥ ॥౨౬॥

అషాఢా, అసి, సహమానా సహస్వ, అరాతీః, సహస్వ పృతనాయత ఇతి పృతనా+యతః, సహస్రవీర్యేతి సహస్ర + వీర్యా, అసి, సా, మా, జిన్వ.

పదార్థః :—(అషాఢా) శత్రుభిరసహ్యమానా (అసి) (సహమానా) పత్యాదీన్ సోఢుమర్హా (సహస్వ) (అరాతీః) శత్రూన్ (సహస్వ) (పృతనాయతః) ఆత్మనః పృతనాం సేనామిచ్ఛతః (సహస్రవీర్యా) అసంఖ్యాతపరాక్రమా (అసి) (సా) (మా) మామ్ (జిన్వ) ప్రీణీహి. ॥౨౬॥ అన్వయః :— హే పత్ని! యా త్వమషాఢాసి సా త్వం సహమానా సతీ పతిం మాం సహస్వ. యా త్వం సహస్రవీర్యాఽసి సా త్వం పృతనాయతోఽరాతీః సహస్వ యథాహం త్వాం ప్రీణామి పతిం తథా మా చ జిన్వ. ॥౨౬॥ భావార్థః :—యా కృతదీర్ఘ బ్రహ్మచర్య బలిష్ఠా జితేంద్రియా వసన్తాద్యృతు కృత్య విలక్షణా పత్యపరాధక్షమాకారిణీ శత్రునివారికోత్తమ పరాక్రమా స్త్రీ నిత్యం స్వస్వామినం ప్రీణాతి తాం పతిరపి నిత్య మానన్దయేత్. ॥౨౬॥

పదార్థము :— ఓపత్నీ ఏ నీవు, అషాఢా అసి = శత్రువునకు సహించరాని దానవో. అట్టి నీవు, సహమానా = పత్యాదులను సహించుచు [పతియైన నాఉపదేశములను] సహస్వ = సహించుము ఏనీవు, సహస్రవీర్యా అసి = అనంతపరాక్రమములతో కూడినదానవై యున్నావో, సా = ఆ నీవు, పృతనాయతః అరాతీః = తమకు తామే సేనవలె యుద్ధేచ్ఛువులగుచున్న శత్రువులను, సహస్వ = ఎదిరించుము. నేను నిన్నెటుల ప్రసన్నురాలుగ నుంచుచున్నానో అటులనే, మా = పతియైన నన్ను, జిన్వ = తృప్తిపఱచుము. ॥౨౬॥

భావార్థము :—దీర్ఘ బ్రహ్మచర్యమొనర్చి బలిష్ఠురాలైనదియు, జితేంద్రియురాలును, వసంతాది ఋతుకృత్యముల నెఱుగునదియు, పత్యపరాధములను క్షమించునదియు, శత్రువులను నిరోధించునదియు, ఉత్తమ పరాక్రమవతియునగు నే స్త్రీ నిత్యము స్వస్వామిని సంతోషపఱచునో, ఆమెను పతియు నిత్య మానందింపజేయును. ॥౨౬॥ (౬౫౬)

౬౫౭ మధువాతా ఇత్యస్య గోతమ ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృద్గాయత్రీ ఛందః. షడ్జః స్వరః.

అథ వసన్తర్తో ర్గుణాన్తరా నాహ. వసన్త ఋతువుయొక్క గుణాంతరముల జెప్పుచున్నాడు.

మధువాతా ఋతాయతే మధుక్షరన్తి సిన్ధవః । మాధ్వీర్నః సన్త్వోషధీః ॥౨౭॥

మధు, వాతాః, ఋతాయతే, ఋతయత ఇత్యృత+యతే, మధు, క్షరన్తి, సిన్ధవః, మాధ్వీః నః, సన్తు, ఓషధీః. [27]

పదార్థః:—(మధు) మధురం యథా స్యాత్తథా (వాతాః) వాయవః (ఋతాయతే) ఋత ముదకమివాచరన్తి. అత్ర వచనవ్యత్యయేన బహువచనస్థాన ఏకవచనమ్. ఋత మిత్యుదకనామసు పఠితమ్. నిఘం. ౧.౧౨. న ఛన్దస్యపుత్రస్యేతీత్వాభావః. అన్యేషా మపీతి దీర్ఘః (మధు) (క్షరన్తి) వర్షన్తి (సిన్ధవః) నద్యః సముద్రా వా. సిన్ధవ ఇతి నదీ నామ...నిఘం. ౧.౧౩ (మాధ్వీః) మాధ్వ్యో మధురగుణయుక్తాః, అత్ర ఋత్వ్యవాస్త్వ్య... ఇతి మధు శబ్దాదణి యణాదేశనిపాతః (నః) అస్మభ్యమ్ (సన్తు) (ఓషధీః) ఓషధయః. ॥౨౭॥ అన్వయః :— హే మనుష్యాః యథా వాతా వసన్తే నో మధు ఋతాయతే సిన్ధవో మధు క్షరన్తి. ఓషధీ ర్నో మాధ్వీః సన్తు తథా వయ మనుతిష్ఠేమ. ॥౨౭॥ భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః, యదా వసన్త ఆగచ్ఛతి తదా పుష్పాది సుగన్ధయుక్తా వాయవాదయః పదార్థా భవన్తి తస్మిన్ భ్రమణం పథ్యం వర్తత ఇతి వేద్యమ్. ॥౨౭॥

పదార్థము:—మానవులారా! ఎటుల వసంతఋతువునందు, వాతాః = వాయువులు, మధు = మా

ధర్మ్యముతో, ఋతాయతే = జలములవలె నడచుచున్నవో, సింధవః = నదులు లేక సముద్రములు, మధు = కోమలత్వముగ, క్షరంతి = వర్షించుచున్నవో, ఓషధీః = ఓషధులు, మాధ్వీః = మధుర రస గుణయుక్తములుగ, సన్తు = అగునో, అటుల [అటువంటిప్రయత్నము] మనమనుష్ఠించుదము

భావార్థము:— ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. వసంతర్తువు ప్రవేశించినప్పుడు వాయ్వాదిపదార్థములు పుష్పాదులు సుగంధముతోకూడినవగుచున్నవి. ఆ ఋతువునందు భ్రమణ విహారాదు లొనర్చుట పథ్యమని నిశ్చయముగ గ్రహించవలయును. ॥౨౭॥ (౭౫౭)

---

౭౫౮ మధునక్త మిత్యస్య గోతమ ఋషిః, విశ్వేదేవా దేవతాః, గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

పునః స ఏవ విషయ ఉపదిశ్యతే. మరల నావిషయమే చెప్పబడినది.

మధు॒ నక్త॑ము॒తోష॑సో॒ మధు॑మ॒త్పార్థి॑వ॒ꣳ రజః॑ । మధు॒ ద్యౌర॑స్తు నః పి॒తా ॥ ॥౨౮॥

మధు నక్తమ్, ఉత, ఉషసః, మధుమదితి మధు+మత్ పార్థివమ్ రజః, మధు, ద్యౌః అస్తు, నః, పితా. [28]

పదార్థః :—(మధు)(నక్తమ్)రాత్రిః(ఉత) అపి(ఉషసః)ప్రాతర్ముఖాని దినాని (మధుమత్) మధురగుణయుక్తమ్ (పార్థివమ్) పృథివ్యా వికారః (రజః)ద్వ్యణుకాదిరేణు (మధు)(ద్యౌః) ప్రకాశః (అస్తు)(నః) అస్మభ్యమ్ (పితా) పాలకః. ॥౨౮॥ అన్వయః :- హే మనుష్యా ! యథా వసన్తే నక్తం మధూతాప్యుషసో మధు పార్థివం రజో మధుమద్ ద్యౌ ర్మధు పితా నోఽస్తు తథా యూయ మప్యేతం యుక్త్యా సేవధ్వమ్. ॥౨౮॥ భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. ప్రాప్తే వసన్తే పక్షిణోఽపి మధురం స్వనన్తి, హర్షితాః ప్రాణినశ్చ జాయన్తే. ॥౨౮॥

పదార్థము :—మానవులారా! ఎటుల వసంతర్తువునందు, నక్తమ్ = రాత్రి, మధు = కోమలత్వముతోగూడినది, ఉత = మఱియు, ఉషసః = ప్రాతఃకాలమునుండి దినము మధురముగను, పార్థివమ్ రజః = పార్థివములైన ద్వ్యణుకత్రసరేణ్వాదులు, మధుమత్ = మధురగుణయుక్తములుగను మఱియు, ద్యౌః = ప్రకాశముకూడ, మధు = మధురతాయుక్తముగను, పితా = రక్షించువానివలె సమయము, నః = మాకొఱకు, అస్తు = ఉండునో అటులనే యుక్తితో నా వసంత ఋతువును మీరును సేవించుడు. ॥౨౮॥

భావార్థము :—ఈ మంత్రమునందు వాచక లుప్తోపమాలంకారమున్నది. వసంతర్తువు వచ్చినపుడు పక్షులుకూడ కోమల మధురధ్వనులొనర్చును, ఇతర సకలప్రాణులు ఆనందితము లగును?

---

౭౫౯ మధుమానిత్యస్య గోతమ ఋషిః, విశ్వేదేవా దేవతాః, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ వసంతే జనైః కిమాచరణీయ మిత్యాహ. వసంతము నందు మానవులేమి ఆచరించవలెను।।

మధు॑మాన్నో॒ వన॒స్పతి॒ర్మధు॑మాꣳ॥ అస్తు॒ సూర్యః॑ । మాధ్వీ॒ర్గావో॑ భవన్తు నః॥

మధుమానితి మధుమాన్, నః, వనస్పతిః, మధుమానితి మధు+మాన్, అస్తు, సూర్యః, మాధ్వీః, గావః, భవన్తు, నః. [29]

పదార్థః :-(మధుమాన్)ప్రశస్తా మధవో గుణా విద్యన్తే యస్మిన్ సః(నః)అస్మభ్యమ్ (వన

స్పతిః) అశ్వత్థాదిః (మధుమాన్) ప్రశస్తో మధుః ప్రరాపో విద్యతే యస్య సః (అస్తు)భవతు (సూర్యః) సవితా (మాధ్వీః)మధురా గుణా విద్యన్తే యాసు తాః (గావః) ధేనవ ఇవ కిరణాః (భవన్తు) (నః) అస్మభ్యమ్. ॥౨౯॥ అన్వయః :—హే విద్వాంసో! యథా వసన్తే నో వనస్పతి ర్మధుమాన్ సూర్యశ్చ మధుమానస్తు. నో గావో మాధ్వీ ర్భవన్తు తథోపదిశత, ॥౨౯॥ భావార్థః :— హే మనుష్యా! యూయం వసన్తమృతుం ప్రాప్య యాదృగ్ ద్రవ్యహోమేన వనస్పత్యాదయో మధురాది గుణాః స్యుః తాదృశం యజ్ఞమాచరతేత్థం వాసన్తికం సుఖం సర్వే యూయం ప్రాప్నుత.॥౨౯॥

పదార్థము:—విద్వాంసులారా ! ఎటుల వసంతర్తువులో, నః = మాకై, వనస్పతిః = రావి మొదలైన వనస్పతులు, మధుమాన్ = ప్రశంసితములైన కోమలగుణములు గలవిగను, సూర్యః = సూర్యుడు కూడ, మధుమాన్ = ప్రశంసితకోమలత్వయుతుడు గను, అస్తు = అగునో, మఱియు. నః = మాకొఱకు, గావః = ఆవులవలె కిరణములు, మాధ్వీః = కోమలగుణములుగలవియు నగునో అటుల ఉపదేశించుడు. ॥౨౯॥

భావార్థము :—మానవులారా ! మీరు వసంతర్తువులో ఏ విధములైన పదార్థములను హోమము నొనర్చుచో వనస్పత్యాదులు మధురగుణయుతములగునో అటువంటి యజ్ఞము ననుష్ఠించుడు. ఈవిధముగ వసంతర్తుసుఖమును మీరందరు పొందుడు. ॥౨౯॥ (౬౨౯)

ఓం అపామిత్యస్య గోతమ ఋషిః, ప్రజాపతి ర్దేవతా, ఆర్షీ పఙ్క్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.
పునస్తమేవ విషయమాహ. మఱల నద్విషయమే.

అపాం గమ్భన్త్సీద మా త్వా సూర్యోఽభితాప్సీన్మాఽగ్ని ర్వైశ్వానరః ।
అచ్ఛిన్నపత్రాః ప్రజా అనువీక్షస్వానుత్వా దివ్యా వృష్టిః సచతామ్ ॥ ॥౩౦॥

అపామ్, గమ్భన్, సీద, మా, త్వా, సూర్యః, అభి, తాప్సీత్, మా, అగ్నిః, వైశ్వానరః, అచ్ఛిన్నపత్రా ఇత్యచ్ఛిన్న + పత్రాః, ప్రజా ఇతి ప్ర+జాః, అనువీక్షస్వేత్యను + వీక్షస్వ, అను, త్వా, దివ్యా, వృష్టిః సచతామ్. [30]

పదార్థః :—(అపామ్) జలానామ్(గమ్భన్)గమ్భని ధారకే మేఘే. అత్ర గమ ధాతో ర్బాహులకాద్ భనిః ప్రత్యయః సప్తమ్యా లుక్ చ (సీద)ఆఃస్వ (మా) (త్వా)(సూర్యః)మార్తణ్డః(అభి)(తాప్సీత్)తపేత్(మా)(అగ్నిః) (వైశ్వానరః)విశ్వేషునరేషురాజమానః(అచ్ఛిన్నపత్రాః) అచ్ఛిన్నాని పత్రాణి యాసాం తాః(ప్రజాః)(అనువీక్షస్వ)ఆనుకూల్యేన విశేషతః సంప్రేక్షస్వ(అను) (త్వా) త్వామ్ (దివ్యా) శుద్ధగుణసమ్పన్నా (వృష్టిః)(సచతామ్)సమవైతు. ॥౩౦॥ అన్వయః :— హే మనుష్య ! త్వం వసన్తేఽపాం గమ్భన్నివ సీద యతః సూర్యస్త్వామాఽభితాప్సీత్. వైశ్వానరోఽగ్నిస్త్వామాభితాప్సీదచ్ఛిన్నపత్రాః ప్రజా అను త్వా దివ్యా వృష్టిః సచతాం తథా త్వమనువీక్షస్వ ॥౩౦॥ భావార్థః :—వసన్తగ్రీష్మ యోర్మధ్యే మనుష్యా జలాశయస్థం శీతలం స్థానం సంసేవన్తామ్.యేన తాపాభితప్తా న స్యుఃయేనయజ్ఞేన పుష్కలావృష్టిః స్యాత్ప్రజానన్దశ్చ తం సేవధ్వమ్.

పదార్థము :—మానవుడా ! నీవు వసంతర్తువులో, అపామ్ గమ్భన్ = జలముల కాధారకర్తయైన మేఘము[వలె]నందు, సీద = స్థిరుడవుకమ్ము, దానివలన, సూర్యః = సూర్యుడు, త్వా = నిన్ను

మా అభితాప్సీత్ = తపింపజేయజాలడు. వైశ్వానరః = సకలమానవులందు ప్రకాశమానమగుచున్న అగ్నిః = విద్యు దగ్ని, త్వా మా అభితాప్సీత్ = నిన్ను తపింపజేయజాలదు. అచ్ఛిన్నపత్రాః = సుందరములు పుష్పములునగు అవయవములు గలిగిన. ప్రజాః = ప్రజ, అను త్వా = నీకనుకూలముగ నుండును, దివ్యా వృష్టిః = శుద్ధగుణయుక్తమగు వర్షము, సచతామ్ = లభించును. ఆవిధమున, అనువీక్షస్వ = అనుకూలముగ విశేషించి విచారమొనర్చుము. ॥౩౦॥

భావార్థము :_మానవులు వేడిచే దుఃఖితులు గాకుండునటుల వసంత గ్రీష్మర్తువుల మధ్య జలాశయ స్థలములగు శీతలస్థానముల నాశ్రయించవలయును .ఏ యజ్ఞముచే పుష్కలముగ వర్షము కురియునో, ప్రజ లానందితు లగుదురో అట్టి యజ్ఞము నాచరించవలయును. ॥౩౦॥ (౬౯౦)

---

౬౯౧ త్రీన్త్సముద్రా నిత్యస్య గోతమ ఋషిః, వరుణో దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథ జనైస్తత్ర సుఖప్రాప్తయే కిమాచరణీయ మిత్యాహ.

జనులు సుఖప్రాప్తికై ఏమి ఆచరించవలయును ?

త్రీన్త్సముద్రాన్త్సమసృపత్ స్వర్గానపాం పతి ర్వృషభ ఇష్టకానామ్ ।
పురీషం వసానః సుకృతస్య లోకే తత్ర గచ్ఛ యత్ర పూర్వే పరేతాః ॥ ॥౩౧॥

త్రీన్, సముద్రాన్, సమ్, అసృపత్, స్వర్గానితి, స్వః+గాన్, అపామ్, పతిః, వృషభః, ఇష్టకానామ్, పురీషమ్, వసానః, సుకృతస్యేతి, సు+కృతస్య, లోకే, తత్ర, గచ్ఛ, యత్ర, పూర్వే, పరేతా ఇతి పరా+ఇతాః. [31]

పదార్థః :-(త్రీన్)అధోమధ్యోర్ధ్వస్థాన్(సముద్రాన్)సముద్ద్రవన్తి పదార్థా యేషు తాన్ భూత భవిష్యద్వర్తమానాన్ సమయాన్(సమ్)(అసృపత్)సర్పతి (స్వర్గాన్) స్వః సుఖం గచ్ఛన్తి ప్రాప్నువన్తి యేభ్య స్తాన్(అపామ్)ప్రాణానామ్(పతిః)రక్షకః(వృషభః)వర్షకః శ్రేష్ఠో వా(ఇష్టకానామ్)ఇజ్యన్తే సంగమ్యన్తే కామా యైః పదార్థై స్తేషామ్(పురీషమ్)పూర్ణసుఖకర ముదకమ్(వసానః)వాసయన్(సుకృతస్య)సుష్ఠు కృతో ధర్మో యేన తస్య(లోకే)ద్రష్టవ్యే స్థానే (తత్ర)(గచ్ఛ)ధర్మ్యే మార్గే (పూర్వే)ప్రాక్తనా జనాః(పరేతాః)సుఖం ప్రాప్తాః. ॥౩౧॥ అన్వయః :_హే విద్వంస్త్వం యథాఽపాం పతి ర్వృషభః పురీషం వసానః సన్నిష్టకానాం త్రీన్ సముద్రాంల్లోకాన్ స్వర్గాన్ సమసృపత్, సంసర్పతి తథా సర్ప యత్ర సుకృతస్య లోకే మార్గే పూర్వే పరేతాస్తత్ర త్వమపి గచ్ఛ. భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. మనుష్యై ర్ధార్మికాణాం మార్గేణ గచ్ఛద్భిః శారీరిక వాచిక మానసాని త్రివిధాని సుఖాని ప్రాప్తవ్యాని. యత్ర కామా అలం స్యు స్తత్ర ప్రయతితవ్యం యథా వసన్తాదయ ఋతవః క్రమేణ వర్తిత్వా స్వాని స్వాని లింగాన్యభిపద్యన్తే తథర్త్వనుకూలాన్ వ్యవహారాన్ కృత్వాఽఽనన్దయితవ్యమ్. ॥౩౧॥

పదార్థము :_విద్వాంసుడా : నీవు ఎటుల, అపామ్ పతిః = ప్రాణముల రక్షకుడు. వృషభః = వర్షమునకు హేతువు, పురీషమ్వసానః = పూర్ణసుఖకారకమగు జలమును ధారణ మొనర్చువాడునై సూర్యుడు, ఇష్టకానామ్ = కామనలప్రాప్తికి హేతువులగు పదార్థముల కాధారరూపములైన, త్రీన్ = క్రింద మీద మధ్య యందుండు మూడురకముల, సముద్రాన్ = సకలపదార్థముల స్థానములను,

పదార్థములు ప్రతీతములగు భూత భవిష్యద్వర్తమానకాలములను, స్వర్గాన్ = సుఖప్రాప్తి కలిగించు లోకములను, సమస్పృశత్ = పొందుచున్నాడో, అటులనే నీవును లభించుము. యత్ర = ఏ ధర్మయుక్తసంతర్తు మార్గమునందు, సుకృతస్య = సుందరధర్మమాచరించువానియొక్క, లోకే = చూడదగిన స్థానమందు లేక మార్గమందు, పూర్వే = ప్రాచీనులు, పరేతాః = సుఖమును పొందియన్నారో, తత్ర = ఆసంతర్తు సేవన మార్గమందు నీవును, గచ్ఛ = నడువుము. ॥౩౧॥

భావార్థము :—ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. ధార్మికుల మార్గమున నడచుచు మానవులు శారీరిక వాచికమానసికములగు సుఖములను పొందవలయును, కామములు తీరునటుల ప్రయత్నించవలయును, ఎటుల వసంతాది ఋతువులు క్రమముగ ప్రవర్తితములై స్వస్వచిహ్నములను పొందుచున్నవో అటులనే ఋతువుల కనుకూలములగు వ్యవహారముల నొనర్చి ఆనందించవలయును. ॥౩౧॥ (౬౯౧)

౬౬౨ మహీ ద్యౌ రిత్యస్య గోతమ ఋషిః, ద్యావా పృథివ్యౌ దేవతే, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః

మాతాపితృభ్యాం స్వసన్తానాః కథం శిక్ష్యా ఇత్యాహ.

తల్లిదండ్రులు స్వసంతానమునకు శిక్ష యెటుల గఱపవలయును ?

మహీ ద్యౌః పృథివీ చ న ఇమం యజ్ఞం మిమిక్షతామ్ । పిపృతాం నో భరీమభిః॥

మహీ, ద్యౌః, పృథివీ, చ, నః, ఇమమ్, యజ్ఞమ్, మిమిక్షతామ్, పిపృతామ్. నః, భరీమభి రితి భరీమ+భిః. [32]

పదార్థః :—(మహీ)మహతీ(ద్యౌః)సూర్యః(పృథివీ)భూమిః (చ) (నః)అస్మాకమ్ (ఇమమ్) (యజ్ఞమ్)సఙ్గన్తవ్యం గృహాశ్రమ వ్యవహారమ్(మిమిక్షతామ్) సేక్తుమిచ్ఛేతామ్(పిపృతామ్) పాలయతమ్(నః)అస్మాన్(భరీమభిః)ధారణపోషణాద్యైః కర్మభిః. ॥౩౨॥ అన్వయః :— హే మాతాపితరౌ! యథా మహీ ద్యౌః పృథివీ చ సర్వం సిఞ్చతః పాలయతస్తథా యువాం న ఇమం యజ్ఞం మిమిక్షతాం భరీమభి ర్నః పిపృతామ్. ॥౩౨॥ భావార్థః :—అత్ర వాచకలుప్తోపమాలంకారః. యథా భూమిసూర్యౌ సర్వేషాం ధారణం ప్రకాశం పాలనఞ్చ కురుతస్తథా మాతాపితరః స్వసన్తానేభ్యోఽన్నం విద్యాదానం సుశిక్షాం చ కృత్వా పూర్ణాన్ విదుషః పురుషార్థినః సంపాదయేయుః. ॥౩౨॥

పదార్థము :—మాతాపితరులారా ! ఎటుల, మహీ ద్యౌః = గొప్పసూర్యలోకము, చ = మఱియు, పృథివీ = భూమి సకల జగత్తును తడుపుచు పాలించుచున్నవో అటుల మీరిరువురు, నః ఇమమ్ యజ్ఞమ్ = మాయీ సేవించదగిన విద్యాగ్రహణరూప యజ్ఞమును, మిమిక్షతామ్ = సించన మొనర్చుడు అనగా పూర్ణమగుటకై వాంఛించుడు మఱియు, భరీమభిః = ధారణ పోషణాది కర్మలందు, నః పిపృతామ్ = మమ్ము రక్షింపుడు. ॥౩౨॥

భావార్థము :—ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకార మున్నది. ఎటుల వసన్తర్తువునందు పృథివీ సూర్యులు సకల సంసారమును ధరించుచున్నవో ప్రకాశమొనర్చుచున్నవో పాలనమొనర్చుచున్నవో, అటులనే తల్లిదండ్రులు తమ సంతానమునకు వసంతాది ఋతువులందు అన్న విద్యాదానము లొనర్చి సుశిక్ష గఱపి పూర్ణవిద్వాంసులుగ పురుషార్థులుగ నొనర్చవలయును. ॥౩౨॥

---

౬౬౩ విష్ణోః కర్మాణీత్యస్య గోతమ ఋషిః, విష్ణుర్ దేవతా, నిచృద్గాయత్రీ ఛందః, షడ్జః స్వరః.

విద్వద్వదితరైః కైస్తై రాచరణీయ మిత్యాహ, విద్వాంసులవలె నితరమానవు లాచరించవలయును.

విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే। ఇన్ద్రస్య యుజ్యః సఖా ॥ ॥౩౩॥

విష్ణోః, కర్మాణి, పశ్యత, యతః, వ్రతాని, పస్పశే, ఇన్ద్రస్య, యుజ్యః, సఖా. [33]

పదార్థః :—(విష్ణోః)వ్యాపకేశ్వరస్య (కర్మాణి)జగత్సృష్టిపాలన ప్రలయ కరణ న్యాయాదీని (పశ్యత)సంప్రేక్షధ్వమ్(యతః)(వ్రతాని)నియతాని సత్యభాషణాదీని(పస్పశే)స్పృశతి (ఇన్ద్రస్య)పరమైశ్వర్యమిచ్ఛుకస్య జీవస్యయుక్తస్య (యుజ్యః) ఉపయుక్తానన్దప్రదః (సఖా)మిత్రఇవ వర్త్తమానః. అన్వయః :—హే మనుష్యా ! య ఇన్ద్రస్య జీవస్య యుజ్యః సఖాస్తి యతోఽయం విష్ణోః కర్మాణి వ్రతాని చ పస్పశే తస్మాదేతస్యైతాని యూయ మపి పశ్యత.॥౩౩॥ భావార్థః :-యథా పరమేశ్వరస్య సుహృదుపాసకో ధార్మికో విద్వానస్య గుణకర్మ స్వభావక్రమానుసారాణి సృష్టిక్రమాణి కుర్యాజ్జానీయాత్ తథైవేతరే మనుష్యాః కుర్యుర్జానీయుశ్చ. ॥౩౩॥

పదార్థము :—మానవులారా ! ఎవడు, ఇంద్రస్య = పరమైశ్వర్యమును వాంఛించు జీవునకు, యుజ్యః = ఉపాసించదగినవాడు, సఖా = మిత్రసముడును నై యున్నాడో, యతః = అతని ప్రతాపమువలన నీ జీవాత్మ, విష్ణోః = వ్యాపకుడగు నీశ్వరుని, కర్మాణి = సృష్టిస్థితిలయకర్మలను, న్యాయాదికర్మలను, వ్రతాని = సత్యభాషణాది నియమములను, పస్పశే = స్పర్శించుచున్నది కనుక ఆ పరమాత్మని యీ కర్మలను వ్రతములను మీరుకూడ, పశ్యత = కాంచుడు, ధరించుడు. ॥౩౨॥

భావార్థము :-ఎటుల పరమాత్మని మిత్రుడు, ఉపాసకుడు, ధర్మాత్ముడు విద్వాంసుడునగువాడు పరమాత్మని గుణకర్మస్వభావానుసారము సృష్టిక్రమముల కనుకూలముగ నాచరణగ్రహణములొనర్చునో అటులనే యితర జనులును ఒనర్చవలయును, గ్రహించవలయును. ॥౩౩॥ (౬౬౩)

౬౬౪ ధ్రువాసీత్యస్య గోతమ ఋషిః, జాతవేదా దేవతా, భురిక్ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
విద్వద్వత్ స్త్రీభి రప్యుపదేష్టవ్య మిత్యాహ. విద్వాంసులవలె విదుషీమణులును ఉపదేశించ వలయును.

ధ్రువాసి ధరుణేతో జజ్ఞే ప్రథమమేభ్యో యోనిభ్యో అధిజాతవేదాః ।
స గాయత్ర్యా త్రిష్టుభాఽనుష్టుభా చ దేవేభ్యో హవ్యం వహతు ప్రజానన్ ॥

ధ్రువా, అసి, ధరుణా, ఇతః, జజ్ఞే, ప్రథమమ్, ఏభ్యః, యోనిభ్య ఇతి యోని+భ్యః, అధి, జాతవేదా ఇతి జాత+వేదాః, సః, గాయత్ర్యా, త్రిష్టుభా, త్రిస్తుభేతి త్రి + స్తుభా, అనుష్టుభా, అనుస్తుభేత్యను+ స్తుభా, చ, దేవేభ్యః. హవ్యమ్, వహతు, ప్రజానన్నితి ప్ర+జానన్. [34]

పదార్థః :—(ధ్రువా) (స్థిరా) (అసి) (ధరుణా)ధర్త్రీ(ఇతః) కర్మణః(జజ్ఞే)ప్రాదుర్భవతి(ప్రథమమ్) ఆదిమం కార్యమ్ (ఏభ్యః)(యోనిభ్యః) కారణేభ్యః (అధి)(జాతవేదాః)యో జాతేషు విద్యతే సః (సః)(గాయత్ర్యా) గాయత్రీనిష్పాదితయా విద్యయా (త్రిష్టుభా)(అనుష్టుభా)(చ)(దేవేభ్యః) దివ్యగుణేభ్యో విద్వద్భ్యో వా(హవ్యమ్)హోతుమాదాతు మర్హం విజ్ఞానమ్(వహతు) ప్రాప్నోతు (ప్రజానన్)ప్రకృష్టతయా జానన్. ॥౩౪॥ అన్వయః:—హే స్త్రి! యథా త్వం ధరుణా ధ్రువాసి యథై

భ్యో యోనిభ్యః స జాతవేదాః ప్రథమ మధిజజ్ఞే తథేతోఽధిజాయస్వ. యథా స తవ పతి ర్గాయత్ర్యా త్రిష్టుభానుష్టుభా చ ప్రజానన్ దేవేభ్యో హవ్యం వహతు తథైతయా ప్రజానన్తీ బ్రహ్మచారిణీ కన్యా భవ స్త్రీభ్యః స్త్రీభ్యో విజ్ఞానం ప్రాప్నోతు. ॥౩౬॥ భావార్థః-మనుష్యా జగదీశ్వరసృష్టి క్రమనిమిత్తాని విదిత్వా విద్వాంసో భూత్వా యథా పురుషేభ్యః శాస్త్రోపదేశాన్ కుర్వంతి తథైవ స్త్రియోఽప్యేతాని విదిత్వా స్త్రీభ్యో వేదార్థనిష్కర్షోపదేశాన్ కుర్వన్తు. ॥౩౪॥

పదార్థము :-ఓ స్త్రీ ! ఎటుల నీవు, ధరుణా = శుభగుణముల ధరించుదానవు. ధ్రువా అసి = స్థిరురాలవునై యున్నావో; ఎటుల, ఏభ్యః యోనిభ్యః = ఈకారణములకంటె,సః జాతవేదాః = ప్రసిద్ధపదార్థములందున్న ఆ వాయువు, ప్రథమమ్ = పూర్వము, అధిజజ్ఞే = అధికముగ ప్రకటితమగుచున్నదో; అటుల, ఇతః = ఈకర్మానుష్ఠానమువలన సర్వోపరిగ ప్రసిద్ధురాలవు గమ్ము. ఎటుల నీ పతి, గాయత్ర్యా త్రిష్టుభా చ అనుష్టుభా = గాయత్రి త్రిష్టుప్పు అనుష్టుప్పుమంత్రములవలన సిద్ధమైనవిద్యతో, ప్రజానన్ = బుద్ధిమంతుడై, దేవేభ్యః = సుగుణములనుండి లేక విద్వాంసులనుండి, హవ్యమ్ = ఆదాన ప్రదానమొనర్చదగు విజ్ఞానమును. వహతు = పొందునో: అటుల ఈ విద్యచే బుద్ధిమంతురాండ్రైన మీ స్త్రీల నుండి బ్రహ్మచారిణీకన్య విజ్ఞానమును పొందును గాక! ॥౩౪॥

భావార్థము :-మానవులు జగదీశ్వరుని సృష్టిక్రమ నిమిత్తములనుఎఱిగి విద్వాంసులై యెటుల పురుషులకు శాస్త్రోపదేశముల నొనర్చుచున్నారో అటులనే స్త్రీలును సృష్టిక్రమముయొక్క నిమిత్తముల నెఱిగి స్త్రీలకు వేదార్థ నిష్కర్షతోగూడిన ఉపదేశముల నొసంగవలయును. ॥౩౪॥ (౬౬౪)

---

౬౬౫ ఇషే రాయ ఇత్యస్య గోతమ ఋషిః, జాతవేదా దేవతా, నిచృద్బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

అథ జాయాపతీ ఉద్వాహం కృత్వా కథం వర్తేయాతా మిత్యాహ.

స్త్రీ పురుషులు వివాహమాడి ఎటుల ప్రవర్తించవలయును ?

ఇషే రాయే రమస్వ సహసే ద్యుమ్న ఊర్జే అపత్యాయ ।
సమ్రాడసి స్వరాడసి సారస్వతౌ త్వోత్సౌ ప్రావతామ్ ॥ ॥౩౫॥

ఇషే, రాయే, రమస్వ, సహసే, ద్యుమ్నే, ఊర్జే, అపత్యాయ, సమ్రాడితి, సమ్+రాట్, అసి, స్వరాడితి, స్వరాట్, అసి, సారస్వతౌ, త్వా. ఉత్సౌ,ప్ర, అవతామ్.[35]

పదార్థః :-(ఇషే)విజ్ఞానాయ (రాయే)శ్రియే(రమస్వ)క్రీడస్వ(సహసే)బలాయ (ద్యుమ్నే) యశసేఽన్నాయ వా ద్యుమ్నం ద్యోతతే యశో వాఽన్నం వా. నిరు. ౫.౫ (ఊర్జే) పరాక్రమాయ (అపత్యాయ)సంతానాయ(సమ్రాట్)యః సమ్యగ్రాజతే సః(అసి)(స్వరాట్)యా స్వయం రాజతే సా (అసి)(సారస్వతౌ)సరస్వత్యాం వేదవాచి కుశలా వుపదేశకోపదేష్ట్ర్యౌ(త్వా) త్వామ్(ఉత్సౌ)కూపోదకమివార్ద్రీభూతౌ(ప్ర)(అవతామ్)రక్షణాదికం కురుతామ్. ॥౩౫॥ అన్వయః :-హే పురుష! యస్త్వం సమ్రాడసి. హే స్త్రి! యా త్వం స్వరాడసి స త్వం చేషే రాయే ద్యుమ్న ఊర్జేఽపత్యాయ రమస్వ.ఉత్సావివ సారస్వతౌ స్తస్తావేతాని ప్రావతామితి త్వాం పురుషం స్త్రియం చోపదిశామి. ॥౩౫॥ భావార్థః :-కృతవివాహౌ స్త్రీ పురుషౌ పరస్పరం ప్రీత్యా విద్వాంసౌ సన్తౌ వసన్తే పురుషార్థేన శ్రీమన్తౌ సద్గుణౌ పరస్య రక్షాం కుర్వన్తౌ ధర్మేణాపత్యాన్యుత్పాద్యాస్మిన్ సంసారే నిత్యం క్రీడేతామ్. ॥౩౫॥

పదార్థము :—పురుషుడా ! ఏ నీవు, సమ్రాట్ అసి = విద్యాదిశుభగుణములచే స్వయం ప్రకాశ మానుడవో, ఓ స్త్రీ ! ఏ నీవు, స్వరాట్ అసి = స్వయముగ విజ్ఞానసత్యాచరణములచే శోభాయమాను రాలవో, అట్టి మీరిరువురు, ఇషే = విజ్ఞానమునకై, రాయే = ధనమునకై, సహసే = బలమునకై, ద్యుమ్నే = యశస్సునకై అన్నమునకై, ఊర్జే = పరాక్రమమునకై, అపత్యాయ = సంతానప్రాప్తికై రమస్వ = యత్నమొనర్చుడు. మఱియు, ఉత్సౌ = కూపోదకమువంటి కోమలత్వమును పొంది. సారస్వతౌ = వేదవాణిని ఉపదేశించుటలో కుశలురై స్త్రీ పురుష లిరువురు మీరు ఈ స్వశరీరములను అన్నాది పదార్థములను, ప్రావతామ్ = రక్షిదు లొనర్చుడు. త్వా = మీకీ యుపదేశ మొసగుచున్నాను.

భావార్థము :—వివాహమాడి స్త్రీపురుష లిరువురు పరస్పరప్రీతితో విద్వాంసులై పురుషార్థము తో ధనవంతులై, శ్రేష్ఠగుణయుతులై పరస్పర రక్షణ మొనర్చుకొనుచు ధర్మానుకూలముగ నడచి సంతానముల గని యీ సంసారమున నిత్యము క్రీడించవలయును. ॥౩౫॥ (౮౮౫)

---

౮౮౬ అగ్నే యుక్ష్వా-ఇత్యస్య భరద్వాజ ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః.

అథ శత్రువిజయః కథం కర్త్తవ్య ఇత్యాహ. శత్రువుల నెట్టుల జయించవలయును ?

అగ్నే యుక్ష్వాహి యే తవాశ్వాసో దేవ స్సాధవః। అరం వహన్తి మన్యవే ॥ ॥౩౬॥

అగ్నే, యుక్ష్వ, హి, యే, తవ,అశ్వాసః, దేవ, స్సాధవః, అరమ్, వహన్తి, మన్యవే.

పదార్థః :—(అగ్నే)విద్వన్(యుక్ష్వ)అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః. వికరణస్య లుక్ చ (హి) ఖలు (తవ)(అశ్వాసః)సుశిక్షితా స్తురఙ్గాః(దేవ)దివ్యవిద్యాయుక్త (సాధవః)అభీష్టం సాధ్నువన్తః (అరమ్)అలమ్ (వహన్తి) రథాదీని యానాని ప్రాపయన్తి (మన్యవే) శత్రూణా ముపరి క్రోధాయ. ॥౩౬॥ అన్వయః :—హే దేవాఽగ్నే! యే తవ సాధవోఽశ్వాసో మన్యవేఽరం వహన్తి తాన్ హి త్వం యుక్ష్వ. ॥౩౬॥ భావార్థః :—రాజమనుష్యై ర్వసంతే ప్రథమ మశ్వాన్ సుశిక్ష్య సారథీంశ్చ రథేషు నియోజ్య శత్రువిజయాయ గన్తవ్యమ్. ॥౩౬॥

పదార్థము :—దేవ = శ్రేష్ఠ విద్వాంసుడా! అగ్నే = తేజస్వీ, తవ సాధవః = నీయొక్క అభీష్టసాధకములగు, యే అశ్వాసః = ఏ శిక్షితాశ్వములు, మన్యవే = శత్రువులమీద క్రోధమునకై; అరమ్ వహంతి = సామర్థ్యముతో రథాదియానముల చేర్పించుచున్నవో, వానిని, హి = నిశ్చయముగ, యుక్ష్వ = కట్టుము. ॥౩౬॥

భావార్థము :—రాజాదులు వసంతర్తువునందు ముందు నశ్వములకు శిక్షనొసగవలయును, రథికులను రథముల మీద నియోగించి శత్రువులను జయించుటకై యాత్ర మొనర్చవలెను. ॥౩౬॥(౮౮౬)

౮౮౭ యుక్ష్వోహీత్యస్య విరూప ఋషీ, అగ్నిర్ దేవతా, నిచృద్గాయత్రీ ఛందః. షడ్జః స్వరః.

అథ రాజపురుషకృత్య మాహ. రాజపురుష లేమి చేయవలెను ?

యుక్ష్వో హి దేవహూతమాఀ౨॥అశ్వాఀ౨॥

అగ్నే రథీరివ। నిహోతా పూర్వ్యః సదః ॥ ॥౩౭॥

యుక్ష్వ, హి, దేవహూతమానితి దేవ+హూతమాన్, అశ్వాన్, అగ్నే,

రథీరివేతి రథీః+ఇవ, ని, హోతా, పూర్వ్యః, సదః. [37]

పదార్థః :–(యుక్ష్వ)అత్రాపి దీర్ఘః (హి) కిల(దేవహూతమాన్)దేవై ర్విద్వద్భిః స్పర్ధితాన్ (అశ్వాన్)(అగ్నే)(రథీరివ)యథా శత్రుభిః సహ బహురథాది సేనాఙ్గవాన్ యోద్ధా యుధ్యతి తథా(ని) నితరామ్ (హోతా) దాతా (పూర్వ్యః)పూర్వై ర్విద్వద్భిః కృతశిక్షః(సదః)సీద. అత్ర లఙ్వ్యడభావః. అన్వయః :–హే అగ్నే! పూర్వ్యో హోతా త్వం దేవహూతమానశ్వాన్ రథీరివ యుక్ష్వ. హి న్యాయాసనే నిషదః. ॥౩౭॥ భావార్థః :–సేనాపత్యాది రాజపురుషై ర్మహారథివదశ్వాదీని సేనాఙ్గాని కార్యేషు సంయోజనీయాని. సభాపత్యాదయో న్యాయాసనే స్థిత్వా ధర్మ్యం న్యాయమాచరన్తు. ॥౩౭॥

పదార్థము :–అగ్నే = విద్వాంసుడా ! పూర్వ్యః = పూర్వవిద్వాంసులచే శిక్షితుడవు, హోతా = దానశీలుడవు నగు నీవు, దేవహూతమాన్ = విద్వాంసులతో స్పర్ధించు లేక విద్వచ్ఛిక్షితము లగు, అశ్వాన్ = అశ్వములను, రథీరివ = అనేక రథాది సేనాంగములు గలిగిన యోధుడు శత్రువులతో పోరాడునటులు, యుక్ష్వ = పూన్పుము. హి = నిశ్చయముగ న్యాయాసనముమీద, నిషదః = నిరంతరముస్థితుడవగుము.

భావార్థము :–సేనాపత్యాది రాజపురుషులు మహారథివలె అశ్వాది సేనాంగములను కార్యములందు నియోగించవలయును. సభాపత్యాదులు న్యాయాసనము నందాసీనులై ధర్మానుకూల న్యాయము నాచరించవలయును. ॥౩౭॥ (౧౧౭)

౧౧౮ సమ్యక్స్రవన్తీత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

మనుష్యైః కిం భూత్వా వాగ్ధార్యేత్యాహ. మానవు లెట్టివారలై వాణిని ధరించవలెను ?

సమ్యక్ స్రవన్తి సరితో న ధేనా అన్తర్హృదా మనసా పూయమానాః ।
ఘృతస్య ధారా అభి చాకశీమి హిరణ్యయో వేతసో మధ్య అగ్నేః॥౩౮॥

సమ్యక్, స్రవన్తి, సరితః, న, ధేనాః, అన్తః హృదా, మనసా, పూయమానాః, ఘృతస్య, ధారాః, అభి, చాకశీమి, హిరణ్యయః, వేతసః, మధ్యే, అగ్నేః.

పదార్థః :–(సమ్యక్)(స్రవన్తి)గచ్ఛన్తి(సరితః) నద్యః. సరిత ఇతి నదీనామ...నిఘం. ౧.౧౩ (న)ఇవ(ధేనాః)వాచః. ధేనా ఇతి వాఙ్నామ..నిఘం.౧.౧౧ (అన్తః)అభ్యన్తరే(హృదా)హృదయేన (మనసా)విజ్ఞానవతా చిత్తేన (పూయమానాః)పవిత్రాః(ఘృతస్య)ఉదకస్య (ధారాః)(అభి)ఆభిముఖ్యే (చాకశీమి)భృశం ప్రాప్నోమి(హిరణ్యయః)యశస్వీ(వేతసః)వేగవత్యః, అత్ర వీ ధాతో ర్బాహులకాదౌణాదికః తసిః ప్రత్యయః(మధ్యే)(అగ్నేః)విద్యుతః. ॥౩౮॥ అన్వయః :–హే మనుష్యాః! యథాఽగ్నే ర్మధ్యే హిరణ్యయ ఇవ వర్తమానోఽహం యా ఘృతస్య వేతసో ధారాః సరితో నాన్తర్హృదా మనసా పూయమానా ధేనాః సమ్యక్ స్రవన్తి తా అభిచాకశీమి తథా యూయమప్యేతాః ప్రాప్నుత. ॥౩౮॥ భావార్థః :–అత్రోపమాలంకారః. మనుష్యై ర్యథా సమం విషమం చలన్త్యః శుద్ధాః సత్యో నద్యః సముద్రం ప్రాప్య స్థిరత్వం ప్రాప్నువన్తి తథైవ విద్యాసుశిక్షధర్మైః ప్రవిత్రీభూతా వాణ్యో నిశ్చలాః ప్రాప్తవ్యాః ప్రాపయితవ్యాశ్చ. ॥౩౮॥

పదార్థము :–మానవులారా ! అగ్నేః మధ్యే = విద్యుత్తుమధ్యనున్న, హిరణ్యయః = తేజోభానువలె తేజస్వివి, కీర్తికాముడను విద్యేచ్ఛువునైన నేను, ఘృతస్య = జలముయొక్క, వేతసః =

వేగవంతములగు, ధారాః = ప్రవాహరూపములుగనున్న, సంతః స = నదులవలె, అన్తః = లోపల. హృదా మనసా = అంతఃకరణముయొక్క విజ్ఞానరూపమగు చిత్తముతో, పూయమానాః ఘేనాః = పవిత్రములుగ నొనర్చబడిన యే వాణులు. సమ్యక్ = మంచివిధముగ, స్రవంతి = నడచుచున్నవో వానిని, అభిచాకశీమి = సమ్ముఖుడనై అందలి కొలదిరెటుల ప్రకాశితమొనర్చుచున్నానో అటుల మీరును ఈ వాణులను పొందుడు. ॥౩౮॥

భావార్థము :—ఈమంత్రము నందుపమాలంకారము న్నది. సమముగ రేక విషమముగ [కొద్దిగ గొప్పగ] ప్రవహించునదులన్నియు సముద్రమును పొంది స్థిరములగుచున్నటుల మానవులు విద్యా సుశిక్షాధర్మములచే పవిత్రములు నిశ్చయములునగు వాణులను పొందవలెను. పొందింపజేయవలయును.

---

౬౬౯ ఋచేత్వేత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృద్బృహతీ ఛందః మధ్యమః స్వరః.

విద్వద్భ్య ఇతరై రపి విజ్ఞానం ప్రాప్య మిత్యాహ.

విద్వాంసుల నుండి ఇతరులును జ్ఞానమును పొందవలయును.

ఋచే త్వా రుచే త్వా భాసే త్వా జ్యోతిషే త్వా ।
అభూదిదం విశ్వస్య భువనస్య వాజిన మగ్నే ర్వైశ్వానరస్య చ ॥ ॥౩౯॥

ఋచే, త్వా, రుచే త్వా, భాసే, త్వా, జ్యోతిషే, త్వా, అభూత్, ఇదమ్, విశ్వస్య, భువనస్య, వాజినమ్, అగ్నేః, వైశ్వానరస్య. చ. [39]

పదార్థః :—(ఋచే)స్తుతయే (త్వా)త్వామ్ (రుచే) ప్రీతయే (త్వా) (భాసే)విజ్ఞానాయ (త్వా) (జ్యోతిషే)న్యాయప్రకాశాయ (త్వా)(అభూత్)భవేత్(ఇదమ్)(విశ్వస్య)సర్వాధికారస్య జగతః(వాజినమ్)వాజినాం విజ్ఞానవతా మిద మవయవభూతం విజ్ఞానమ్(అగ్నేః) విద్యుదాఖ్యస్య (వైశ్వానరస్య) అఖిలేషు నరేషు రాజమానస్య(చ). ॥౩౮॥ అన్వయః :—హే విద్వన్ ! యస్య తవ విశ్వస్య భువనస్య వైశ్వానరస్యాగ్నేశ్చ వాజిన మిదం విజ్ఞాన మభూత్ జాతం తమృచే త్వా రుచే త్వా భాసే త్వా జ్యోతిషే త్వా వయ మాశ్రయేమ. ॥౩౯॥ భావార్థః :—యస్య మనుష్యస్య సర్వేషాం జగత్పదార్థానాం యథార్థో బోధః స్యాత్తమేవ సేవిత్వా పదార్థవిజ్ఞానం సర్వై ర్మనుష్యైః ప్రాప్తవ్యమ్.

పదార్థము :—విద్వాంసుడా ! ఏ నీకు, విశ్వస్య భువనస్య = సమస్తజగత్తులోని పదార్థముల యొక్కయు, చ = మఱియు, వైశ్వానరస్య అగ్నేః = సకలమానవులందు శోభాయమానమగుచున్న విద్యుత్తుయొక్కయు, వాజినమ్ = విజ్ఞానవంతులయొక్క అవయవ భూతమగు నేయీ, ఇదమ్ అభూత్ = విజ్ఞానమున్నదో, ఋచే = ఆస్తుతికొఱకు, త్వా = నిన్ను, రుచే త్వా = ప్రీతికై నిన్ను, భాసే = విజ్ఞానప్రాప్తికొఱకు, త్వా = నిన్ను, మఱియు, జ్యోతిషే త్వా = న్యాయప్రకాశమునకై నిన్ను మేమాశ్రయించుచున్నాము. ॥౩౯॥

భావార్థము:—ఏ మానవునకు జగత్తులోని పదార్థముల యథార్థజ్ఞానముకలదో యతనిని సేవించి సకలమానవులు పదార్థవిజ్ఞానమును పొందవలయును. ॥౩౯॥ (౬౬౯)

---

౬౭౦ అగ్నిర్జ్యోతిషేత్యస్య విరూప ఋషిః, అగ్ని ర్దేవతా, నిచృదుష్ణిక్ ఛన్దః, ఋషభః స్వరః.

పునః స ఏవ విషయ ఉపదిశ్యతే. మఱల నావిషయమే ఉపదేశింపబడుచున్నది.

అ॒గ్ని ర్జ్యోతి॑షా॒ జ్యోతి॑ష్మా॒న్ రు॒క్మో వర్చ॑సా॒ వర్చ॑స్వాన్ । స॒హ॒స్ర॒దా అ॑సి స॒హస్రా॑య త్వా ॥ ॥౪౦॥

అ॒గ్నిః, జ్యోతి॑షా, జ్యోతి॑ష్మాన్, రు॒క్మః, వర్చ॑సా, వర్చ॑స్వాన్, స॒హ॒స్ర॒దా ఇతి సహస్ర॒దాః, అ॒సి॒, స॒హస్రా॑య, త్వా॒. [40]

పదార్థః :-(అగ్నిః)పావకః(జ్యోతిషా)దీప్త్యా(జ్యోతిష్మాన్) ప్రశస్తప్రకాశయుక్తః(రుక్మః) సువర్ణమివ (వర్చసా) విద్యాదీప్త్యా (వర్చస్వాన్) విద్యావిజ్ఞానవాన్ (సహస్రదాః) సహస్రమసంఖ్యం సుఖం దదాతీతి(అసి)(సహస్రాయ)అతులవిజ్ఞానాయ(త్వా)త్వామ్. ॥౪౦॥ అన్వయః :- హే విద్వన్! యస్త్వం జ్యోతిషా జ్యోతిష్మానగ్నిరివ వర్చసా వర్చస్వాన్ రుక్మ ఇవ సహస్రదా అసి తం త్వాం సహస్రాయ వయం సత్కుర్యామ్. ॥౪౦॥ భావార్థః:-అత్ర వాచక లుప్తోపమాలంకారః. మను ష్యై ర్యోఽగ్నిసూర్యవిద్యయా ప్రకాశమానో విద్వాన్ భవేత్ తస్మాదధీత్య పుష్కలా విద్యాః స్వీకార్యాః. ॥౪౦॥

పదార్థము:-విద్వాంసుడా ! ఏ నీవు, జ్యోతిషా = విద్యాప్రకాశముచే, అగ్నిః = అగ్నివలె, జ్యోతిష్మాన్ = ప్రశంసిత ప్రకాశయుక్తుడవు. వర్చసా = స్వతేజస్సుతో, వర్చస్వాన్ = జ్ఞాన మిచ్చువాడవు, రుక్మః అసి = సువర్ణమువలె నసంఖ్యసుఖముల నిచ్చువాడవునై ఉన్నావో, త్వా = ఆ నిన్ను, సహస్రాయ = అతులవిజ్ఞానప్రాప్తికై మేము సత్కరించెదము గాక ! ॥౪౦॥

భావార్థము :-ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారం మున్నది. అగ్నిసూర్యులవలె విద్యచే ప్రకాశమానులైన విద్వాంసులవద్ద విద్య నభ్యసించి పూర్ణవిద్యను స్వీకరించవలయును.॥౪౦॥

---

ఉ౨౧ ఆదిత్యం గర్భ మిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తే కిం కుర్యు రిత్యాహ. విద్వాంసులగు స్త్రీపురుషు లేమి చేయవలయును?

ఆ॒ది॒త్యం గర్భం॒ పయ॑సా॒ సమ॑ఙ్గ్ధి స॒హస్ర॑స్య ప్రతి॒మాం వి॒శ్వరూ॑పమ్ । పరి॑వృఙ్గ్ధి॒ హర॑సా॒ మాభి మ॑గ్ంస్థాః శ॒తాయు॑షం కృణుహి చీ॒యమా॑నః ॥

ఆ॒ది॒త్యమ్, గర్భమ్, పయసా, సమ్, అ॒ఙ్గ్ధి॒, స॒హస్ర॑స్య, ప్ర॒తి॒మామితి ప్ర॒తి+మామ్, వి॒శ్వరూ॑ప॒మితి॒ వి॒శ్వ+రూ॑పమ్, పరి॑, వృ॒ఙ్గ్ధి॒, హర॑సా, మా, అ॒భి, మ॒గ్ంస్థాః, శ॒తాయు॑ష॒మితి శ॒త + ఆ॑యుషమ్, కృ॒ణు॒హి॒, చీ॒యమా॑నః. [41]

పదార్థః :-(ఆదిత్యమ్)సూర్యమ్(గర్భమ్)స్తుతివిషయమ్ (పయసా)జలేనేవ(సమ్)(అఙ్గ్ధి) శోధయ (సహస్రస్య) అసంఖ్యపదార్థ సమూహస్య (ప్రతిమామ్)ప్రతీయన్తే సర్వే పదార్థా యయా తామ్ (విశ్వరూపమ్)సర్వరూపవత్పదార్థదర్శకమ్ (పరి)సర్వతః (వృఙ్గ్ధి)వర్జయ (హరసా) జ్వలితేన తేజసా. హర ఇతి జ్వలతో నామ.,నిఘం. ౧.౧౭ (మా)(అభి) (మంస్థాః) మన్యేథాః (శతాయుషమ్) శతవర్షపరిమితజీవనమ్ (కృణుహి) (చీయమానః)వృధ్యమానః. ॥౪౧॥ అన్వయః :-

హే విద్వం స్త్వం యథా విద్యుత్పయసా సహస్రస్య ప్రతిమాం విశ్వరూపం గర్భ మాదిత్యం ధరతి తథా న్తఃకరణం సమజ్గ్ధి. హరసా రోగాన్ పరివృజ్గ్ధి చీయమానః సన్ శతాయుషం తనయం కృణుహి కదాచిన్మాఽభిమంస్థాః. ॥౪౧॥ భావార్థః :- హే స్త్రీపురుషా ! యూయం సుగన్ధ్యాది హోమేన సూర్యప్రకాశం జలం వాయుఞ్చ శోధయిత్వా అరోగా భూత్వా శతాయుష స్తనయాన్ కురుత, యథా విద్యున్నిర్మితేన సూర్యేణ రూపవతాం పదార్థానాం దర్శనం పరిమాణం చ భవతి తథా విద్యావ న్త్యపత్యాని భవ న్తి తస్మాత్ కదాచిదభిమానినో భూత్వా ప్రమాదేన విద్యాయా ఆయుషశ్చ వినాశం మాకురుత, ॥౪౧॥

పదార్థము :- విద్వాంసుడా ! నీవు, విద్యుత్తు, పయసా = జలముచే, సహస్రస్య = అసంఖ్య పదార్థముల, ప్రతిమామ్ = పరిమాణమునుకొలుచు సూర్యునివలె నిశ్చయమొనర్చు బుద్ధిని, మఱియు, విశ్వరూపమ్ = సకలరూపవిషయములను చూపించు, గర్భమ్ = స్తుతియోగ్యమగు, అదిత్యమ్ = సూర్యునెఱుల ధారణమొనర్చుచున్నదో అటుల అంతఃకరణమును, సమజ్గ్ధి = బాగుగ శోధింపుము హరసా = ప్రజ్వలిత తేజస్సుతో రోగములను, పరి = అన్నివైపులనుండి, వృజ్గ్ధి = తొలగించుము. మఱియు, చీయమానః = బుద్ధిని పొంది, శతాయుషమ్ = శతవర్షముల ఆయుస్సుగల సంతానమును, కృణుహి = పొందుము. మఱియు నెన్నటికి, మా అభిమంస్థాః = అభిమాన ముంచకుము.

భావార్థము :— స్త్రీ పురుషులారా ! మీరు సుగంధిత పదార్థములను హోమమొనర్చి సూర్యుని ప్రకాశమును జలవాయువులను శుద్ధమొనర్చుడు, రోగరహితులై నూరేండ్లు మనుపిల్లలను గనుడు. విద్యుదగ్నిచే నిర్మించబడిన సూర్యునివలన రూపవంతములగు పదార్థముల దర్శనము పరిమాణము కలుగుచున్నటుల విద్వాంసులైన పిల్లలు సుఖమును దర్శింపజేయువారగుదురు కనుక నెన్నటికి అభిమానులై విషయాసక్తులై విద్యను ఆయుస్సును వినాశమొనర్చకుడు, ॥౪౧॥ (౬౩౧)

---

౬౩౨ వాతస్య జూతమిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.
పునస్తేన కిం కార్య మిత్యాహ. విద్వాంసుడేమి చేయవలెను ?

వాతస్య జూతిం వరుణస్య నాభిమశ్వం జజ్ఞానꣳ సరిరస్య మధ్యే ।
శిశుం నదీనాꣳ హరిమద్రిబుధ్నమగ్నే మా హిꣳసీః పరమే వ్యోమన్ ॥

వాతస్య, జూతిమ్, వరుణస్య, నాభిమ్, అశ్వమ్, జజ్ఞానమ్, సరిరస్య, మధ్యే, శిశుమ్, నదీనామ్, హరిమ్, అద్రిబుధ్నమిత్యద్రిబుధ్నమ్, అగ్నే, మా, హిꣳసీః, పరమే, వ్యోమన్నితి వి+ఓమన్. [42]

పదార్థః :—(వాతస్య)వాయోః(జూతిమ్) వేగమ్(వరుణస్య)జలసమూహస్య(నాభిమ్) బంధనమ్ (అశ్వమ్) వ్యాప్తం శీలమ్ (జజ్ఞానమ్) ప్రాదుర్భూతమ్ (సరిరస్య) సలిలస్యోదకస్య. సలిలమిత్యుద నా..౧.౧౨ కపిలకాదిత్వాద్రేఫః(మధ్యే) (శిశుమ్)బాలకమ్(నదీనామ్) (హరిమ్)హరమాణమ్ (అద్రిబుధ్నమ్)మేఘాకాశమ్(అగ్నే)పాకవద్వర్తమాన(మా)(హింసీః)(పరమే)ప్రకృష్టే వ్యోమన్ (వ్యోమ్ని)వ్యాప్తే ఆకాశే. ॥౪౨॥ అన్వయః:- హే అగ్నే ! విద్వꣳ స్త్వం పరమే వ్యోమన్ వాతస్య మధ్యే జూతి మశ్వం సరిరస్య వరుణస్య నాభిం నదీనాం జజ్ఞానం శిశుం బాలమివ వర్తమానం

హరిమద్రిబుధ్నం మాహింసీః. ॥౪౨॥ భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలంకారః, మనుష్యైః ప్రమాదేనావకాశే వర్తమానం వాయువేగం వృష్టిప్రబంధం మేఘమహత్వా జీవనం వర్ధనీయమ్.

పదార్థము :- ఓ అగ్నే = తేజస్వీ విద్వాంసుడా ! నీవు, పరమేవ్యోమన్ = సర్వవ్యాప్తమగు నుత్తమ ప్రకాశమందు, వాతస్య మధ్యే = వాయువుమధ్య, జూతిమ్ అశ్వమ్ = వేగరూపాశ్వమును, సరిరస్య వరుణస్య = జలమయమగు నుత్తమ సముద్రిముయొక్క, నాభిమ్ = బంధనమును, నదీనామ్ = నదులప్రభావముచే, జజ్ఞానమ్ = ప్రకటితుడైన, శిశుమ్ = బాలునివలెనున్న, హరిమ్ = నీలవర్ణముగల, అద్రిబుధ్నమ్ = సూక్ష్మమేఘమును, మా హింసీః = నాశన మొనర్చకుము.

భావార్థము :—వాచకలుప్తోపమాలంకార మిందున్నది, మానవులు ప్రమాదమును వదలి ప్రకాశమున నుండు వాయువేగమును, వర్షాప్రబంధకమగు మేఘమును వినాశమొనర్చకుండ తమతమ జీవనములను వృద్ధిపఱచుకొనవలయును. ॥౪౨॥ (౮౭౨)

౮౭౩ అజస్రమిత్యస్య విరూప ఋషిః, అగ్ని ర్దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పునరయం కిం కుర్యా దిత్యాహ, ఆ విద్వాంసు డేమి చేయవలెను ?

అజస్ర మిన్దు మరుషం భురణ్యు మగ్ని మీడే పూర్వచిత్తిం నమోభిః ।
స పర్వభి ర్ఋతుశః కల్పమానో గాం మా హిꣳసీ రదితిం విరాజమ్ ॥

అజస్రమ్, ఇన్దుమ్, అరుషమ్, భురణ్యుమ్, అగ్నిమ్, ఈడే, పూర్వచిత్తిమితి, పూర్వ+చితిమ్, నమోభిరితి నమః+భిః, సః, పర్వభిరితి పర్వ+భిః, ఋతుశ ఇత్యృతు+శః, కల్పమానః, గామ్, మా, హిꣳసీః, అదితిమ్, విరాజమితి, వి+రాజమ్. [43]

పదార్థః :- (అజస్రమ్)నిరన్తరమ్(ఇన్దుమ్)జలమ్(అరుషమ్)(అశ్వమ్)(భురణ్యుమ్)పోషకమ్. అత్ర భురణ ధాతోర్యుః ప్రత్యయః (అగ్నిమ్)విద్యుతమ్ (ఈడే) అధ్యన్విచ్ఛామి (పూర్వచితిమ్)పూర్వా చితి శ్చయనం యస్య తమ్ (నమోభిః)అన్నైః (సః) (పర్వభిః)పూర్ణైః సాధనాఙ్గైః (ఋతుశః) బహూనృతూన్ (కల్పమానః) సమర్థః సన్ (గామ్)పృథివీమ్ (మా) (హింసీః) హింస్యాః(అదితిమ్)అఖణ్డితామ్(విరాజమ్)వివిధైః పదార్థై రాజమానామ్.॥౪౩॥ అన్వయః:- హే విద్వన్! యథాహం పర్వభి ర్నమోభిః సహ వర్తమాన మిన్దుమరుషం భురణ్యుం పూర్వచితి మగ్ని మజస్ర మీడే తమృతుశః కల్పమానః సన్నదితిం విరాజం గాం న నాశయామి; తథైవ స త్వమేతమేనాం చ మా హింసీః. ॥౪౩॥ భావార్థః :-మనుష్యై రృత్వనుకూలతయా క్రియయాఽగ్ని ర్జల మన్నం చ సంసేవ్య రాజభూమిః సదైవ రక్షణీయా. యతః సర్వాణి సుఖాని స్యుః.॥౪౩॥

పదార్థము :—విద్వాంసుడా! నేను, పర్వభిః = పూర్ణసాధనయుక్తమును, నమోభిః = అన్నముతోగూడినదియునగు, ఇందుమ్ = జలరూపము, అరుషమ్ = అశ్వసదృశము, భురణ్యుమ్ = పోషించునది, పూర్వచితిమ్ = ప్రథమనిర్మితము నగు, అగ్నిమ్ = విద్యుత్తును, అజస్రమ్ = నిరంతరమెటుల, ఈడే = అధికముగ నన్వేషించుచున్నానో, దానిని, ఋతుశః = ప్రతిఋతువునందు, కల్పమానః = సమర్థుడనై చేయుచు, అదితిమ్ = అఖండితమును, విరాజమ్ = వివిధములైన పదా

ర్థములచే శోభాయమానము నగు, గామ్ = పృథివిని పాడు జేయనో అటులనే, సః = ఆ నీవును ఈ యగ్నిని ఈ పృథివిని, మా హింసీః = నాశనమొనర్చకుము. ౪౩॥

భావార్థము:—మానవులు యుక్తానుకూలక్రియచే అగ్నిజలాన్నముల సేవించి రాజ్యమును పృథివిని సర్వథా రక్షించవలయును. దానివలన సకల సుఖములు లభించగలవు. ॥౪౩॥ (౬౪౩)

---

౬౪౪ వరూత్రీ మిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

పున స్తేన కిం న కార్య మిత్యాహ. అట్టి విద్వాంసు డేమి చేయగూడదు ?

వరూత్రీం త్వష్టు ర్వరుణస్య నాభి మవిం జజ్ఞానాం రజసః పరస్మాత్ ।
మహీం సాహస్రీ మసురస్య మాయా మగ్నే మా హింసీః పరమే వ్యోమన్ ॥

వరూత్రీమ్, త్వష్టుః, వరుణస్య, నాభిమ్, అవిమ్, జజ్ఞానామ్, రజసః, పరస్మాత్, మహీమ్, సాహస్రీమ్, అసురస్య, మాయామ్, అగ్నే మా హింసీః, పరమే, వ్యోమన్నితి వి+ఓమన్. [44]

పదార్థః :- (వరూత్రీమ్) వరయిత్రీమ్ (త్వష్టుః) ఛేదకస్య సూర్యస్య (వరుణస్య) జలస్య (నాభిమ్) బంధికామ్ (అవిమ్) రక్షణాదినిమిత్తామ్ (జజ్ఞానామ్)ప్రజాతామ్ (రజసః) లోకాత్ (పరస్మాత్)శ్రేష్ఠాత్(మహీమ్)మహతీం భూమిమ్(సాహస్రీమ్)అసంఖ్యాతాం బహుఫలప్రదామ్ (అసురస్య) మేఘస్య(మాయామ్)ప్రజ్ఞాపికాం విద్యుతమ్(అగ్నే)విద్వన్(మా)(హింసీః)హింస్యాః(పరమే) సర్వోత్కృష్టే(వ్యోమన్)ఆకాశవద్ వ్యాప్తే బ్రహ్మణి. ॥౪౪॥ అన్వయః:—హే అగ్నే! త్వం త్వష్టుర్వరూత్రీం వరుణస్య నాభిం పరస్మాద్రజసో జజ్ఞానామసురస్య మాయాం సహస్రీ మవిం పరమే వ్యోమన్వ ర్తమానాం మహీం మా హింసీః ॥౪౪॥ భావార్థః :—సర్వై ర్మనుష్యై ర్యేయం పృథివీ పరస్మాత్కారణాజ్జాతా సూర్యాకర్షణసమ్బన్ధినీ జలాధారా మేఘనిమిత్తా బహుభూగోలాకారాఽసంఖ్యసుఖప్రదా పరమేశ్వరేణ నిర్మితాఽస్తి తాం గుణకర్మస్వభావతో విజ్ఞాయ సుఖాయ సముపయో క్తవ్యా.

పదార్థము :-అగ్నే = విద్వాంసుడా! నీవు. త్వష్టుః = ఛేదకుడైన సూర్యునియొక్క, వరూత్రీమ్ = గ్రహింపయోగ్యమైనదానిని, వరుణస్య నాభిమ్ = జలముయొక్క బంధనమును, పరస్మాత్ రజసః = శ్రేష్ఠలోకమునుండి, జజ్ఞానామ్ = పుట్టినదియు, అసురస్య = మేఘముయొక్క, మాయామ్ = సూచకమైనమెఱుపును, సాహస్రీమ్ = అసంఖ్యమైన ఫలప్రదాతయు, అవిమ్ = రక్షణాదుల నిమిత్తమును, పరమే వ్యోమన్ = సర్వోత్తముడు ఆకాశమువలె వ్యాప్తుడునైన పరమేశ్వరుని యందున్నదియు,మహీమ్ = విస్తారమైనదియునగు పృథివిని, మా హింసీః = పాడుచేయకుము.

భావార్థము :—ఉత్తమ కారణమునుండి యుత్పన్నమైనదియు, సూర్యునిచే నాకర్షించబడుచున్నదియు,జలాధారమగు మేఘమునకు నిమిత్తమును.అసంఖ్య సుఖప్రదమును నగు నే యీ పృథివిని పరమాత్మ సృజించియుండెనో దానిని గుణకర్మస్వభావములతో నెఱిగి సుఖమునకై మానవులు ఉపయోగించుకొనవలయును. ॥౪౪॥ (౬౪౪)

౬౪౫ యో అగ్ని రిత్యస్య విరూప ఋషిః, అగ్ని ర్దేవతా, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః

పునరనేన కిం కార్యమిత్యాహ, ఇట్టి విద్వాంసు డేమి చేయవలయును ?

యో అ॒గ్ని ర॒గ్నే రధ్యజా॑యత॒ శోకా॑త్ పృథి॒వ్యా ఉ॒త వా॑ ది॒వస్పరి॑ ।
యేన॑ ప్ర॒జా వి॒శ్వక॑ర్మా జ॒జాన॒ తమ॑గ్నే॒ హేడః॒ పరి॑ తే వృణక్తు ॥ ॥౪౫॥

యః, అ॒గ్నిః, అ॒గ్నేః, అధి, అజా॑యత, శోకా॑త్, పృ॒థి॒వ్యాః, ఉ॒త, వా॒, ది॒వః, పరి॑, యేన॑, ప్ర॒జా ఇతి॑ ప్ర+జాః, వి॒శ్వక॒ర్మేతి॑ వి॒శ్వ+క॑ర్మా, జ॒జాన॑, తమ్, అ॒గ్నే॒, హేడః॑, పరి॑, తే॒, వృ॒ణ॒క్తు॒. [45]

పదార్థః :—(యః)(అగ్నిః) చాక్షుషః (అగ్నేః)విద్యుదాఖ్యాత్ (అధి) (అజాయత) జాయతే (శోకాత్)శోషకాత్(పృథివ్యాః)(ఉత)(వా)(దివః) సూర్యాత్ (పరి) సర్వతః (యేన)(ప్రజాః)(విశ్వకర్మా) విశ్వాని కర్మాణి యస్య సః (జజాన) జనయతి (తమ్)(అగ్నే) విద్వన్ (హేడః) అనాదరః (పరి) (తే)తవ (వృణక్తు) ఛిన్నో భవతు. ॥౪౫॥ అన్వయః :- హే అగ్నే విద్వన్ ! యః పృథివ్యాః శోకా దుత వా దివోఽగ్నేరగ్ని రధ్యజాయత. యేన విశ్వకర్మా ప్రజాః పరిజజాన తం తే హేడః పరివృణక్తు. ॥౪౫॥ భావార్థః :—హే విద్వాంసో! యూయం యోఽగ్నిః పృథివీం భిత్వోత్పద్యతే యశ్చ సూర్యాదే స్తస్మాద్విఘ్నకారిణోఽగ్నేః సర్వాన్ ప్రాణినః పృథగ్రక్షత. యేనాగ్ని నేశ్వరః సర్వాన్ రక్షతి తద్విద్యాం విజానీత. ॥౪౫॥

పదార్థము :—అగ్నే = విద్వాంసుడా ! పృథివ్యాః = భూమిని, శోకాత్ = శోషణ మొనర్చు [అగ్నినుండి]ఉత వా = లేక. దివః = సూర్యునినుండి, అగ్నేః = విద్యుద్రూపాగ్నినుండి, యః అగ్నిః = ఏ యీ ప్రత్యక్షాగ్ని, అధ్యజాయత = ఉత్పన్న మగుచున్నదో,యేన = దేనిచే,విశ్వకర్మా = సకల కర్మల కాధారుడైన యీశ్వరుడు, ప్రజాః = ప్రజలను, పరి = అన్నివైపులనుండి, జజాన = రచించుచున్నాడో, తమ్ = ఆ యగ్నిని, తే హేడః = నీక్రోధము, పరివృణక్తు = అన్ని విధములఛిన్న భిన్న మొనర్చవలయును. ॥౪౫॥

భావార్థము:—విద్వాంసులారా! మీరు ఏ యగ్నిపృధివిని భేదించుకొని పుట్టుచున్నదో, సూర్యుని వెలుతురునుండి ఏవిద్యుత్తు వెడలుచున్నదో ఆ విఘ్నకారియైన యగ్నినుండి సకలమును సంరక్షితములుగ నుంచుడు, మఱియు నే యగ్నిచే నీశ్వరుడందరిని రక్షించుచున్నాడో ఆయగ్నివిద్యను గ్రహించుడు.

---

౪౬ చిత్రం దేవానా మిత్యస్య విరూప ఋషిః, సూర్యో దేవతా, నిచృత్త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.

అథేశ్వరః కీదృశోఽ స్తీత్యాహ. ఈశ్వరు డెటువంటివాడు ?

చి॒త్రం దే॒వానా॒ ముద॑గా॒దనీ॑కం॒ చక్షు॑ర్మి॒త్రస్య॒ వరు॑ణస్యా॒గ్నేః । ఆ ప్రా॒
ద్యావా॑ పృథి॒వీ అ॒న్తరి॑క్ష॒ꣳ సూర్య॑ ఆ॒త్మా జగ॑తస్ త॒స్థుష॑శ్చ ॥ ॥౪౬॥

చి॒త్రమ్, దే॒వానా॑మ్, ఉత్, అ॒గా॒త్, అనీ॑కమ్, చక్షుః॑, మి॒త్రస్య॑, వరు॑ణస్య, అ॒గ్నేః, ఆ, అ॒ప్రాః, ద్యావా॑పృథి॒వీ ఇతి॒ ద్యావా॑పృథి॒వీ, అ॒న్తరి॑క్షమ్, సూర్యః॑, ఆ॒త్మా, జగ॑తః, త॒స్థుషః॑, చ॒. [46]

పదార్థః:—(చిత్రమ్)అద్భుతమ్ (దేవానామ్) పృథివ్యాదీనాం మధ్యే (ఉత్) (అగాత్) ఉదితోఽస్తి(అనీకమ్) సేనేవ కిరణసమూహమ్ (చక్షుః)దర్శకమ్(మిత్రస్య)ప్రాణస్య (వరుణస్య) ఉదానస్య(అగ్నేః)ప్రసిద్ధస్య(ఆ)(అప్రాః)వ్యాప్నోతి (ద్యావాపృథివీ) ప్రకాశాప్రకాశే జగతీ (అన్తరిక్షమ్) ఆకాశమ్(సూర్యః) సవితా (ఆత్మా) సర్వస్యాన్తర్యామీ(జగతః) జఙ్గమస్య (తస్థుషః) స్థావరస్య (చ) అన్వయః :— హే మనుష్యాః భవన్తో యద్ బ్రహ్మ దేవానాం చిత్ర మనీకం మిత్రస్య వరుణస్యాగ్నే శ్చక్షుః సూర్య ఇవోదగాజ్జగత స్తస్థుషశ్చాత్మా సద్ ద్యావాపృథివీ అన్తరిక్షం చాప్రాస్తజ్జగన్నిర్మాతృ పాతృ సంహర్తృ వ్యాపకం సతత ముపాసీరన్. ॥౪౬॥ భావార్థః :—అత్ర వాచకలుప్తోపమాలంకారః. న ఖల్విదం నిష్కర్తృక మనధిష్ఠాతృక మనీశ్వరం జగదస్తి. యద్ బ్రహ్మ సర్వాన్తర్యామి సర్వేషాం జీవానాం పాప పుణ్య ఫలదాన వ్యవస్థాపక మనన్తజ్ఞానప్రకాశం వర్తతే తదేవోపాస్య ధర్మార్థ కామమోక్షఫలాని మనుష్యై రాప్తవ్యాని. ॥౪౬॥

పదార్థము:—మానవులారా! మీరు; ఏ బ్రహ్మ, దేవానామ్ = పృథివ్యాది దివ్యపదార్థముల మధ్య, చిత్రమ్ = ఆశ్చర్యరూపుడు, అనీకమ్ = సేనవలె కిరణసమూహము గలవాడు, మిత్రస్య = ప్రాణమును, వరుణస్య = ఉదానమును, అగ్నేః = ప్రసిద్ధాగ్నిని, చక్షుః = చూపించువాడు నగు,సూర్యః = సూర్యునివలె,ఉదగాత్ = ప్రకటితు డగుచున్నాడో,[అతడు]జగతః = చేతనము,చ = మఱియు, తస్థుషః = జడమునగు జగత్తుయొక్క, ఆత్మా = అంతర్యామియై, ద్యావాపృథివీ = ప్రకాశాప్రకాశస్వరూపమైన జగత్తులందు,అంతరిక్షమ్ = ఆకాశమునందు,ఆ = చక్కగ,అప్రాః = వ్యాప్తుడై ఉండుచున్నాడో, సృష్టిస్థితి సంహారప్రలయముల నొనర్చు నా వ్యాపకబ్రహ్మనే నిరంతర ముపాసించుడు.

భావార్థము :—ఈమంత్రమునందు వాచక లుప్తోపమాలంకార మున్నది, ఏ కర్త ఏ అధిష్ఠాత, ఏ యీశ్వరుడు లేకుండా జగత్తు కానేరదు. ఏ బ్రహ్మ సర్వాంతర్యామి, సకలజీవులకు పాపపుణ్యకర్మల ఫలములనిచ్చువాడు, అనంతజ్ఞాన ప్రకాశకుడు నై యున్నాడో అతనినే యుపాసించి సకలమానవులు ధర్మార్థకామమోక్షముల ఫలములను బడయవలయును, ॥౪౬॥ (౬౩౬)

---

౬౩౭ ఇమం మేత్యస్య విరూప ఋషిః అగ్నిర్ దేవతా, విరాడ్బ్రాహ్మీ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పునర్మనుష్యేణ కిం కార్య మిత్యాహ. మానవులేమి చేయవలెను ?

ఇమం మా హిꣳసీ ర్ద్విపాదం పశుꣳ సహస్రాక్షో మేధాయ చీయమానః ।
మయుం పశుం మేధమగ్నే జుషస్వ తేన చిన్వాన స్తన్వో నిషీద ।
మయుం తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥ ॥౪౭॥

ఇమమ్, మా, హిꣳసీః, ద్విపాదమితి ద్వి+పాదమ్, పశుమ్, సహస్రాక్ష ఇతి సహస్ర+అక్షః, మేధాయ, చీయమానః, మయుమ్, పశుమ్, మేధమ్, అగ్నే, జుషస్వ, తేన, చిన్వానః తన్వః, ని, సీద, మయుమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు. [47]

పదార్థః :—(ఇమమ్)(మా) (హిꣳసీః) హింస్యాః (ద్విపాదమ్) మనుష్యాదికమ్ (పశుమ్)

చతుష్పాదం గవాదికమ్ (సహస్రాక్షః)అసంఖ్యదర్శనః (మేధాయ)సుఖసంగిమాయ (చీయమానః) వర్ధమానః (మయుమ్)జాఙ్గలమ్ (పశుమ్)ప్రసిద్ధమ్ (మేధమ్) పవిత్రకారకమ్ (అగ్నే) పావక ఇవ మనుష్యజన్మప్రాప్త (జుషస్వ) ప్రీణీహి (తేన) (చిన్వానః) వర్ధమానః(తన్వః) శరీరస్య మధ్యే పుష్టః సన్ (ని) నితరామ్ (సీద) తిష్ఠ (మయుమ్)శస్యాదిహింసకం పశుమ్(తే)తవ (శుక్) శోకః భావే క్విప్ (ఋచ్ఛతు) ప్రాప్నోతు (యమ్) శత్రుమ్ (ద్విష్మః) అప్రీతయామః (తమ్) (తే) తవ సకాశాత్ (శుక్) శోకః (ఋచ్ఛతు) ॥౪౭॥ అన్వయః :-హే అగ్నే ! పావక ఇవ మనుష్య ! మేధాయ చీయమానః సహస్రాక్షస్త్వమిమం ద్విపాదం మేధం మయుం పశుం చ మా హింసీః తం పశుం జుషస్వ తేన చిన్వానః సన్ తన్వో మధ్యే నిషీద. ఇయం తే శుఙ్మయు మృచ్ఛతు. తే తవ యం శత్రుం వయం ద్విష్మస్తం శుగృచ్ఛతు, ॥౪౭॥ భావార్థః :-కేనాపి మనుష్యే ణోపకారకాః పశవః కదాచిన్న హింసనీయాః కిన్త్వేతాన్ సంపాల్యైతేభ్య ఉపకారం సంగృహ్యా సర్వే మనుష్యా ఆనన్దయితవ్యా యై ర్జాంగలై ర్హింసకైః పశుశస్య మనుష్యాణాం హానిః స్యాత్తే తు రాజపురుషై ర్హన్తవ్యా నిగ్రహీతవ్యాశ్చ. ॥౪౭॥

పదార్థము :- అగ్నే = అగ్నివలెనుండు మానవుడా! [మానవజన్మము నొందినవాడా] మేధాయ = సుఖప్రాప్తికై, చీయమానః = ముందడుగు వేసినవాడవు, సహస్రాక్షః = వేల విధముల దృష్టిగల వాడవు నగు నీవు, ఇమమ్ ద్విపాదమ్ = ఈ రెండుపాదములుగల మనుష్యులను. మేధమ్ = పవిత్రకారకమగు, మయుమ్ = సస్యములను, పశుమ్ = గవాది పశువులను జీవములను, మా = హింసింపకుము. పశుమ్ = ఆ పశువును, జుషస్వ = సేవించుము. తేన = ఆ పశువుచే, చిన్వానః = అభివృద్ధియగుచున్నవాడవై, తన్వః = శరీరమునందు. నిషీద = నిరంతరము స్థిరుడవు గమ్ము. తే శుక్ = నీ యీ శోకము, మయుమ్ = సస్యనాశకమగు వన్యపశువును, ఋచ్ఛతు = చేరునుగాక ! తే యమ్ = నీయొక్క యే శత్రువును మేము,ద్విష్మః = ద్వేషించెదమో, తమ్ = అతనికి, శుక్ = శోకము, ఋచ్ఛతు = లభించునుగాక ! ॥౪౭॥

భావార్థము :-ఏమానవుడు సర్వోపకారకములగు పశువుల నెన్నటికి హింసింప రాదు. మఱేమనిన వానిని బాగుగ రక్షించవలయును.వానిచే నుపకారమును పొంది యందఱిని ఆనందపఱచ వలయును, ఏ వన్యమృగములచే గ్రామ్యపశువులకు, వ్యవసాయమునకు, మానవులకు హానికల గునో వానిని రాజపురుషులు చంపవలయును, బంధించవలయును. ॥౪౭॥ (౮౨౭)

౮౭౮ ఇమం మేత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, నిచృద్బ్రాహ్మీ పఙ్క్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః. పున రయం మనుష్యః కిం కుర్యా దిత్యాహ. ఆ మనుష్యుడేమి చేయవలెను !

ఇమం మా హిꣳసీ రేకశఫం పశుం కనిక్రదం వాజినం వాజినేషు ।
గౌర మారణ్య మను తే దిశామి తేన చిన్వానస్తన్వో ని షీద ।
గౌరం తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥ ౪౮॥

ఇమమ్, మా, హిꣳసీః, ఏకశఫమిత్యేక+శఫమ్, పశుమ్, కనిక్రదమ్, వాజినమ్, వాజినేషు,గౌరమ్, ఆరణ్యమ్, అను, తే, దిశామి, తేన, చిన్వానః, తన్వః, ని, సీద,

గౌరమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు. [48]

పదార్థః :—(ఇయమ్)(మా)(హింసీః)హింస్యాః (ఏకశఫమ్)ఏకఖురం పశ్వాదికమ్(పశుమ్) ద్రష్టవ్యమ్ (కనిక్రదమ్)భృశం వికలం ప్రాప్తవ్యథమ్ (వాజినమ్) వేగవన్తమ్ (వాజినేషు) వాజినానాం సంగ్రామాణా మవయవేషు కర్మసు కార్యసిద్ధికరమ్(గౌరమ్)గౌరవర్ణమ్(ఆరణ్యమ్) అరణ్యే భవమ్ (అను)(తే)తుభ్యమ్(దిశామి)ఉపదిశామి(తేన)(చిన్వానః)వర్ధమానః(తన్వః) శరీరస్య మధ్యే (ని)(సీద)(గౌరమ్)(తే) ఇత్యాది పూర్వవత్. ॥౪౮॥ అన్వయః :—హే మనుష్య ! త్వం వాజినేష్విమ మేకశఫం కనిక్రదం వాజినం పశుం మా హింసీః ఈశ్వరోఽహం తే తుభ్యం యమారణ్యం గౌరం పశు మనుదిశామి తేన చిన్వానః సꣳస్తన్వో మధ్యే నిషీద, తే తవ సకాశాద్ గౌరం శుగృచ్ఛతు యం వయం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు, ॥౪౮॥ భావార్థః :—మనుష్యై రేకశఫా అశ్వాదయః పశవః కదాచిన్నో హింస్యాః. న చోపకారకా ఆరణ్యాః యేషాం హననేన జగతో హానీ రక్షణే నోపకారశ్చ భవతి తే సదైవ పాలనీయా హింస్రాశ్చ హన్తవ్యాః. ॥౪౮॥

పదార్థము:—రాజా ! నీవు, వాజినేషు = సంగ్రామకార్యములందు, ఇమమ్ ఏకశఫమ్ = ఒంటి డెక్కగలదియు, కనిక్రదమ్ = వెతనొంది బాగుగ వికలమైనదియు. వాజినమ్ పశుమ్ = చూడదగినది, వేగవంతమునగు నశ్వాది పశుజాతిని, మా హింసీః = హింసించకుము. ఈశ్వరు డనైన నేను, తే = నీకొఱకు, యమ్ ఆరణ్యమ్ = ఏ ఆరణ్యకమైన, గౌరమ్ = గౌరపశువును, దిశామి = శిక్షగఱపుచున్నానో, తేన = తద్రక్షణచే,చిన్వానః = వృద్ధిని పొందుచున్నవాడవై ,తన్వః = శరీరమునందు, నిషీద = నిరంతరము స్థిరుడవగుము,తే = నీయొక్క, శుక్ = శోకము, గౌరమ్ ఋచ్ఛతు = తెల్లని రంగుగల పశువునకు లభించునుగాక మఱియు, యమ్ = ఏశత్రువును మేము, ద్విష్మః = ద్వేషించెదమో, తమ్ = అతనికి, తే = నీనుండి, శుక్ = శోకము, ఋచ్ఛతు = లభించునుగాక. ॥౪౮॥

భావార్థము :- మానవులు ఒంటిడెక్కగలిగిన అశ్వాదిపశువులను, ఉపకారకములగు వన్యపశువులనెన్నటికి హింసించగూడదు, వేనిని చంపుటచే లోకమునకు హాని, వేనిని చంపకుండుటచే లోకోపకారము జరుగునో వానిని నిరతము పోషించవలయును, హానికారక పశువులను చంపవలయును.

౪౯ ఇమం సాహస్రె మిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, కృతి శ్ఛన్దః, నిషాదః స్వరః.

పున ర్మనుష్యైః కే పశవో నోఽహింసనీయా హింసనీయాశ్చేత్యాహ.

మానవు లే పశువులను చంపగూడదు ? వేనిని చంపవచ్చును ?

ఇమꣳసాహస్రꣳ శతధార ముత్సం వ్యచ్యమానꣳ సరిరస్య మధ్యే ।
ఘృతం దుహానా మదితిం జనాయాగ్నే మా హిꣳసీః పరమే వ్యోమన్ ।
గవయ మారణ్య మనుతే దిశామి తేన చిన్వాన స్తన్వో నిషీద
గవయ న్తే శుగృచ్ఛతు యం ద్విష్మ స్తం తే శుగృచ్ఛతు. ॥౪౯॥

ఇమమ్, సాహస్రమ్, శతధారమితి శత+ధారమ్, ఉత్సమ్, వ్యచ్యమానమితి వి+అచ్యమానమ్, సరిరస్య, మధ్యే, ఘృతమ్, దుహానామ్, అదితిమ్,

జనాయ, అగ్నే, మా, హింసీః, పరమే, వ్యోమన్నితి వి + ఓమన్, గవయమ్, ఆరణ్యమ్ అను, తే, దిశామి, తేన, చిన్వానః, తన్వః, ని, సీద, గవయమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే శుక్, ఋచ్ఛతు.

పదార్థః :—(ఇమమ్)(సాహస్రమ్)సహస్రస్యాసంఖ్యాతానాం సుఖానామయం సాధకస్తమ్ (శతధారమ్) శతమసంఖ్యాతా దుగ్ధధారా యస్మాత్తమ్ (ఉత్సమ్)కూపమివ పాలకం గవాదికమ్ (వ్యచ్యమానమ్) వివిధప్రకారేణ పాలనీయమ్ (సరిరస్య) అన్తరిక్షస్య (మధ్యే)(ఘృతమ్) ఆజ్యమ్ (దుహానామ్) ప్రపూరయన్తీమ్ (అదితిమ్)అఖండనీయాం గామ్ (జనాయ)మనుష్యాద్యాయ ప్రాణినే (అగ్నే) వివేకప్రాప్తోపకారప్రకాశక రాజన్ (మా) హింసీః (పరమే) ప్రకృష్టే (వ్యోమన్) వ్యోమ్ని వ్యాప్తేఽన్తరిక్షే వర్తమానామ్ (గవయమ్)గోసదృశమ్(ఆరణ్యమ్) (అను)(తే) (దిశామి) (తేన) (చిన్వానః) పుష్టః సన్ (తన్వః)(ని)(సీద) (గవయమ్) (తే) (శుక్) శోకః (ఋచ్ఛతు) (యమ్)(ద్విష్మః)తమ్ (తే) (శుక్)(ఋచ్ఛతు) ॥౪౯॥ అన్వయః :—హే అగ్నే! త్వం జనాయేమం సాహస్రం శతధారం వ్యచ్యమాన ముత్సమివ వీర్యసేచకం వృషభం ఘృతం దుహానా మదితిం ధేనుం చ మా హింసీః స్తే తుభ్య మపర మారణ్యం గవయ మనుదిశామి తేన పరమే వ్యోమన్ సరిరస్య మధ్యే చిన్వానః సన్తన్వో నిషీద, తం గవయం తే శుగృచ్ఛతు యన్తే శత్రుం వయం ద్విష్మస్తమతి శుగృచ్ఛతు శోకః ప్రాప్నోతు. ॥౪౯॥ భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. రాజమనుష్యా యేభ్యో వృషాదిభ్యః కృష్యాదీని కర్మాణి భవన్తి. యాభ్యో గవాదిభ్యో దుగ్ధాదిపదార్థా జాయన్తే యైః సర్వేషాం రక్షణం భవతి తే కదాచిన్నైవ హింసనీయాః. య ఏతాన్ హింస్యు స్తేభ్యో రాజాదిన్యాయేశా అతిదణ్డం దద్యు ర్యే చ జాఙ్గలా గవయాదయో ప్రజాహానిం కుర్యు స్తే హన్తవ్యాః. ॥౪౯॥

పదార్థము:—అగ్నే = దయ[వివేకము]నుపొందిన పరోపకారీ రాజా! నీవు,జనాయ = మనుష్యాది ప్రాణులకై, ఇమమ్ = ఈ, సాహస్రమ్ = అనంత సుఖములకు సాధనము, శతధారమ్ = అనంత దుగ్ధధారలకు నిమిత్తము, వ్యచ్యమానమ్ = ఎన్నియో విధముల పాలించదగినది. ఉత్సమ్ = బావి వలె రక్షించునదియు నగు వీర్యసేచక వృషభమును, ఘృతమ్దుహానామ్ = నేతిని పూరించునదియు అదితిమ్ = చంపదగనిదియు నగు నావును, మా హింసీః = హింసించకుము. మఱియు,తే = నీరాజ్యమందు, ఆరణ్యమ్ గవయమ్ = ఆవుమాదిరిగ నుండు పొలములను పాడుచేయు నే పన్యగవయ మున్నదో దానిని, అనుదిశామి = ఉపదేశించుచున్నాను. తేన = దానిని చంపుటవలన సురక్షితమైనట్టి యన్నముచే, పరమే వ్యోమన్ = ఉత్కృష్టుడు సర్వవ్యాపకుడు నగు పరమాత్మయందు, సరిరస్య మధ్యే = విస్తృతము వ్యాపకమునగు నాకాశమధ్యమున, చిన్వానః = శుద్ధినిపొందిన నీవు, తన్వః = శరీరము మధ్య, నిషీద = నివసించుము. తే శుక్ = నీశోకము, తమ్ గవయమ్ ఋచ్ఛతు = ఆగవయము (గురుపోతు)ను చెందునుగాక! యమ్ తే = నీయొక్క యే శత్రువును, ద్విష్మః = మేముద్వేషించెదమో అతనికికూడ, శుక్ ఋచ్ఛతు = శోకము ప్రాప్తించునుగాక? ॥౪౯॥

భావార్థము :—ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకార మున్నది. రాజపురుషులారా ! ఏ యెడ్లు మొదలైనవానిచే వృష్యాదికర్మలు జరుగుచున్నవో, ఏ గవాదులచే దుగ్ధఘృతాద్యుత్తమ పదార్థములు లభించుచున్నవో, వేనిచే సకలజంతువుల రక్షణము జరుగుచున్నదో అవి యెన్నటికి హిం

సించదగినవి కావు. ఎవ రీ యుపకారజంతువులను చంపుదురో వారిని రాజు న్యాయాధీశుడు బాగుగా దండించవలయును. ప్రజలకు హానికలిగించు వన్యగవయాది మృగము లేవి యున్నవో వానిని వధించ వచ్చును. ॥౪౯॥ (౮౫౯)

---

౮౬౦ ఇమ మూర్ణాయు మిత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, కృతి శ్ఛన్దః నిషాదః స్వరః.
పునః కే పశవో న హింస్యా హింస్యాశ్చేత్యాహ. ఏ పశువులు హింస్యములేవి యహింస్యములు?

ఇమమూర్ణాయుం వరుణస్య నాభిం త్వచం పశూనాం ద్విపదాం చతుష్పదామ్ ।
త్వష్టుః ప్రజానాం ప్రథమం జనిత్రమగ్నే మా హిꣳసీః పరమే వ్యోమన్ ।
ఉష్ట్రమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తన్వో నిషీద ।
ఉష్ట్రం తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥ ॥౫౦॥

ఇమమ్, ఊర్ణాయుమ్, వరుణస్య, నాభిమ్, త్వచమ్, పశూనామ్, ద్విపదామితి ద్వి + పదామ్, చతుష్పదామ్, చతుఃపదామితి చతుః + పదామ్, త్వష్టుః, ప్రజానామితి ప్ర + జానామ్, ప్రథమమ్, జనిత్రమ్, అగ్నే, మా, హిꣳసీః, పరమే, వ్యోమన్నితి వి+ఓమన్, ఉష్ట్రమ్, ఆరణ్యమ్, అను, తే, దిశామి, తేన, చిన్వానః, తన్వః, ని, సీద, ఉష్ట్రమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు. [50]

పదార్థః :–(ఇమమ్)(ఊర్ణాయుమ్)అవిమ్(వరుణస్య)వరస్య ప్రాప్తవ్యస్య సుఖస్య(నాభిమ్) నిబన్ధనమ్ (త్వచమ్)(పశూనామ్)(ద్విపదామ్)(చతుష్పదామ్)త్వష్టుః)సుఖప్రకాశకస్య(ప్రజానామ్) (ప్రథమమ్) ఆదిమమ్ (జనిత్రమ్)ఉత్పత్తినిమిత్తమ్ (అగ్నే)(మా)(హింసీః) హింస్యాః(పరమే) (వ్యోమన్) (ఉష్ట్రమ్)(ఆరణ్యమ్) అరణ్యే భవమ్(అను)(తే)(దిశామి) (తేన)(చిన్వానః)(తన్వః) (ని) (సీద) (ఉష్ట్రమ్) ఇత్యాది పూర్వవత్. ॥౫౦॥ అన్వయః :–హే అగ్నే ! ప్రాప్తవిద్య రాజంస్త్వమిమం వరుణస్య నాభిం ద్విపదాం చతుష్పదాం పశూనాం త్వచం త్వష్టుః ప్రజానాం ప్రథమం జనిత్రం పరమే వ్యోమ న్వర్తమాన మూర్ణాయుం మా హింసీః. తే యం ధాన్యహింసకమా రణ్య ముష్ట్రం హన్తు మనుదిశామి తేన చిన్వానః సన్ తన్వో మధ్యే నిషీద. తే శుగారణ్య ముష్ట్రమృచ్ఛతు యం తే ద్వేష్టారం వయం ద్విష్మస్తం శుగృచ్ఛతు. ॥౫౦॥ భావార్థః :–హే రాజన్! యేషా మవ్యాదీనాం లోమాని త్వగపి మనుష్యాణాం సుఖాయ ప్రభవతి య ఉష్ట్రో భారం వహన్తో మనుష్యాన్ సుఖయన్తి తాన్ యే హన్తుమిచ్ఛేయుస్తే జగత్పీడకా విజ్ఞేయాః సమ్యగ్ దణ్డనీయాశ్చ. యే చారణ్యా ఉష్ట్రా హానికరాస్తేఽపి దణ్డనీయాః. ॥౫౦॥

పదార్థము :– అగ్నే = విద్యను బొందినరాజా ! నీవు, వరుణస్య = పొందదగిన శ్రేష్ఠసుఖమును, నాభిమ్ = సంయోగమొనర్చునదియగు, ద్విపదామ్ = రెండుకాళ్లుగలిగిన మనుష్యులను పక్షులను, చతుష్పదామ్ = నాలుగుకాళ్లుగలిగిన, పశూనామ్ = పశువులయు. త్వచమ్ = తోలుతోగప్పునదియు; త్వష్టుం ప్రజానామ్ = సుఖప్రకాశకుడగు నీశ్వరుని ప్రజలకు, ప్రథమమ్ జనిత్రమ్ =

మొదటి ఉత్పత్తినిమిత్తమును, పరమే వ్యోమన్ = ఉత్తమాకాశమునందు విహరించునదియునగు, ఇమమ్ ఊర్ణాయుమ్ = ఈ గొఱ్ఱెమొదలైనవానిని, మా హింసీః = చంపకుము. తే = నీకై యీశ్వరుడనైన నేను, యమ్ ఆరణ్యమ్ ఉష్ట్రమ్ అనుదిశామి = [ధాన్యహింసకమగు]నే యడవియొంటెను [చంపుటకు] చెప్పుచున్నానో, తేన = దానిని[చంపుటచే] సురక్షించబడిన అన్నాదులతో, చిన్వానః = వృద్ధినొందుచు, తన్వః = శరీరమునందు,నిషీద = నివసించుము. తే శుక్ = నీశోకము ఆ వన్యోష్ట్రమును, ఋచ్ఛతు = పొందునుగాక ! ఏద్వేషులపట్ల, ద్విష్మః = అప్రీతిగ మేము సంచరించెదమో . తమ్ = అతనికి, తే శుక్ ఋచ్ఛతు = నీశోకము చెందును గాక ! ॥౫౦॥

భావార్థము :—రాజా ! గొఱ్ఱెమొదలగు నే ప్రాణుల చర్మము (ఉన్నియు) మానవులకు సుఖమును కల్పించగలవో, బరువులను మోయుచు నే యొంటెలు మానవులకు సుఖము నిచ్చుచున్నవో వాని నే దుష్టులు సంహరింపదలచుదురో వారిని జగత్తునకు పీడగలిగించువారని భావించవలయును. అట్టివారిని బాగుగ దండించవలయును. [హానికరములగు నే యడవియొంటెలున్నవో వానిని బాగుగా దండించవలయును.] ॥౫౦॥ (౮౭౦)

---

౮౭౧ అజ ఇత్యస్య విరూప ఋషిః, అగ్నిర్ దేవతా, భురిక్కృతి శ్ఛన్దః, నిషాదః స్వరః.
పునర్మనుష్యైః కే పశవో న హన్తవ్యా కే చ హన్తవ్యా ఇత్యాహ.
మానవులే పశువులను సంహరించకూడదు ? వేనిని సంహరించవలెను ?

అజో హ్యగ్నే రజనిష్ట శోకాత్సో అపశ్యజ్జనితారమగ్రే ।
తేన దేవా దేవతామగ్రమాయంస్తేన రోహమాయన్నుప మేధ్యాసః ।
శరభమారణ్యమను తే దిశామి తేన చిన్వానస్తన్వో నిషీద ।
శరభం తే శుగృచ్ఛతు యం ద్విష్మస్తం తే శుగృచ్ఛతు ॥ ॥౫౧॥

అజః, హి, అగ్నేః, అజనిష్ట, శోకాత్, సః, అపశ్యత్, జనితారమ్, అగ్రే, తేన, దేవాః, దేవతామ్, అగ్రమ్, ఆయన్, తేన, రోహమ్, ఆయన్, ఉప, మేధ్యాసః, శరభమ్, ఆరణ్యమ్, అను, తే, దిశామి తేన,చిన్వానః,తన్వః, ని, సీద,శరభమ్, తే, శుక్, ఋచ్ఛతు, యమ్, ద్విష్మః, తమ్, తే, శుక్, ఋచ్ఛతు. [51]

పదార్థః :—(అజః)ఛాగః(హి)ఖలు (అగ్నేః) పావకాత్(అజనిష్ట) జాయతే (శోకాత్)(సః) (అపశ్యత్)పశ్యతి (జనితారమ్) ఉత్పాదకమ్ (అగ్రే) (తేన) (దేవాః)విద్వాంసః(దేవతామ్)దివ్యగుణతామ్ (అగ్రమ్)ఉత్తమం సుఖమ్ (ఆయన్) యన్తి ప్రాప్నువన్తి (తేన)(రోహమ్) ప్రాదుర్భావమ్ (ఆయన్) ప్రాప్నువన్తు(ఉప)(మేధ్యాసః) పవిత్రాః సన్తః (శరభమ్) శల్యకమ్(ఆరణ్యమ్)జంగలోత్పన్నమ్(అను)(తే)(దిశామి)(తేన)(చిన్వానః) అగ్రే పూర్వవత్. ॥౫౧॥ అన్వయః :— హే రాజంస్త్వం యో హ్యజో ఽజనిష్ట సోఽగ్రే జనితార మపశ్యత్. యేన మేధ్యాసో దేవా అగ్రం దేవతాం సుఖ ముపాయన్ యేన రోహ ముపాయన్ తేనోత్తమ గుణతా మగ్రం సుఖం తేన వృద్ధిం చ ప్రాప్నుహి యమారణ్యం శరభం తేఽనుదిశామి తేన చిన్వానః సంస్తన్వో నిషీద తం తే శుగృ

చ్ఛతు యం తే తవారిం వయం ద్విష్మస్తం శోకాదగ్నేః శుగృచ్ఛతు. ॥౪౧॥ భావార్థః:-రాజజనైః రజాదీనహత్వా సంరక్ష్యైతే ఉపకారాయ సంయోజనీయాః. యే శుభ పశుపక్షిహింసకా భవేయుస్తే భృశం తాడనీయాః. యది శల్యకీ హానికారికా స్యాత్తర్హి సా ప్రజాపాలనాయ హన్తవ్యా.

పదార్థము.—రాజన్ = రాజా ! నీవు. హి = నిశ్చయముగ, అజః అజనిష్ట = ఏ మేకపోతు పుట్టుచున్నదో, సః = అది. అగ్రే = ప్రథమముగ, జనితారమ్ = ఉత్పాదకుని, అపశ్యత్ = చూచుచున్నది, దేనిచే, మేధ్యాసః దేవాః = పవిత్రులైన విద్వాంసులు, అగ్రమ్ = ఉత్తమసుఖమును మఱియు, దేవతామ్ = దివ్యగుణములను, ఉపాయన్ = తేలికగా పొందుచున్నారో, దేనిచే, రోహమ్ = వృద్ధియుక్త ప్రసిద్ధిని, ఆయన్ = పొందుచున్నారో, తేన = దానితో ఉత్తమగుణములను ఉత్తమసుఖములను మఱియు, తేన = దానితో వృద్ధిని పొందుము. ఆరణ్యమ్ శరభమ్ = ఏ అడవిముల్లపంది, తే = నీ ప్రజకు హానికలిగించుచున్నదో దానిని, అనుదిశామి = చెప్పుచున్నాను. తేన = దానినుండి రక్షించబడిన పదార్థములతో, చిన్వానః = వృద్ధినొందుచు, తన్వః = శరీరమునందు, నిషీద = నివసించుము. మఱియు. అదః శరమ్ = ఆ శల్యకమునకు, తే శుక్ ఋచ్ఛతు = నీశోకము చేకూరునుగాక! తే యమ్ ద్విష్మః = నీ యే శత్రువును మేము ద్వేషించుచుమో దానికి, శోకాత్ అగ్నేః = శోకాగ్నికంటె మించిన, శుక్ = మహాశోకము, ఋచ్ఛతు = కలుగుగాక ! ॥౫౧॥

భావార్థము :-రాజపురుషులు మానవులు మేకలను [నెమళ్లుమొదలగు శ్రేష్ఠపక్షులను] హింసించగూడదు, వానిని రక్షించి యుపకారమునందు సంయోగపఱచవలయును, మంచి పశువులను మంచి పక్షులను చంపువారిని బాగుగ దండించవలయును. పొలములను పాడుచేయు ముళ్లపంది మొదలగునవేవి యున్నవో వానిని ప్రజారక్షణార్థమై హింసించవలయును. ॥౫౧॥

---

ఉ౫౨ త్వం యవిష్ఠేత్యస్యోశనా ఋషిః, అగ్నిర్దేవతా, నిచృద్గాయత్రీ ఛన్దః, షడ్జః స్వరః

పునః కీదృశా రక్ష్యా హింసనీయాశ్చేత్యాహ.

ఎటువంటి పశువులు రక్షణీయములు? ఎటువంటివి హంతవ్యములు ?

త్వం యవిష్ఠ దాశుషో నౄఁః పాహి శృణుధీ గిరః । రక్షా తోకముత త్మనా ॥

త్వమ్, యవిష్ఠ, దాశుషః, నౄన్, పాహి, శృణుధి, గిరః, రక్ష, తోకమ్, ఉత, త్మనా.

పదార్థః :-(త్వమ్)(యవిష్ఠ) అతిశయేన యువన్(దాశుషః)సుఖదాతౄన్(నౄన్) ధర్మనేతౄన్ మనుష్యాన్. అత్ర నౄన్ పే ఇతి రురాదేశః పూర్వస్యానునాసికత్వం చ (పాహి) (శృణుధి) అత్ర హేర్ధ్యాదేశోఽన్యేషామపీతి దీర్ఘః(గిరః)సత్యా వాచః. అత్ర ద్వ్యచోఽతస్తిఙ ఇతి దీర్ఘః (తోకమ్)అపత్యమ్ (ఉత) అపి (త్మనా)ఆత్మనా. ॥౫౨॥ అన్వయః :—హే యవిష్ఠ ! త్వం సంరక్షితైరేతైః పశుభిర్దాశుషో నౄన్పాహి. ఇమా గిరః శృణుధి త్మనా మనుష్యాణాముత పశూనాం తోకం రక్ష. ॥౫౨॥ భావార్థః :-యే మనుష్యా మనుష్యాదిరక్షకాన్ పశూన్ వర్ధయన్తే కరుణామయా నుపదేశాన్ శృణ్వన్తి శ్రావయన్తి త ఆత్మజం సుఖం లభన్తే. ॥౫౨॥

పదార్థము:— యవిష్ఠ = మంచి పడుచువాడా! త్వమ్ = నీవు సురక్షితములైన యీ పశువుల ద్వారా, దాశుషః = సుఖమునొసగువారును, నౄన్ = ధర్మరక్షకులునగు మనుష్యులను. పాహి = రక్షించుము. గిరః = ఈసత్యవాణులను, శృణుధి = వినుము, త్మనా = నీయాత్మతో మనుష్యపశువులను, ఉత్ = మఱియు పశువులయొక్క, తోకమ్ = శిశువులను, రక్ష = రక్షించుము. ॥౫౨॥

భావార్థము :-ఏ మానవులు మనుష్యాదులను రక్షించు పశువులను పెంపొందజేయు చున్నారో, కరుణామయములగు నుపదేశములను వినుచున్నారో, వినుపించుచున్నారో వారు ఆంతరికాత్మికసుఖమును పొందుచున్నారు. ॥౫౨॥ (౬౫౨)

౬౫౩ అపాం త్వేమ న్నిత్యస్యోశనా ఋషిః ఆపో దేవతాః, పూర్వస్య బ్రాహ్మీ పంక్తి శ్ఛందః, పఞ్చమః స్వరః.
సరిరేత్వేతి మధ్యస్య బ్రాహ్మీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.
గాయత్రేణేత్యుత్తరస్య నిచృద్బ్రాహ్మీ పఙ్క్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

అథాధ్యేతృ జనా నధ్యాపకాః కి ముపదిశేయు రిత్యాహ. అధ్యేతలకు అధ్యాపకులేమి ఉపదేశించవలెను?

అపాం త్వేమన్త్సాదయామ్యపాం త్వోద్మన్త్సాదయామ్యపాన్త్వా భస్మన్త్సాదయామ్యపాం త్వా జ్యోతిషి సాదయామ్యపాం త్వాయనే సాదయామ్యర్ణవే త్వా సదనే సాదయామి సముద్రే త్వా సదనే సాదయామి ।
సరిరే త్వా సదనే సాదయామ్యపాం త్వా క్షయే సాదయామ్యపాం త్వా సధిషి సాదయామ్యపాం త్వా సదనే సాదయామ్యపాం త్వా సధస్థే సాదయామ్యపాం త్వా యోనౌ సాదయామ్యపాం త్వా పురీషే సాదయామ్యపాం త్వా పాథసి సాదయామి గాయత్రేణ త్వా ఛన్దసా సాదయామి త్రైష్టుభేన త్వా ఛన్దసా సాదయామి జాగతేన త్వా ఛన్దసా సాదయామ్యానుష్టుభేన త్వా ఛన్దసా సాదయామి పాఙ్క్తేన త్వా ఛన్దసా సాదయామి ॥ ॥౫౩॥

అపామ్, త్వా, ఏమన్, సాదయామి, అపామ్, త్వా, ఓద్మన్, సాదయామి, అపామ్, త్వా, భస్మన్, సాదయామి, అపామ్, త్వా, జ్యోతిషి, సాదయామి, అపామ్, త్వా, అయనే, సాదయామి, అర్ణవే, త్వా, సదనే, సాదయామి,సముద్రే, త్వా, సదనే, సాదయామి, సరిరే, త్వా, సదనే,సాదయామి,అపామ్, త్వా, క్షయే, సాదయామి, అపామ్, త్వా, సధిషి, సాదయామి, అపామ్, త్వా, సదనే, సాదయామి, అపామ్, త్వా, సధస్థ ఇతి సధ+స్థే, సాదయామి, అపామ్, త్వా, యోనౌ, సాదయామి, అపామ్, త్వా, పురీషే, సాదయామి, అపామ్, త్వా, పాథసి, సాదయామి, గాయత్రేణ, త్వా, ఛన్దసా, సాదయామి, త్రైష్టుభేన, త్రైష్టుభేనేతి త్రై౭స్తుభేన, త్వా, ఛన్దసా, సాదయామి, జాగతేన, త్వా, ఛన్దసా,

సాదయామి, అనుష్టుభేన, ఆనుష్టుభేనేత్యాను+స్తుభేన, త్వా, ఛన్దసా, సాద
యామి, పాఙ్క్తేన, త్వా, ఛన్దసా, సాదయామి. [53]

పదార్థః :-(అపామ్)ప్రాణానాం రక్షణే(త్వా)త్వామ్(ఏమన్)ఏతి గచ్ఛతి తస్మిన్ వాయౌ (సాదయామి)స్థాపయామి(అపామ్)జలానామ్(త్వా)(ఓద్మన్)ఓషధిషు (సాదయామి)(అపామ్) ప్రాప్తానాం కాష్ఠాదీనామ్(త్వా)(భస్మన్)భస్మన్యగ్నే. అత్ర సర్వత్ర సప్తమీలుక్(సాదయామి) (అపామ్) వ్యాప్నువతాం విద్యుదాదీనామ్ (త్వా)(జ్యోతిషి) విద్యుతి (సాదయామి)(అపామ్)అంతరిక్షస్య (త్వా) (అయనే)భూమౌ(సాదయామి)(అర్ణవే)ప్రాణే (త్వా)(సదనే) స్థాతవ్యే (సాదయామి) (సముద్రే) మనసి (త్వా)(సదనే)గన్తవ్యే (సాదయామి) సరిరే వాచి (త్వా)(సదనే) ప్రాప్తవ్యే (సాదయామి) (అపామ్) ప్రాప్తవ్యానాం పదార్థానామ్ (త్వా)(క్షయే) చక్షుషి (సాదయామి)(అపామ్)(త్వా)(సధిషి) సమానాన్ శబ్దాన్ శృణోతి యేన తస్మిన్ శ్రోత్రే (సాదయామి)(అపామ్)(త్వా)(సదనే)దివి (సాదయామి) (అపామ్)(త్వా)(సధస్థే)అన్తరిక్షే(సాదయామి)(అపామ్) (త్వా) (యోనౌ)సముద్రే (సాదయామి)(అపామ్)(త్వా)(పురీషే)సికతాసు (సాదయామి) (అపామ్) (త్వా) (పాథసి) అన్నే (సాదయామి) (గాయత్రేణ) గాయత్రీనిర్మితేన (త్వా) (ఛన్దసా) స్వచ్ఛేనార్థేన (సాదయామి) (త్రైష్టుభేన) త్రిష్టుప్ప్రోక్తేన (త్వా) (ఛన్దసా) (సాదయామి) (జాగతేన) జగత్యుక్తేన (త్వా) (ఛన్దసా) (సాదయామి) (ఆనుష్టుభేన)అనుష్టుప్కథితేన (త్వా) (ఛన్దసా) (సాదయామి)(పాంక్తేన) పంక్తిప్రకాశితేన (త్వా) (ఛన్దసా)(సాదయామి)సంస్థాపయామి. ॥౫౩॥ అన్వయః :—హే మనుష్య! యథా శిక్షకోఽహమపామేమంస్త్వా సాదయామ్యపామోద్మంస్త్వా సాదయామ్యపాం భస్మంస్త్వా సాదయామ్యపాం జ్యోతిషి త్వా సాదయామ్యపామయనే త్వా సాదయామ్యర్ణవే సదనే త్వా సాదయామి సముద్రే సదనే త్వా సాదయామి సరిరే సదనే త్వా సాదయామ్యపాం క్షయే త్వా సాదయామ్యపాం సధిషి త్వా సాదయామ్యపాం సదనే త్వా సాదయామ్యపాం సధస్థే త్వా సాదయామ్యపాం యోనౌ త్వా సాదయామ్యపాం పురీషే త్వా సాదయామ్యపాం పాథసి త్వా సాదయామి గాయత్రేణ ఛన్దసా త్వా సాదయామి త్రైష్టుభేన ఛన్దసా త్వా సాదయామి జాగతేన ఛన్దసా త్వా సాదయామ్యానుష్టుభేన ఛన్దసా త్వా సాదయామి పాంక్తేన ఛన్దసా త్వా సాదయామి తథైవ వర్తస్వ. ॥౫౩॥ భావార్థః : విద్వద్భిః సర్వాన్ పురుషాంస్త్రియశ్చ వేదానధ్యాప్య జగత్స్థానాం వాయ్వాదిపదార్థానాం విద్యాసు నిపుణీకృత్య తేభ్యః ప్రయోజనసాధనే ప్రవర్తనీయాః. ॥౫౩॥

పదార్థము :-మానవుడా ! ఎటుల శిక్షకుడనైన నేను, అపామ్ = ప్రాణముల రక్షణనిమిత్తము, ఏమన్ = గమనశీలవాయువునందు, త్వా = నిన్ను, సాదయామి = స్థాపించుచున్నానో, అపామ్ = జలములయొక్క, ఓద్మన్ = ఆర్ద్రతాయుక్తౌషధులందు, త్వా సాదయామి = నిన్నుస్థాపించుచున్నానో, అపామ్ = లభించిన కాష్ఠాదుల, భస్మన్ = భస్మమునందు, త్వా సాదయామి = నిన్ను సంయుక్తపఱచుచున్నానో, అపామ్ = వ్యాప్తమైన విద్యుదగ్నియొక్క, జ్యోతిషి = ప్రకాశమునందు, త్వా సాదయామి = నిన్ను నియుక్తమొనర్చుచున్నానో, అపామ్ = అవకాశముగల, అయనే = స్థానమునందు, త్వా = నిన్ను, సాదయామి = కూర్చొనబెట్టుచున్నానో, సదనే = స్థితికియోగ్యమగు, అర్ణవే = ప్రాణవిద్యయందు, త్వా సాదయామి = నిన్ను సంయుక్తపరచుచున్నానో, సదనే = గమనశీలమగు,సముద్రే = మనస్సుయొక్క విషయమున,త్వా సాదయామి = నిన్ను సంబద్ధమొనర్చుచున్నానో,

సదనే = ప్రాప్తయోగ్యమగు, సరిరే = వాణీవిషయమునందు. త్వా సాదయామి = నిన్ను సంయుక్తమొనర్చుచున్నానో, అపామ్ = పొందదగిన పదార్థములకు సంబంధించిన, క్షయే = ఇంటియందు, త్వా సాదయామి = నిన్ను స్థాపించుచున్నానో, అపామ్ = అనేకవిధముల వ్యాప్తమైన శబ్దములసంబంధమైన, సధిషి = జీవపనేక శబ్దములను ఒకేసారివినుటకు సాధనమైన కర్ణముల విషయమునందు, త్వా సాదయామి = నిన్ను స్థితమొనర్చుచున్నానో. అపామ్ = జలముయొక్క, సదనే = అంతరిక్షరూపస్థానము నందు, త్వా సాదయామి = స్థాపించుచున్నానో. అపామ్ సధస్థే = జలముల తుల్యస్థానమునందు, త్వా సాదయామి = నిన్ను స్థాపించుచున్నానో, అపామ్ యోనౌ = జలముల సముద్రమునందు. త్వా సాదయామి = నిన్ను నియుక్తమొనర్చుచున్నానో. అపామ్ పురీషే = జలముల ఇసుకయందు. త్వా సాదయామి = నిన్ను నియమించుచున్నానో అపాం పాథసి = నీటియన్నములో, త్వాసాదయామి = నిన్ను ప్రేరేపించుచున్నానో.గాయత్రేణ ఛందసా = గాయత్రీ ఛందస్సునుండి వెడలినస్వఛంత్రార్థముతో. త్వా సాదయామి = నిన్ను నియుక్తపఱచుచున్నానో. త్రైష్టుభేన ఛందసా = త్రిష్టుప్పుమంత్రమునందు చెప్పబడిన శుద్ధమైన అర్థముతో. త్వా సాదయామి = నిన్ను నియోగించుచున్నానో, జాగతేన ఛందసా = జగతీఛందస్సులో చెప్పబడిన ఆనందదాయకమగు నర్థముతో, త్వా సాదయామి = నిన్నునియుక్తమొనర్చు చున్నానో. ఆనుష్టుభేన ఛందసా = అనుష్టుప్పు మంత్రమునందు చెప్పబడిన శుద్ధార్థముతో, త్వా సాదయామి = నిన్ను ప్రేరేపించుచున్నానో. పాంక్తేన ఛందసా = పంక్తిమంత్రమున ప్రకాశితమైన నిర్మలార్థముతో, త్వా సాదయామి = నిన్ను ప్రేరేపించుచున్నానో, అటులనే నీవు వర్తించుము. ॥౫౩॥

భావార్థము :—విద్వాంసులు సకల స్త్రీ పురుషులకు వేదమును చదివించి, లోకస్థ వాయ్వాది పదార్థముల విద్యయందు నిపుణులుగనొనర్చి వానివలన ప్రయోజనము సాధించుటకై ప్రవృత్తులుకావలయును.

---

ఉ॰॥ అయం పుర ఇత్యస్యోశనా ఋషిః, ప్రాణా దేవతాః, స్వరాడ్బ్రాహ్మీ జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

అథ మనుష్యైః సృష్టేః సకాశాత్ కే క ఉపకారా గ్రాహ్యా ఇత్యాహ.

మానవులు సృష్టినుండి యేయే ఉపకారములు గ్రహించవలయును ?

అయం పురో భువస్తస్య ప్రాణో భౌవాయనో వసన్తః ప్రాణాయనో
గాయత్రీ వాసన్తీ గాయత్ర్యై గాయత్రం గాయత్రా దుపాంశు రుపాంశో
స్త్రివృత్ త్రివృతో రథన్తరం వసిష్ఠ ఋషిః । ప్రజాపతిగృహీతయా
త్వయా ప్రాణం గృహ్ణామి ప్రజాభ్యః ॥ ॥౫౪॥

అయమ్, పురః, భువః, తస్య. ప్రాణః, భౌవాయన ఇతి భౌవ+ఆయనః, వసన్తః, ప్రాణాయన ఇతి ప్రాణ+ఆయనః, గాయత్రీ, వాసన్తీ, గాయత్ర్యై, గాయత్రమ్, గాయత్రాత్, ఉపాంశురిత్యుప+అంశుః, ఉపాంశోరిత్యుప+అంశోః, త్రివృదితి త్రి+వృత్, త్రివృత ఇతి త్రి+వృతః, రథన్తరమితి రథమ్+తరమ్, వసిష్ఠః, ఋషిః, ప్రజాపతిగృహీతయేతి ప్రజాపతి+గృహీ

తయా, త్వయా, ప్రాణమ్, గృహ్ణామి, ప్రజాభ్య ఇతి ప్రజాభ్యః. [54]

పదార్థః :-(అయమ్)అగ్నిః(పురః)పూర్వమ్(భువః)యో భవతి సః(తస్య)ప్రాణః యేన ప్రాణితి సః (భౌవాయనః)భువేన సతా రూపేణ కారణేన నిర్వృత్తః (వసన్తః)సుగన్ధాదిభి ర్వాసయతి (ప్రాణాయనః)ప్రాణా నిర్వృత్తా యస్మాత్(గాయత్రీ)యా గాయన్తం త్రాయతే సా(వాసన్తీ)వసన్తస్యవ్యాఖ్యాత్రీ (గాయత్ర్యై)గాయత్ర్యాః. అత్ర షష్ఠ్యర్థే చతుర్థీ(గాయత్రమ్)గాయత్ర్యేవ ఛన్దః (గాయత్రాత్) (ఉపాంశుః)ఉపగృహీతా (ఉపాంశోః) (త్రివృత్)యస్త్రిభిః కర్మోపాసనాజ్ఞానై ర్వర్తతే సః(త్రివృతః)(రథన్తరమ్) యదర్థై రమణీయై స్తారయతి తత్(వసిష్ఠః)అతిశయేన వాసయితా(ఋషిః)ప్రాపకో విద్వాన్ (ప్రజాపతిగృహీతయా) ప్రజాపతి ర్గృహీతో యయా స్త్రియా తయా(త్వయా)(ప్రాణమ్)బలయుక్తం జీవనమ్ (గృహ్ణామి) (ప్రజాభ్యః)॥ ౫౪॥ అన్వయః :-హే స్త్రి ! యథాఽయం పురో భువోఽగ్ని స్తస్య భౌవాయనః ప్రాణః ప్రాణాయనో వసన్తో వాసన్తీ గాయత్రీ గాయత్ర్యై గాయత్రం గాయత్రాదుపాంశు రుపాంశోస్త్రివృత్ త్రివృతో రథన్తరం వసిష్ఠ ఋషిశ్చ ప్రజాపతిగృహీతయా త్వయా సహ ప్రజాభ్యః ప్రాణం గృహ్ణామి తథా త్వయా సాక మహం ప్రజాభ్యో బలం గృహ్ణామి. ॥౫౪॥

భావార్థః :– స్త్రీ పురుషా అగ్న్యాదిపదార్థానా ముపయోగం కృత్వా పరస్పరం ప్రీత్యాఽతివిషయాసక్తిం విహాయ సర్వస్మాజ్జగతో బలం సంగృహ్య ప్రజా ఉత్పాద్యాః. ॥౫౪॥

పదార్థము :-ఓ స్త్రీ! ఎటుల, అయం పురో భువః = ముందుద్భవించు నీ యగ్ని, తస్య = దాని యొక్క, భౌవాయనః = సిద్ధకారణముతో రచించబడిన జీవమునకు హేతువైన, ప్రాణః = ప్రాణము ప్రాణాయనః = ప్రాణరచనకు హేతువైన, వసంతః = సుగంధ్యాదులందు సువాసననుపూరించు వసంతర్తువు, వాసంతీ = వసంతర్తువు వ్యాఖ్యానించబడినది, గాయత్రీ = గానమొనర్చువానిని రక్షించునది యు నగు గాయత్రీమంత్రార్థమైన ఈశ్వరుడు. గాయత్ర్యై = గాయత్రీమంత్రముయొక్క, గాయత్రమ్ గాయత్రీఛందస్సు, గాయత్రాత్ = గాయత్రినుండి, ఉపాంశుః = సమీపమున గ్రహించబడుజపము, ఉపాంశోః = ఆజపమువలన, త్రివృత్ = జ్ఞానకర్మోపాసనలతో మెలగువాడు, త్రివృతః = ఆమూడువిధముల ఫలములనుండి, రథంతరమ్ = రమణీయపదార్థముతో తరింపజేయు సుఖము, వసిష్ఠః = అతిశయముగ నివసించుటకు హేతువు, ఋషిః = సుఖమును లభింపజేయు విద్వాంసుడు, ప్రజాపతి గృహీతయా = స్వసంతానమును రక్షించువాడగు పతిని గ్రహించు,త్వయా = నీతోపాటు, ప్రజాభ్యః సంతానోత్పత్తికై, ప్రాణమ్ = బలయుక్తజీవనమును గ్రహించుచున్నారో అటులనే నీతోపాటు నేను సంతానప్రాప్తికై బలమును, గృహ్ణామి = గ్రహించుచున్నాను. ॥౫౪॥

భావార్థము :– స్త్రీ పురుషులారా! మీరు అగ్న్యాది పదార్థములను ఉపయోగించి పరస్పరప్రేమతో అతివిషయవాంఛలను త్యజించి సంసారమంతటినుండి బలమును గ్రహించి సంతానోత్పత్తియొనర్చవలయును. ॥౫౪॥ (౬౦౪)

---

౬౦౫ అయం దక్షిణేత్యస్యోశనా ఋషిః, ప్రజాపతి ర్దేవతా, నిచృదతిధృతి శ్ఛన్దః, షడ్జః స్వరః.

అథ మనుష్యై ర్గ్రీష్మర్తౌ కథం వర్తితవ్య మిత్యాహ.

మానవులు గ్రీష్మఋతువు నందెటుల ప్రవర్తించవలయును ?

అయం దక్షిణా విశ్వకర్మా తస్య మనో వైశ్వకర్మణం గ్రీష్మో మానసస్త్రిష్టుబ్ గ్రైష్మీ త్రిష్టుభః స్వారమ్ । స్వారాదన్తర్యామోఽన్తర్యామాత్

పఞ్చదశః పఞ్చదశాద్బృహద్ భరద్వాజ ఋషిః ప్రజాపతిగృహీతయా

త్వయా మనో గృహ్ణామి ప్రజాభ్యః ॥ ॥౫౫॥

అయమ్, దక్షిణా. విశ్వకర్మేతి విశ్వ+కర్మా, తస్య, మనః, వైశ్వకర్మణమితి వైశ్వ+కర్మణమ్, గ్రీష్మః. మానసః, త్రిష్టుప్,త్రిస్తుబితి త్రి+స్తుప్, గ్రైష్మీ, త్రిష్టుభః, త్రిస్తుభ ఇతి త్రి+స్తుభః, స్వారమ్,స్వారాత్, అన్తర్యామ ఇత్యన్తః+యామః, అన్తర్యామాదిత్యన్తః+యామాత్, పఞ్చదశ ఇతి పఞ్చ+దశః, పఞ్చదశాదితి పఞ్చ+దశాత్, బృహత్, భరద్వాజ ఇతి భరత్+వాజః, ఋషిః, ప్రజాపతిగృహీతయేతి ప్రజాపతి + గృహీతయా, త్వయా, మనః, గృహ్ణామి, ప్రజాభ్యః ఇతి ప్ర + జాభ్యః. [55]

పదార్థః :-(అయమ్) వాయుః (దక్షిణా) దక్షిణతః (విశ్వకర్మా) విస్వాన్యఖిలాని కర్మాణి యస్మాత్సః (తస్య) వాయోః (మనః)మననశీలం ప్రేరకం కర్మ (వైశ్వకర్మణమ్) యస్మాద్విశ్వాని నిర్వృతాని భవన్తి తత్(గ్రీష్మః)యో రసాన్ గ్రసతే సః (మానసః) మనస ఊష్మేవ వర్తమానః (త్రిష్టుప్) ఛన్దః (గ్రైష్మీ)గ్రీష్మర్తువ్యాఖ్యాత్రీ ఋక్ (త్రిష్టుభః) ఛన్దసః(స్వారమ్)తాపాజ్జాతం తేజః (స్వారాత్) (అన్తర్యామః) అన్తర్మధ్యే యామాః ప్రహరా యస్మిన్సమయే సః (అన్తర్యామాత్) (పఞ్చదశః) పఞ్చదశానాం తిథీనాం పూరకః (స్తోమః) (పఞ్చదశాత్) (బృహత్) మహాన్ (భరద్వాజః) వాజోఽన్నం విజ్ఞానం వా బిభర్తి యేన శ్రోత్రేణ తత్ (ఋషిః) విజ్ఞాపకః (ప్రజాపతిగృహీతయా) (త్వయా) (మనః) మననాత్మకవిజ్ఞానయుక్తం చిత్తమ్ (గృహ్ణామి)(ప్రజాభ్యః) ॥౫౫॥

అన్వయః:—హే స్త్రి! యథా దక్షిణాఽయం విశ్వకర్మా వాయురివాస్తి తస్య వైశ్వకర్మణం మనో మానసో గ్రీష్మో గ్రైష్మీ త్రిష్టుప్ త్రిష్టుభః స్వారం స్వారాదన్తర్యామోఽన్తర్యామాత్పఞ్చదశః పఞ్చదశాద్ బృహద్భరద్వాజ ఋషిః ప్రజాపతిగృహీతయా విద్యయా సహ రాజా ప్రజాభ్యో మనో గృహ్ణాతి తథా త్వయా సాకమహం విశ్వస్మాద్విజ్ఞానం గృహ్ణామి. ॥౫౫॥ భావార్థః :-స్త్రీ పురుషైః ప్రాణస్య మనో నియన్తృ మనసశ్చ ప్రాణో నియన్తేతి విదిత్వా ప్రాణాయామాన్ మనఃశుద్ధిం సంపాదయద్భిరఖిలాయాః సృష్టేః పదార్థవిజ్ఞానమ్ స్వీకార్యమ్. ॥౫౫॥

పదార్థము :-ఓ స్త్రీ! ఎటుల, దక్షిణా = దక్షిణదిశనుండి, అయమ్ విశ్వకర్మా = సకలకర్మలకు నిమిత్తమైన వాయువువలె విద్వాంసుడు విచరించుచున్నాడో; తస్య = ఆవాయుయోగముచే, వైశ్వకర్మణమ్ మనః = సకలకర్మలను సిద్ధింపజేయు విచారస్వరూపమైన ప్రేరకమగు మనస్సు. మానసః = మనుస్సుయొక్క వేడినుండి ఉత్పన్నమైన దానివలె నుండు, గ్రీష్మః = రసముల నాశనమొనర్చు గ్రీష్మర్తువు, గ్రైష్మీ = గ్రీష్మర్తువ్యాఖ్యానమగు, త్రిష్టుప్ = త్రిష్టుప్ఛందస్సు, త్రిష్టుభః = త్రిష్టుప్ ఛందస్సునుండి, స్వారమ్ = తాపజన్యతేజస్సు, స్వారాత్ = తేజస్సునుండి, అంతర్యామః = మధ్యాహ్నసమయము, అంతర్యామాత్ = మధ్యాహ్నపువేళనుండి, పంచదశః = పదునైదు తిథులను

పూరించు స్తుతియోగ్య పౌర్ణిమ.పంచదశాత్ = ఆ పూర్ణిమనుండి,బృహత్ భారద్వాజః = అన్నములేక విజ్ఞానములపుష్టిధారణములొనర్చుటకు నిమిత్తమైన,ఋషిః = శబ్దజ్ఞానముకలిగించు కర్ణము, ప్రజాపతి గృహీతయా = ప్రజాపాలకుడు పతియునగు రాజు గ్రహించిన విద్యచే న్యాయమును గ్రహించుచున్న టుల నేను, త్వయా = నీతోపాటు, ప్రజాభ్యః = ప్రజలకై , మనః = విచారస్వరూపము,విజ్ఞానయుక్త మునగు చిత్తమును మఱియు విజ్ఞానమును, గృహ్ణామి = గ్రహించుచున్నాను. ॥౫౫॥

భావార్థము :—స్త్రీ పురుషు లిరువురు ప్రాణమునకు మనస్సు, మనస్సునకు ప్రాణము నియంత యని గ్రహించి ప్రాణాయామముతో నాత్మను శుద్ధియొనర్చుచు అఖిలసృష్టి నుండి పదార్థవిజ్ఞానమును స్వీకరించవలయును. ॥౫౫॥ (౬౮౫)

---

౬౮౬ అయం పశ్చాదిత్యస్యోశనా ఋషిః, ప్రజాపతి ర్దేవతా. నిచృద్ ధృతి శ్ఛన్దః, షడ్జః స్వరః. అథ స్త్రీ పురుషౌ మిథః కథ మాచరేతా మిత్యాహ. స్త్రీ పురుషులుపరస్పరమెటుల వర్తించవలెను ?

అయం పశ్చాద్ విశ్వవ్యచాస్తస్య చక్షు ర్వైశ్వవ్యచసం వర్షాశ్చాక్షుష్యో జగతీ వార్షీ జగత్యా ఋక్సమమ్ । ఋక్సమాచ్ఛుక్రః శుక్రాత్సప్తదశః సప్తదశా ద్వైరూపం జమదగ్ని ర్ఋషిః ప్రజాపతిగృహీతయా త్వయా చక్షుర్గృహ్ణామి ప్రజాభ్యః ॥

అయం, పశ్చాత్, విశ్వవ్యచా ఇతి విశ్వ+వ్యచాః, తస్య,చక్షుః, వైశ్వవ్యచసమితి వైశ్వ+వ్యచసమ్, వర్షాః, చాక్షుష్యః, జగతీ, వార్షీ, జగత్యాః, ఋక్సమమిత్యృక్సమమ్, ఋక్సమాదిత్యృక్+సమాత్, శుక్రః, శుక్రాత్, సప్తదశ ఇతి సప్త+దశః, సప్తదశాదితి సప్త+దశాత్, వైరూపమ్, జమదగ్నిరితి జమత్+అగ్నిః, ఋషిః, ప్రజాపతిగృహీతయేతి ప్రజాపతి+గృహీతయా, త్వయా, చక్షుః, గృహ్ణామి, ప్రజాభ్య ఇతి ప్ర+జాభ్యః. [56]

పదార్థః :—(అయమ్)ఆదిత్యః(పశ్చాత్)పశ్చిమాయాం దిశి వర్తమానః(విశ్వవ్యచాః)విశ్వం వ్యచతి ప్రకాశేనాభివ్యాప్య ప్రకటయతి సః (తస్య)సూర్యస్య (చక్షుః)నయనమ్(వైశ్వవ్యచసమ్)ప్రకాశకమ్(వర్షాః) యాసు మేఘా వర్షన్తి తాః (చాక్షుష్యః)చక్షుష ఇమా దర్శనీయాః (జగతీ) జగద్గతా (వార్షీ)వర్షాణాం వ్యాఖ్యాత్రీ(జగత్యాః)(ఋక్సమమ్) ఋచః సన్తి సంధిజన్తి యేన తత్సామ (ఋక్సమాత్)(శుక్రః)పరాక్రమః(శుక్రాత్)వీర్యాత్(సప్తదశ)సప్తదశానాంపూరకః(సప్తదశాత్)(వైరూపమ్) వివిధాని రూపాణి యస్మాత్తస్యేదమ్(జమదగ్నిః) ప్రజ్వలితాగ్నిర్నయనమ్ (ఋషిః) రూపప్రాపకః (ప్రజాపతి గృహీతయా)(త్వయా)(చక్షుః)(గృహ్ణామి)(ప్రజాభ్యః)॥౫౬॥అన్వయః :—హే వరాననే యథాఽయ మాదిత్య ఇవ విద్వాన్ విశ్వవ్యచాః సన్ పశ్చాదాదిత్యస్తస్య వైశ్వవ్యచసం చక్షుశ్చాక్షుష్యో వర్షా వార్షీ జగతీ జగత్యా ఋక్ సమమృక్ సమాచ్ఛుక్రః శుక్రాత్సప్తదశః సప్తదశాద్వైరూపం యథా చ జమదగ్నిరృషిః ప్రజాపతి గృహీతయా సహ ప్రజాభ్యశ్చక్షుర్గృహ్ణాతి తథాఽహం త్వయా సాకం సంసారాద్ బలం గృహ్ణామి. ॥౫౬॥ భావార్థః :—దమ్పతిభ్యాం సామవేదాధ్యయనేన సూర్యాదిప్రసిద్ధం జగదర్థతో విజ్ఞాయ సర్వస్యాః సృష్టేః సుదర్శనచరిత్రే సంగ్రాహ్యే. ॥౫౬॥

పదార్థము :-వరాననా! ఎటుల, అయమ్ = ఈసూర్యసమ విద్వాంసుడు, విశ్వవ్యచాః = సకల జగత్తును నలువైపుల ప్రకాశముచే వ్యాపకుడై ప్రకటించుచు, పశ్చాత్ = పశ్చిమదిశయందు వర్తమానుడై ఉన్నాడో, తస్య = ఆ సూర్యునియొక్క, వైశ్వవ్యచసమ్ = ప్రకాశక కిరణరూపమైన, చక్షుః = నేత్రము, చాక్షుష్యః = నేత్రముచే గాంచదగిన, వర్షాః = మేఘము వర్షించువర్షర్తువు. వార్షీ = వర్షర్తువును వ్యాఖ్యానించు, జగతీ = సంసారప్రసిద్ధజగతీఛందస్సు, జగత్యాః = జగతీఛందస్సునుండి, ఋక్సమమ్ = ఋక్కుల సేవనమునకు హేతువైన విజ్ఞానము, ఋక్సమాత్ = ఆవిజ్ఞానమునుండి, శుక్రః = పరాక్రమము, శుక్రాత్ = పరాక్రమమునుండి, సప్తదశః = సప్తదశతత్వముల విజ్ఞానము, సప్తదశాత్ = ఆ విజ్ఞానమునుండి, వైరూపమ్ = అనేకరూపములకు హేతువైన జగత్తుయొక్క జ్ఞానము, మఱియు నెటుల, జమదగ్నిః = ప్రకాశస్వరూపమగు. ఋషిః = రూపమును లభింపజేయునేత్రము, ప్రజాపతి గృహీతయా = సంతానరక్షకుడగు పతి గ్రహించిన విద్యాయుక్తురాలైన స్త్రీతో, ప్రజాభ్యః = ప్రజలకై, చక్షుః = విద్యారూపనేత్రములను గ్రహించుచున్నాడో అటులనే నేను[త్వయా = ] నీతోపాటు లోకమునుండి బలమును గ్రహించు చున్నాను. ॥౫౬॥

భావార్థము :-దంపతులు సామవేదాధ్యయనముచే సూర్యాది ప్రసిద్ధజగత్తును స్వభావ[సహిత]ముతో నెఱిగి సకల సృష్టినుండి బాగుగ చూచుటను, మంచినడవడికను గ్రహించవలయును. ॥౫౬॥

---

ఉ౭ః ఇద ముత్తరాదిత్యస్యోశనా ఋషిః, ప్రజాపతి ర్దేవతా, స్వరాడ్బ్రాహ్మీ త్రిష్టుప్ ఛన్దః, ధైవతః స్వరః.
అథ శరదృతౌ కథం వర్తితవ్య మిత్యాహ, శరదృతువు నందెటుల ప్రవర్తించవలయును?

ఇదముత్తరాత్ స్వస్తస్య శ్రోత్రꣳసౌవꣳశరచ్ఛ్రౌత్ర్యనుష్టుప్ శారద్యనుష్టుభ ఐడమైడాన్ మన్థీ మన్థిన ఏకవింశ ఏకవింశాద్ వైరాజం విశ్వామిత్ర ఋషిః ప్రజాపతిగృహీతయా త్వయా శ్రోత్రం గృహ్ణామి ప్రజాభ్యః ॥

ఇదమ్, ఉత్తరాత్, స్వరితి స్వః, తస్య, శ్రోత్రమ్, సౌవమ్, శరత్, శ్రౌత్రీ, అనుష్టుప్ అనుస్తుబిత్యను+స్తుప్, శారదీ, అనుష్టుభః, అనుస్తుభ ఇత్యను+స్తుభః, ఐడమ్, ఐడాత్, మన్థీ, మన్థినః, ఏకవింశ ఇత్యేక+వింశః, ఏకవింశాదిత్యేక+వింశాత్, వైరాజమ్, విశ్వామిత్రః, ఋషిః, ప్రజాపతిగృహీతయేతి ప్రజాపతి+గృహీతయా, త్వయా, శ్రోత్రమ్, గృహ్ణామి, ప్రజాభ్య ఇతి ప్ర+జాభ్యః. [57]

పదార్థః-(ఇదమ్)(ఉత్తరాత్)సర్వేభ్య ఉత్తరమ్ (స్వః) సుఖసంపాదకదిగ్రూపమ్ (తస్య) (శ్రోత్రమ్)కర్ణమ్ (సౌవమ్)స్వః సుఖస్యేదం సాధనమ్(శరత్)శృణాతి యేన సా (శ్రౌత్రీ) శ్రోత్రస్యేయం సంబన్ధినీ(అనుష్టుప్)(శారదీ) శరదో వ్యాఖ్యాత్రీ(అనుష్టుభః) (ఐడమ్)ఇడాయా వాచో వ్యాఖ్యాత్రీ(సామ)(ఐడాత్) (మన్థీ)పదార్థానాం మన్థనసాధనః (మన్థినః) (ఏకవింశః)ఏకవింశతే ర్విద్యానాం పూరకః (ఏకవింశాత్) (వైరాజమ్)వివిధానాం పదార్థానా మిదం ప్రకాశకమ్ (విశ్వామిత్రః) విశ్వం మిత్రం యేన భవతి సః(ఋషిః)శబ్దప్రాపకః (ప్రజాపతి గృహీతయా)(త్వయా) (శ్రోత్రమ్) శృణోతి యేన తత్ (గృహ్ణామి) (ప్రజాభ్యః)ప్రజాతాభ్యో విద్యుదాదిభ్యః ॥౫౭॥ అన్వయః :-

హే సుభగే ! యథేదముత్తరాత్స్వస్తస్య సౌవం శ్రోత్రం శ్రాత్రి శరచ్ఛారద్యనుష్టు బనుష్టుభ ఐడ మైడాన్మన్థీ మన్దిన ఏకవింశ ఏకవింశాద్వైరాజం సామ సామ్రాజ్యో విశ్వామిత్ర ఋషిశ్చ ప్రజాభ్యః శ్రోత్రం గృహ్ణామి తథా ప్రజాపతి గృహీతయా త్వయా సహాహం ప్రజాభ్యః శ్రోత్రం గృహ్ణామి. భావార్థః :- బ్రహ్మచర్యేణాధీతవిద్యౌ కృతవివాహౌ స్త్రీ పురుషౌ బహుశ్రుతౌ భవేతామ్. నహ్యాప్తానాం సకాశాచ్ఛ్రవణేన వినా పఠితాపి విద్యా ఫలవతీ జాయతే. తస్మాత్సదా శ్రుత్వా సత్యం ధరేతామసత్యం త్యజేతామ్. ॥౫౭॥

పదార్థము:- సౌభాగ్యవతీ! ఎటుల, ఇదమ్ = ఈ, ఉత్తరాత్ = అన్నిటికి ఉత్తర [దిక్కు]భాగము, స్వః = సుఖముల సాధనమగు దిక్కు, తస్య = దానియొక్క, సౌవమ్ = సుఖసాధనమగు, శ్రోత్రమ్ = కర్ణము. శ్రౌత్రీ = కర్ణసంబంధమైన, శరత్ = శరదృతువు, శారదీ = శరదృతువును వ్యాఖ్యానించు, అనుష్టుప్ = ప్రబద్ధార్థముగలిగియున్న అనుష్టుప్ ఛందస్సు, అనుష్టుభః = అనుష్టుప్పునుండి, ఐడమ్ = వాణీవ్యాఖ్యానముగల మంత్రము. ఐడాత్ = ఆమంత్రమునుండి, మన్థీ = పదార్థములను మథించుసాధనము. మన్థినః = ఆసాధనమునుండి, ఏకవింశః = ఇరువదియొకటి విద్యలను పూరించు సిద్ధాంతము, ఏకవింశాత్ = ఆ సిద్ధాంతమునుండి వైరాజమ్ = వివిధపదార్థముల ప్రకాశకము, సామ = సామవేదజ్ఞానమునుపొందిన, విశ్వామిత్రః = అందరితోడి మిత్రత్వమునకు హేతువగు, ఋషిః = శబ్దజ్ఞానమును కలిగించు శ్రోత్రము, ప్రజాభ్యః = ఉద్భవించిన విద్యాదులకై, శ్రోత్రమ్ = శ్రవణసాధనమును గ్రహించుచున్నారో అటుల, ప్రజాపతి గృహీతయా = ప్రజాపాలకుడు గ్రహించిన, త్వయా = నీతోపాటు ప్రసిద్ధమైన విద్యాదులచే, శ్రోత్రమ్ = శ్రవణసాధక కర్ణమును, గృహ్ణామి = గ్రహించుచున్నాను ॥౫౭॥

భావార్థము :- బ్రహ్మచర్యముతో విద్యనభ్యసించి వివాహమొనర్చుకొన్న దంపతులు బహుశ్రుతులు కావలయును. ఆప్తులనుండి గ్రహించనిదే చదివినవిద్యయు ఫలప్రదమైనది కాజాలదు. కనుక సర్వకాలములందుసజ్జనోపదేశములను విని సత్యగ్రహణము అసత్యత్యాగము నొనర్చవలెను.

౫౮ ఇయ ముపరీత్యస్యోశనా ఋషిః, ప్రజాపతి ర్దేవతా, విరాడాకృతి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.
అథ హేమన్తే కథం వర్తితవ్య మిత్యాహ. హేమన్తఋతువు నందెటుల ప్రవర్తించవలయును?

ఇయముపరి మతి స్తస్యై వాఙ్మాత్యా హేమన్తో వాచ్యః పఙ్క్తి ర్హైమన్తీ
పఙ్క్త్యై నిధనవన్నిధనవత ఆగ్రయణః । ఆగ్రయణాత్ త్రిణవత్రయస్త్రింశౌ
త్రిణవత్రయస్త్రింశాభ్యాగ్ం శాక్వరరైవతే విశ్వకర్మా ఋషిః ప్రజాపతిగృహీ
తయా త్వయా వాచం గృహ్ణామి ప్రజాభ్యః ॥ ॥౫౮॥

ఇయమ్, ఉపరి, మతిః, తస్యై, వాక్, మాత్యా, హేమన్తః, వాచ్యః, పఙ్క్తిః, హైమన్తీ, పఙ్క్త్యై, నిధనవదితి నిధన+వత్ నిధనవత ఇతి నిధన + వతః, ఆగ్రయణః, ఆగ్రయణాత్, త్రిణవత్రయస్త్రింశౌ, త్రిణవత్రయస్త్రింశావితి త్రిన

వ॒త్ర॒య॒స్త్రి॒ꣳశౌ, త్రి॒ణ॒వ॒త్ర॒య॒స్త్రి॒ꣳశాభ్యామ్, త్రి॒న॒వ॒త్ర॒య॒స్త్రి॒ꣳశాభ్యామితి త్రి॒న వ॒త్ర॒య॒స్త్రింశాభ్యామ్, శా॒క్వ॒ర॒రై॒వ॒తే ఇతి శాక్వరరైవతే, వి॒శ్వక॑ర్మేతి వి॒శ్వ+క॒ర్మా, ఋషిః, ప్ర॒జా॒ప॒తి॒గృ॒హీ॒త॒యేతి ప్ర॒జాప॑తి+గృహీ॒తయా, త్వ॒యా, వాచ॑మ్, గృ॒హ్ణా॒మి॒, ప్ర॒జాభ్య॒ ఇతి ప్ర॒జాభ్యః. [58]

పదార్థః :- (ఇయమ్)(ఉపరి)సర్వోపరి విరాజమానా(మతిః)ప్రజ్ఞా(తస్యై)తస్యాః(వాక్) వక్తి యయా సా. అత్ర షష్ఠ్యర్థే చతుర్థీ (మాత్యా) మతేర్భావః కర్మ వా(హేమన్తః) హన్త్యుష్ణతాం యేన సః. అత్ర హన్తేర్హి ముట్ చ. ఉ. ౩,౧౨౯(వాచ్యః) వాచో భావః కర్మ వా (పఙ్క్తిః) ఛన్దః (హైమవతీ) హేమ్నో వ్యాఖ్యాత్రీ (పఙ్క్త్యై)పంక్త్యాః (నిధనవత్)నిధనం ప్రశస్తం మృత్యు వ్యాఖ్యానం విద్యతే యస్మింస్తత్సామ(నిధనవతః)(ఆగ్రయణః)అజ్గతి ప్రాప్నోతి యేన తస్యాయమ్ (ఆగ్రయణాత్)(త్రిణవత్రయస్త్రింశౌ)త్రినవం చ త్రయస్త్రింశంచ తే సామ్నీ(త్రినవత్రయస్త్రింశా భ్యామ్)(శాక్వరరైవతే) శక్తిధనప్రతిపాదకే(విశ్వకర్మా)విశ్వాని కర్మాణి యస్య సః(ఋషిః)వేదార్థ వేత్తా(ప్రజాపతి గృహీతయా)(త్వయా)(వాచమ్) విద్యాసుశిక్షాన్వితాం వాణీమ్ (గృహ్ణామి)ప్రజాభ్యః

అత్ర లోకాన్తా ఇన్ద్రమితి ద్వాదశాధ్యాయస్థానాం త్రయాణాం [౫౪-౫౬] మన్త్రాణాం ప్రతీకాని సూత్రవ్యాఖ్యానం దృష్ట్వా కేనచిద్ధృతాని. శతపథేఽవ్యాఖ్యాతత్వాదత్ర న గృహ్యన్తే. అన్వయః :–హే విదుషి పత్ని! య ఇయముపరి మతి స్తస్యై మాత్యా వాగ్వాచ్యో హేమన్తో హైమన్తీ పంక్తిః పఙ్క్త్యై నిధనవన్నిధనవత ఆగ్రయణ ఆగ్రయణాత్ త్రిణవత్రయస్త్రింశౌ త్రిణవత్రయస్త్రింశాభ్యాం శాక్వ రరైవతే విదిత్వా విశ్వకర్మర్షి ర్వర్తతే, తథాహం ప్రజాపతిగృహీతయా త్వయా సహాఽహం ప్రజాభ్యో వాచం గృహ్ణామి. ॥౫౮॥ భావార్థః :–పతిపత్నీభ్యాం విదుషాం వాచం శ్రుత్వా ప్రజ్ఞా వర్ధనీయా తయా హేమన్తర్తు కృత్యం సామాని చ విదిత్వా మహర్షివద్వర్తిత్వా విద్యాసుశిక్షాసంస్కృ తాం వాచం స్వీకృత్య ప్రజాభ్యోఽప్యేతాః సదోపదేష్టవ్యేతి. ॥౫౮॥

పదార్థము :–విదుషీమణీ! ఇయమ్ = ఏయీ. ఉపరి = అన్నిటికంటెపైన విరాజిల్లుచున్న, మతి = బుద్ధియున్నదో, తస్యై = అద్దానియొక్క, మాత్యా = బుద్ధియుండుట లేక బుద్ధియుక్తకర్మ, వాక్ = వాణి మఱియు, వాచ్యః = దానియునికి లేక దాని కర్మ, హేమంతః = వేడినినశింపజేయు హేమ తర్తువు, హైమంతీ = హేమంతర్తువును వ్యాఖ్యానించు, పంక్తిః = ఛందస్సు, పఙ్క్త్యై = ఆపంక్తిఛం దస్సుయొక్క, నిధనవత్ = మృత్యువుయొక్క ప్రశంసిత వ్యాఖ్యానమైన సామవేదభాగము. నిధన వతః = దానినుండి, ఆగ్రయణః = ప్రాప్తిసాధనము, జ్ఞానఫలము, ఆగ్రయణాత్ = దానినుండి, త్రిణవత్రయస్త్రింశౌ = ౧౨.౩౩సామవేదపు స్తోత్రములు, త్రిణవత్రయస్త్రింశాభ్యామ్ = ఆ స్తోత్రముల నుండి, శాక్వరరైవతే = శక్తిమఱియు ధనముయొక్క పదార్థములను ఎఱిగి, విశ్వకర్మా = సకల సుకర్మలను సేవించువాడును. ఋషిః = వేదార్థవక్తయునగు పురుషుడు మెలగుచున్నాడో అటుల నేను, ప్రజాపతిగృహీతయా = ప్రజాపాలకుడగు పతిగ్రహించిన, త్వయా = నీతోపాటు, ప్రజాభ్యః = ప్రజలకై, వాచమ్ = విద్యాసుశిక్షాయుతవాణిని, గృహ్ణామి = గ్రహించుచున్నాను. ॥౫౮॥

భావార్థము :- విద్వాంసుల శిక్షారూపవాణిని విని దంపతులు తమబుద్ధిని పెంపొందించుకొనవల యును. ఆ బుద్ధితో హేమంతర్తువునందలి కర్తవ్యకర్మను, సామవేదపు స్తోత్రములను ఎఱిగి మహా

త్మలైన ఋషులవలె ప్రవర్తించి, విద్యాసుశిక్షితమైన వానిని గ్రహించి స్వసంతానమునకుకూడ ఈ వాణులను సర్వదా ఉపదేశించు చుండవలయును. ॥౫౮॥ (౬౮౮)

అత్రేశ్వర జాయాపతివ్యవహారస్య ప్రతిపాదనాదేతదర్థస్య పూర్వాధ్యాయార్థేన సఙ్గతి రస్తీతి వేదితవ్యమ్.

ఈ అధ్యాయమునందు ఈశ్వరునియొక్కయు, దంపతులయొక్కయు, వ్యవహారముల యొక్కయు వర్ణన ఉండుటచే నీయధ్యాయోక్తార్థమునకు పూర్వాధ్యాయోక్తార్థముతో సంగతిగలదని గ్రహించవలయును.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజ్యకాచార్యాణాం పరమవిదుషాం శ్రీమద్విరజానన్దసరస్వతీస్వామీనాం శిష్యేణ దయానన్దసరస్వతీవిరచితే సంస్కృతార్యభాషాభ్యాం విభూషితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే త్రయోదశోఽధ్యాయః పూర్తిమయాసీత్.

పదమూడవ అధ్యాయము ఆంధ్రానువాదము సంపూర్ణము.

ఓమ్

# అథ చతుర్దశాధ్యాయారమ్భః

ఓమ్ విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ । యద్భద్రం తన్న ఆసువ ॥

పదునాలుగవ అధ్యాయము ఆరంభము.

౬౮౯ ధ్రువక్షితి రిత్యస్యోశనా ఋషిః, అశ్వినౌ దేవతే, త్రిష్టుప్ ఛందః, ధైవతః స్వరః.

అథాదిమే మంత్రే స్త్రీభ్య ఉపదేశ మాహ. మొదటిమంత్రమందు స్త్రీలకొఱకుపదేశ మొనర్చెను.

ధ్రువక్షితి ర్ధ్రువయోని ర్ధ్రువాసి ధ్రువం యోనిమాసీద సాధుయా ।
ఉఖ్యస్య కేతుం ప్రథమం జుషాణా అశ్వినాధ్వర్యూ సాదయతామిహ త్వా ॥

ధ్రువక్షితి రితి ధ్రువ+క్షితిః, ధ్రువయోని రితి ధ్రువ+యోనిః, ధ్రువా, అసి, ధ్రువమ్, యోనిమ్, ఆ, సీద సాధుయేతి సాధు+యా, ఉఖ్యస్య, కేతుమ్, ప్రథమమ్, జుషాణా, అశ్వినా, అధ్వర్యూ ఇత్యధ్వర్యూ, సాదయతామ్, ఇహ, త్వా. [1]

పదార్థః :-(ధ్రువక్షితిః)ధ్రువా నిశ్చలా క్షితి ర్నివసతి ర్జనపదో యస్యాః సా(ధ్రువయోనిః) ధ్రువా యోని ర్గృహం యస్యాః సా(ధ్రువా)నిశ్చలధర్మా(అసి)(ధ్రువమ్) (యోనిమ్)గృహమ్(ఆ) (సీద) (సాధుయా) సాధునా ధర్మేణ సహ (ఉఖ్యస్య) ఉఖాయాం స్థాల్యాం భవస్య పాకసమూహస్య (కేతుమ్) ప్రజ్ఞామ్ (ప్రథమమ్) విస్తీర్ణమ్ (జుషాణా)ప్రీత్యా సేవమానా(అశ్వినా)వ్యాప్తసకలవిద్యా

వధ్యాపకోపదేశకౌ (అధ్వర్యూ) ఆత్మనోఽధ్వరమహింసనీయం గృహాశ్రమాదికం యజ్ఞమిచ్ఛూ (సాదయతామ్) అవస్థాపయతమ్ (ఇహ) గృహాశ్రమే (త్వా) త్వామ్. ॥౧॥ అన్వయః :- హే స్త్రి! యా త్వం సాధుయోఖ్యస్య ప్రథమం కేతుం జుషాణా ధ్రువక్షితి ర్ధ్రువయోని ర్ధ్రువాసి సా త్వం ధ్రువం యోనిమాసీద త్వామిహాధ్వర్యూ అశ్వినా సాదయతామ్. ॥౧॥ భావార్థః :- కుమారీణాం బ్రహ్మచర్యావస్థాయా మధ్యాపకోపదేశికే విదుష్యౌ గృహాశ్రమధర్మశిక్షాం కృత్వైతాః సాధ్వీః సంపాదయేతామ్. ॥౧॥

పదార్థము :-ఓస్త్రీ ! ఏ నీవు, సాధుయా = శ్రేష్ఠధర్మముతో. ఉఖ్యస్య = వంటపాత్రలో పక్వమైన అన్నమునకు సంబంధించిన. ప్రథమమ్ కేతుమ్ = విస్తారమైన బుద్ధిని. జుషాణా = ప్రీతితో సేవించుదానవు, ధ్రువక్షితిః = నిశ్చలమైన వసతిగలదానవు. ధ్రువయోనిః = నిశ్చలమైన ఇంటిలో నుండుదానవు, ధ్రువా అసి = దృఢధర్మముగలదానవునై యున్నావో ఆ నీవు. ధ్రువమ్ యోనిమ్ = నిశ్చలగృహమందు, ఆసీద = స్థిరురాలవుకమ్ము. త్వా = నిన్ను, ఇహ = ఈగృహాశ్రమమున. అధ్వర్యూ = తనకై రక్షణీయము అహింసనీయమునగు గృహాశ్రమాది యజ్ఞమునభిలషించువారు, అశ్వినా = సకలవిద్యలందువ్యాపకులునగు అధ్యాపకోపదేశకులు. సాదయతామ్ = చక్కగాస్థాపించుదురుగాక.

భావార్థము:-అధ్యాపికోపదేశికలైన విదుషీమణులు కన్యలను బ్రహ్మచర్యకాలమునందే గృహాశ్రమశిక్షను ధర్మశిక్షను గఱపి వారిని శ్రేష్ఠురాండ్రుగ నొనర్చవలయును. ॥౧॥ (౬౮౫)

౬౮౬ కులాయినీ త్యస్యోశనా ఋషిః, అశ్వినౌ దేవతే, బ్రాహ్మీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.

పునః స ఏవ విషయ ఉపదిశ్యతే. పూర్వోక్తవిషయము మరల ఉపదేశించబడుచున్నది.

కులాయినీ ఘృతవతీ పురన్ధిః స్యోనే సీద సదనే పృథివ్యాః ।
అభి త్వా రుద్రా వసవో గృణన్త్విమా బ్రహ్మ పీపిహి సౌభగాయ ।
అశ్వినాధ్వర్యూ సాదయతామిహ త్వా ॥ ॥౨॥

కులాయినీ, ఘృతవతీతి ఘృతవతీ, పురన్ధిరితి పురమ్+ధిః, స్యోనే, సీద, సదనే, పృథివ్యాః, అభి, త్వా, రుద్రాః, వసవః, గృణన్తు, ఇమా, బ్రహ్మ, పీపిహి, సౌభగాయ, అశ్వినా, అధ్వర్యూ, ఇత్యధ్వర్యూ, సాదయతామ్, ఇహ, త్వా.

పదార్థః :- (కులాయినీ)కులం యదేతి తత్కులాయం తత్ప్రశస్తం విద్యతే యస్యాః సా (ఘృతవతీ) ఘృతం బహూదకమస్తి యస్యాః సా(పురన్ధిః)యా పురూణి బహూని సుఖాని దధాతి సా (స్యోనే) సుఖకారికే(సీద) (సదనే)గృహే (పృథివ్యాః)భూమేః (అభి) (త్వా)త్వామ్ (రుద్రాః) మధ్యా విద్వాంసః (వసవః)ఆదిమా విపశ్చితః (గృణన్తు) ప్రశంసన్తు (ఇమా)ఇమాని (బ్రహ్మ) విద్యాధనమ్ (పీపిహి)ప్రాప్నుహి. అత్రాపి గతావిత్యస్మాచ్ఛపః శ్లుః తుజాదిత్వాదభ్యాసదీర్ఘశ్చ(సౌభగాయ)శోభనైశ్వర్యాణాం భావాయ (అశ్వినా)(అధ్వర్యూ)(సాదయతామ్)(ఇహ)(త్వా)త్వామ్. ॥౨॥ అన్వయః :- హే స్యోనే! యాం త్వాం వసవో రుద్రాశ్చేమా బ్రహ్మదాత్ర్యాన్ గృహీత్వానభిగృణన్తు సా త్వం సౌభగాయైతాని పీపిహి. ఘృతవతీ పురన్ధిః కులాయినీ సతీ పృథివ్యాః సదనే సీద. అధ్వర్యూ అశ్వినా త్వేహ సాదయతామ్. ॥౨॥ భావార్థః :- స్త్రియః సాఙ్గోపాఙ్గమైశ్వర్యసుఖ

భోగాయ స్వసదృశాన్ పతీనుపయమ్య విద్యాసువర్ణాదిధనం ప్రాప్య సర్వర్తుసుఖసాధకేషు గృహేషు నివసన్తు. విదుషాం సఙ్గం శాస్త్రాభ్యాసం చ సతతం కుర్యుః. ॥౨॥

పదార్థము :—స్యోనే = సుఖమొసగుదానా! త్వా = ఓ నిన్ను, వసవః = ప్రథమశ్రేణికి జెందిన విద్వాంసులు, రుద్రాః = మధ్యమశ్రేణికిజెందిన విద్వాంసులు, ఇమా = ఈ, బ్రహ్మ = విద్యాధనము లనిచ్చు గృహస్థులకు, అభి = అభిముఖులై, గృణంతు = ప్రశంసించెదరో. ఆ నీవు, సౌభగాయ = సుందరసంపత్తికై యీ విద్యాధనమును, పీపిహి = బాగుగ పొందుము. ఘృతవతీ = బహుజలయుతురాలవై, పురంధిః = బహుసుఖములను ధరించుదానివై, కులాయినీ = ప్రశంసిత కులమును పొందినదానవునై, పృథివ్యాఃసదనే = స్వభూమియందలిగృహమునందు, సీద = స్థితురాలవుకమ్ము అధ్వర్యూ = తనకై రక్షణీయ గృహాశ్రమము మొదలై నయజ్ఞమునఖిలపించువారు. అశ్వినా = సకలవిద్యానిష్ణాతులు, ఉపదేశకులు, త్వా = నిన్ను. ఇహ = ఈగృహాశ్రమమున. సాదయతామ్ = స్థాపింపుదురు గాక!॥౨॥

భావార్థము :—స్త్రీలు సాంగోపాంగముగ పూర్ణవిద్య[నభ్యసించి]ధనైశ్వర్యసుఖముల ననుభవించుటకై స్వసదృశపతులతో వివాహ మొనర్చుకొని విద్యాసువర్ణాదిధనములను పొంది సర్వర్తులందు సుఖమొసగు నిండ్లలో నివాస మొనర్చవలయును, అటులనే విద్వత్సంగము, శాస్త్రాభ్యాసము నిరంతర మొనర్చుచుండవలయును. ॥౨॥ (౬౯౦)

౬౯౧ స్వైర్దక్షై రిత్యస్యోశనా ఋషిః, అశ్వినౌ దేవతే నిచృద్బ్రాహ్మీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.
పునస్తమేవ విషయమాహ, మరల పూర్వోక్తవిషయ మిందు చెప్పబడినది.

స్వైర్దక్షైర్దక్షపితేహ సీద దేవానాꣳసుమ్నే బృహతే రణాయ। పితేవైధి సూనవ ఆ సుశేవా స్వావేశా తన్వా సంవిశస్వ। అశ్వినాధ్వర్యూ సాదయతామిహ త్వా॥

స్వైః, దక్షైః, దక్షపితేతి దక్ష+పితా ఇహ, సీద, దేవానామ్, సుమ్నే, బృహతే, రణాయ, పితేవేతి పితా+ఇవ, ఏధి, సూనవే, ఆ, సుశేవేతి సు+శేవా, స్వావేశేతి సు+ఆవేశా, తన్వా, సమ్, విశస్వ, అశ్వినా, అధ్వర్యూ ఇత్యధ్వర్యూ, సాదయతామ్, ఇహ, త్వా. [3]

పదార్థః :—(స్వైః)స్వకీయైః, (దక్షైః) బలైశ్చతురైర్భృత్యైర్వా (దక్షపితా)దక్షస్య బలస్య చతురాణాం భృత్యానాం వా పితా పాలకః(ఇహ)అస్మిన్ లోకే(సీద)(దేవానామ్)ధార్మికాణాం విదుషాం మధ్యే (సుమ్నే)సుఖే (బృహతే)మహతే (రణాయ)సంగ్రామాయ (పితేవ) (ఏధి)భవ(సూనవే)అపత్యాయ (ఆ) (సుశేవా) సుష్ఠుసుఖా (స్వావేశా) సుష్ఠు సమన్తాద్ వేశో యస్యాః సా (తన్వా)శరీరేణ (సమ్)ఏకీభావే(విశస్వ)(అశ్వినా)(అధ్వర్యూ)(సాదయతామ్)(ఇహ)(త్వా)త్వామ్.॥3॥ అన్వయః:—హే స్త్రి! త్వం యథా స్వైర్దక్షైః సహ వర్తమానో దేవానాం బృహతే రణాయ సుమ్నే దక్షపితా విజయేన వర్ధతే తథైహైధి సుమ్న ఆసీద పితేవ సూనవే సుశేవా స్వావేశా సతీ తన్వా సంవిశస్వ అధ్వర్యూ అశ్వినా త్వేహ సాదయతామ్. ॥3॥ భావార్థః :—అత్రోపమాలంకారః, స్త్రియో యుద్ధేఽపి పతిభిః సహ తిష్ఠేయుః. స్వకీయభృత్యపుత్రపశ్వాదీన్ పితర ఇవ పాలయేయుః, సదైవాత్యుత్తమై ర్వస్త్రభూషణైః శరీరాణి సంస్కృజ్య వర్తేరన్. విద్వాంసశ్చైవ మేతాః సదోపదిశేయుః స్త్రియోఽప్యేతాంశ్చ. ॥॥

పదార్థము :—ఓ స్త్రీ ! నీవు ఎటుల, స్వైః దక్షైః = స్వకీయబలముతోను భృత్యులతోను ఉండుచు. దేవానామ్ = ధర్మాత్ములగు విద్వాంసులమధ్య ఉండుచు, బృహతే రణాయ = పెద్దసంగ్రామమునకై, సుమ్నే = సుఖవిషయమున, దక్షపితా = బలములకు చతురులైన భృత్యులను పాలించువాడు విజయముతో ముందడుగు వేయుచున్నాడో అటులనే, ఇహ = ఈ లోకమధ్యమున, ఏధి = ముందడుగువేయుము. సుమ్నే = సుఖమునందు, అసీద = స్థిరురాలవు కమ్ము. పితేవ సూనవే = పుత్రునకై మంచిసుఖము చేకూర్చు తండ్రివలె, సుశేవా = సుందరసుఖయుక్తవై, స్వావేశా = మంచి ప్రేమతో సుందర శుద్ధశరీరవస్త్రాలంకారములధరించుచు స్వపతితోపాటు ప్రవేశ మొనర్చుదానవై, తన్వా = శరీరముతో ప్రవేశించుము. మఱియు, అధ్వర్యూ = గృహస్థాశ్రమాది యజ్ఞములను తనకై కోరుచున్న, అశ్వినా = చదివించువాడు ఉపదేశించువాడు, త్వా = నిన్ను, ఇహ = ఈగృహస్థాశ్రమమునందు, సాదయతామ్ = స్థితమొనర్చుదురుగాక ! ॥౩॥

భావార్థము :—ఉపమాలంకార మీ మంత్రమందున్నది. యుద్ధమునందు కూడ స్త్రీ తనభర్తవెంట ఉండవలయును. పశువులను భృత్యులను పుత్రులను తండ్రివలె రక్షించవలెను. నిత్యము శ్రేష్ఠ వస్త్రాభూషణములతో శరీరములను, సుసజ్జితమొనర్చుకొని మెలగవలయును. విద్వాంసులు వీరికి, వీరును విద్వాంసులకును నిరతముపదేశించవలయును, ॥౩॥ (౬౯౧)

---

౬౯౨ పృథివ్యాః పురీష మిత్యస్యోశనా ఋషిః, అశ్వినౌ దేవతే, స్వరాడ్బ్రాహ్మీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ, మఱల నవ్విషయమే యీ మంత్రమందు చెప్పబడుచున్నది

పృథివ్యాః పురీషమస్యప్సో నామ తాం త్వా విశ్వే అభి గృణన్తు దేవాః ।
స్తోమపృష్ఠా ఘృతవతీహ సీద ప్రజావదస్మే ద్రవిణా యజస్వ అశ్వినా
ధ్వర్యూ సాదయతామిహ త్వా ॥ ॥౪॥

పృథివ్యాః, పురీషమ్, అసి, అప్సః, నామ, తామ్, త్వా, విశ్వే, అభి, గృణన్తు, దేవాః, స్తోమపృష్ఠేతి స్తోమ+పృష్ఠా, ఘృతవతీతి ఘృతవతీ, ఇహ, సీద, ప్రజావదితి ప్రజావత్, అస్మే ఇత్యస్మే, ద్రవిణా, ఆ, యజస్వ, అశ్వినా అధ్వర్యూ ఇత్యధ్వర్యూ, సాదయతామ్ ఇహ, త్వా. [4]

పదార్థః:—(పృథివ్యాః)(పురీషమ్)పాలనమ్(అసి)(అప్సః)రూపమ్(నామ)ఆఖ్యామ్(తామ్)(త్వా) త్వామ్ (విశ్వే)సర్వే (అభి)(గృణన్తు)అర్చన్తు సత్కుర్వన్తు. గృణాతీత్యర్చతికర్మా. నిఘం. ౩.౧౪. (దేవాః)విద్వాంసః (స్తోమపృష్ఠా)స్తోమానాం పృష్ఠం జ్ఞీప్సా యస్యాః సా (ఘృతవతీ)ప్రశస్తాన్యాజ్యాదీని విద్యన్తే యస్యాః సా (ఇహ) గృహాశ్రమే (సీద) వర్తస్వ (ప్రజావత్)ప్రశస్తాః ప్రజా భవన్తి యస్మాత్తత్ (అస్మే)అస్మభ్యమ్(ద్రవిణా)ధనాని. అత్ర సుపాం సు లుగిత్యాకారాదేశః(ఆ)సమన్తాత్ (యజస్వ)దేహి(అశ్వినా)(అధ్వర్యూ) (సాదయతామ్) (ఇహ) సత్యే వ్యవహారే(త్వా)త్వామ్. ॥౪॥

అన్వయః :—హే స్త్రి ! యా స్తోమపృష్ఠా త్వమిహ పృథివ్యాః పురీషమప్సో నామ చ ఘృతవత్యసి తాం త్వా విశ్వే దేవా అభిగృణన్త్విహ సీద త్వాఽధ్వర్యూ అశ్వినేహాసాదయతాం సా త్వమస్మే ప్రజావద్ ద్రవిణా యజస్వ. ॥౪॥ భావార్థః :—యాః స్త్రియో గృహాశ్రమవిద్యాక్రియా కౌశలయో ర్విదుష్యః స్యస్తా ఏవ సర్వేభ్యః సుఖాని దాతు మర్హన్తి. ॥౪॥

పదార్థము :—ఓ స్త్రీ! స్తోమపృష్ఠా = స్తుతులనెఱుగగోరునట్టి యే నీవు, ఇహ = ఈ గృహాశ్రమమునందు, పృథివ్యాః పురీషమ్ = పృథివికి రక్షణపాలన, అప్సః = సుందరరూపము, నామ = పేరు, ఘృతవతీ అసి = ఘృతాది ప్రశంసిత పదార్థములతో గూడినదానవై యున్నావో, తామ్ త్వా = ఆ నిన్ను, విశ్వే దేవాః = విద్వాంసులు, అభిగృణంతు = సత్కరించుదురుగాక ! ఇహ = ఈ గృహాశ్రమమునందు, సీద = ఉండుము, మఱియు, త్వా = ఏ నిన్ను, అధ్వర్యూ = తమకై రక్షణీయమైన గృహాశ్రమాది యజ్ఞము నభిలషించువారగు, అశ్వినా = వ్యాపకబుద్ధిని వృద్ధిపఱచు [అధ్యాపకో]పదేశకులు, ఇహ = ఈ గృహశ్రమమునందు, సాదయతామ్ = నెలకొల్పుదురో ఆ నీవు,అస్మే = మాకై, ప్రజావత్ = ప్రశంసనీయ సంతానము కలుగుసాధనమును, ద్రవిణా = ధనమును, యజస్వ = ప్రసాదించుము. ॥౪॥

భావార్థము:—గృహాశ్రమ విద్యయందును విద్యాకౌశలమునందును విదుషీమణులైన స్త్రీలే సకల ప్రాణులకు సుఖము చేకూర్చగలరు. ॥౪॥ (౬౯౧)

౬౯౩ అదిత్యాస్త్వేత్యస్యోశనా ఋషిః, అశ్వినౌ దేవతే, స్వరాడ్బ్రాహ్మీ బృహతీ ఛందః, మధ్యమః స్వరః.

పునస్తమేవ విషయ మాహ. మఱల పూర్వోక్తవిషయమునే యీమంత్రమున చెప్పెను.

అదిత్యాస్త్వా పృష్ఠే సాదయామ్యన్తరిక్షస్య ధర్త్రీం విష్టంభనీం దిశామధిపత్నీం భువనానామ్ । ఊర్మిర్ద్రప్సో అపామసి విశ్వకర్మా త ఋషిరశ్వినాధ్వర్యూ సాదయతామిహ త్వా ॥ ॥౫॥

అదిత్యాః, త్వా, పృష్ఠే, సాదయామి, అన్తరిక్షస్య, ధర్త్రీమ్, విష్టంభనీమ్, దిశామ్, అధిపత్నీమిత్యధి + పత్నీమ్, భువనానామ్, ఊర్మిః, ద్రప్సః, అపామ్, అసి, విశ్వకర్మేతి విశ్వ+కర్మా, తే, ఋషిః, అశ్వినా, అధ్వర్యూ ఇత్యధ్వర్యూ, సాదయతామ్, ఇహ, త్వా. [5]

పదార్థః :—(అదిత్యాః) భూమేః(త్వా)త్వామ్(పృష్ఠే)ఉపరి (సాదయామి) స్థాపయామి(అన్తరిక్షస్య)అన్తరక్షయ విజ్ఞానస్య(ధర్త్రీమ్)(విష్టమ్భనీమ్) (దిశామ్)పూర్వాదీనామ్ (అధిపత్నీమ్)అధిష్ఠాతృత్వేన పాలయిత్రీమ్ (భువనానామ్) భవన్తి భూతాని యేషు తేషాం గృహాణామ్(ఊర్మిః)తరఙ్గ ఇవ (ద్రప్సః)హర్షః(అపామ్)జలానామ్(అసి)(విశ్వకర్మా) శుభాఖిలకర్మా (తే) తవ(ఋషిః)విజ్ఞాపకః పతిః (అశ్వినా)(అధ్వర్యూ)(సాదయతామ్)(ఇహ)(త్వా)త్వామ్. ॥౫॥ అన్వయః :—హే స్త్రి! య స్తే విశ్వకర్మర్షిః పతిరహ మన్తరిక్షస్య ధర్త్రీం దిశాం విష్టంభనీం భువనానా మధిపత్నీం సూర్యామివ త్వాదిత్యాః పృష్ఠే సాదయామి యోఽపామూర్మిరివ తే ద్రప్స ఆనన్దస్తేన యుక్తాసి తాం త్వేహాధ్వర్యూ అశ్వినా సాదయతామ్ ॥౫॥ భావార్థః :—అత్ర వాచక లుప్తోపమాలంకారః. యాః స్త్రియోఽక్షయసుఖకారిణ్యః ప్రసిద్ధదిక్కీర్తయో విద్వత్పతయః సదాఽనన్దితాః సన్తి తా ఏవ గృహాశ్రమధర్మపాలనోన్నతయే ప్రభవన్తి.

**మధుశ్చేతి మంత్రమారభ్యైతన్మంత్రపర్యన్తం వసన్తర్తుగుణవ్యాఖ్యానం ప్రాధాన్యేన కృతమితిజ్ఞేయమ్.**

పదార్థము :—ఓ స్త్రీ! తే = నీయొక్క, విశ్వకర్మా = సకలశుభకర్మలతో గూడినవాడను, ఋషిః = విజ్ఞానదాతనునగు పతిని యైన యే నేను, అంతరిక్షస్య = అంతఃకరణముయొక్క నాశరహితమగు విజ్ఞానమును, ధర్త్రీమ్ = ధరించునట్టిదానవు, దిశామ్ = పూర్వాదిదిక్కులకు, విష్టంభనీమ్ = ఆధారమవు, మఱియు, భువనానామ్ = సంతానోత్పత్తికి నిమిత్తమైన గృహముల, అధిపత్నీమ్ = అధిష్ఠాతవై పాలించుదానవునగు, త్వా = నిన్ను. సూర్యకిరణమువలె, పృథివ్యాః పృష్ఠే = పృథివిపైన, సాదయామి = గృహాధికారిణిగ స్థాపించుచున్నానో, ఏ నీవు. అపాం ఊర్మిః = జలతరంగములవలె, ద్రప్సః అసి = ఆనందయుక్తురాలవో, త్వా = ఆ నిన్ను, ఇహ = ఈగృహాశ్రమమునందు, అధ్వర్యూ = రక్షనిమిత్తమైన యజ్ఞమొనర్చువారు, అశ్వినా = విద్యయందు వ్యాప్తబుద్ధిగల యధ్యాపకుడు, ఉపదేశకుడు, సాదయతామ్ = నెలకొల్పుదురుగాక!

భావార్థము :—ఈమంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. అక్షయసుఖమును చేకూర్చువారును, ప్రసిద్ధదిగ్విఖ్యాతలునగు నే స్త్రీలు విద్వాంసులైన భర్తలతోకూడి ఆనందితలై యుందురో వారే గృహాశ్రమధర్మమును పాలించుటకు ఉన్నతిపఱచుటకు సమర్థురాండ్రు అగుచున్నారు.

పదమూడవ అధ్యాయములో చెప్పబడ్డ "మధుశ్చ"(౧౩-౨౫)మంత్రమునుండి ఇక్కడివఱకు వసంతర్తువు గుణములు ప్రాధాన్యముగ వ్యాఖ్యానించబడినవని గ్రహించవలయును. ॥౫॥ (౬౯౩)

---

౬౯౪ శుక్రశ్చేత్యస్యోశనా ఋషిః, గ్రీష్మర్తు ర్దేవతా, నిచృదుత్కృతి శ్ఛన్దః, షడ్జః స్వరః.
పునస్తమేవ విషయ మాహ. గ్రీష్మర్తువుయొక్క వ్యాఖ్యానము చెప్పబడినది.

శుక్రశ్చ శుచిశ్చ గ్రైష్మావృతూ అగ్నేర న్తఃశ్లేషో ఽసి కల్పేతాం ద్యావాపృథివీ కల్పన్తామాప ఓషధయః కల్పన్తామగ్నయః పృథఙ్మమ జ్యైష్ఠ్యాయ సవ్రతాః। యే అగ్నయః సమనసోఽన్తరా ద్యావా పృథివీ ఇమే గ్రైష్మావృతూ అభికల్పమానా ఇన్ద్రమివ దేవా అభిసంవిశన్తు తయా దేవతయాఽఙ్గిరస్వద్ ధ్రువే సీదతమ్॥

శుక్రః, చ, శుచిః, చ, గ్రైష్మౌ, ఋతూ, అగ్నేః, అన్తఃశ్లేష ఇత్యన్తః+శ్లేషః, అసి, కల్పేతామ్, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, కల్పన్తామ్, ఆపః, ఓషధయః, కల్పన్తామ్, అగ్నయః, పృథక్, మమ, జ్యైష్ఠ్యాయ, సవ్రతా ఇతి స+వ్రతాః, యే, అగ్నయః, సమనస ఇతి స+మనసః, అన్తరా, ద్యావాపృథివీ, ఇతి ద్యావా+పృథివీ, ఇమే ఇతీమే, గ్రైష్మౌ, ఋతూ ఇత్యృతూ, అభికల్పమానా ఇత్యభి+కల్పమానాః, ఇన్ద్రమివేతీన్ద్రమ్+ఇవ, దేవాః, అభిసంవిశన్త్విత్యభి+సంవిశన్తు, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువే ఇతి ధ్రువే, సీదతమ్. [6]

పదార్థః :—(శుక్రః)య ఆశు పాంసువర్షాత్ప్రతాపాభ్యా మన్తరిక్షం మలినం కరోతి స జ్యేష్ఠః (చ)(శుచిః)పవిత్రకారక ఆషాఢః(చ) (గ్రైష్మౌ)గ్రీష్మే భవౌ(ఋతూ) యావృచ్ఛత స్తౌ (అగ్నేః)

పావకస్య (అన్తఃశ్లేషః) మధ్యఆలిఙ్గనమ్(అసి)అస్తి (కల్పేతామ్)సమర్థయేతామ్(ద్యావాపృథివీ)ప్రకాశాన్తరిక్షే(కల్పన్తామ్)(ఆపః)జలాని(ఓషధయః)యవసోమాద్యాః (కల్పన్తామ్)(అగ్నయః) పావకాః (పృథక్)(మమ)(జ్యైష్ఠ్యాయ)అతిశయేన ప్రశస్యస్య భావాయ(సవ్రతాః)సత్యై ర్నియమైః సహవర్తమానాః(యే)(అగ్నయః)(సమనసః)మనసాసహ వర్తమానాః(అన్తరా)మధ్యే(ద్యావాపృథివీ)(ఇమే) (గ్రైష్మౌ)(ఋతూ)(అభికల్పమానాః)ఆభిముఖ్యేన సమర్థయన్తః(ఇన్ద్రమివ)యథా విద్యుతమ్(దేవాః) విద్వాంసః(అభిసంవిశన్తు)అభితః సమ్యక్ ప్రవిశన్తు(తయా)(దేవతయా)దివ్యగుణయా (అఙ్గిరస్వత్) అఙ్గానాం రసః కారణం తద్వత్(ధ్రువే)నిశ్చలే(సీదతమ్)విజానీతమ్. ॥౬॥ అన్వయః :—హే స్త్రీ పురుషౌ ! యథా మమ జ్యైష్ఠ్యాయ యౌ శుక్రశ్చ శుచిశ్చ గ్రీష్మావృతూ యయో రగ్నేరన్తః శ్లేషోఽస్యస్తి యాభ్యాం ద్యావా పృథివీ కల్పేతామాపః కల్పన్తామోషధయోఽగ్నయశ్చ పృథక్ కల్పన్తాం యథా సమనసః సవ్రతా అగ్నయోఽన్తరా కల్పన్తే తైర్ గ్రైష్మావృతూ అభికల్పమానా దేవా భవన్త ఇన్ద్రమివ తానగ్నీ నభిసంవిశన్తు తథా తయా దేవతయా సహ యువా మిమే ద్యావాపృథివీ ధ్రువే ఏతౌ చాఙ్గిరస్వత్ సీదతమ్. ॥౬॥ భావార్థః :—అత్రోపమాలంకారః. వసన్తర్తు వ్యాఖ్యానానన్తరం గ్రీష్మర్త్తుర్వ్యాఖ్యాయతే. హే మనుష్యాః యూయం యే పృథివ్యాదిస్థాః శారీరాత్మమానసాశ్చాగ్నయో వర్తన్తే యైర్వినా గ్రీష్మర్త్తుసంభవో న జాయతే తాం విజ్ఞాయోపయుజ్య సర్వేభ్యః సుఖం ప్రయచ్ఛత. ॥౬॥

పదార్థము :—ఓ స్త్రీపురుషులారా ! మమ = నాయొక్క, జ్యైష్ఠ్యాయ = ప్రశంసాయోగ్యమగుటకై, శుక్రః = ధూళివర్షముచేతను తీవ్రతాపముచేతను ఆకాశమును మలినమొనర్చు జ్యేష్ఠమాసము, చ = మఱియు, శుచిః = పవిత్రమునకు హేతువగు ఆషాఢమాసము, చ = ఈరెండుగలిసి, గ్రైష్మౌ ఋతూ = గ్రీష్మర్తువనబడుచున్నవి, [ఏరెంటిలో]అగ్నేః = అగ్నియొక్క, అన్తఃశ్లేషః అసి = మధ్యలో కఫరోగ నివారణమైయున్నదో, గ్రీష్మర్తుమాసముల వలన, ద్యావాపృథివీ = ప్రకాశము అంతరిక్షము. కల్పేతామ్ = సమర్థములగునో, ఆపః కల్పంతామ్ = జలములు సమర్థవంతములగునో, ఓషధయః = యవలు సోమలతాద్యోషధులు, అగ్నయః = విద్యుదాద్యగ్నులు, పృథక్కల్పంతామ్ = వేరువేరుగ సమర్థవంతములగునో, సమనసః = విచారశీలురు, సవ్రతాః = సత్యాచరణాది నియమయుతులు,అగ్నయః = అగ్నితుల్య తేజస్వులు నైనవారు, అంతరా = [మధ్యన సమర్థవంతులగుచున్నారో],[వానిచేత] గ్రైష్మీ ఋతూ = ఈ గీష్మర్తుమాసములను, అభికల్పమానాః = సమ్ముఖులై సమర్థించుచున్న విద్వాంసులు, ఇంద్రమివ = విద్యుత్తువలె నాయాయగ్నివిద్యలందు, అభిసంవిశంతు = ఎటుల అన్నివైపులనుండి చక్కగా ప్రవేశించెదరో, అటులనే, తయా దేవతయా = ఆ పరమేశ్వర దేవతతో మీరిరువురు, ఇమే ద్యావాపృథివీ ధ్రువే = నిశ్చలరూపములైన యీ ఆకాశ పృథువుల రెంటిని, అంగిరస్వత్ = అవయవముల కారణరూపమగు రసమువలె, సీదతమ్ = విశేషించి తెలుసుకొని యుందురుగాక! ॥౬॥

భావార్థము :—ఈ మంత్రమందుపమాలంకారమున్నది. వసంతర్తువ్యాఖ్యానానంతరము గ్రీష్మర్తువు వ్యాఖ్యానించబడుచున్నది. మానవులారా ! మీరు పృథివ్యాది పంచభూతములకు శరీరాత్మమనస్సులకు సంబంధించిన యే యగ్నులున్నవో, ఏవి లేనిదే గ్రీష్మర్తువు సంభవించదో వానినెఱిగి ఉపయోగమునకు తెచ్చి సకలప్రాణులకు సుఖము సమకూర్చుచుండుడు. ॥౬॥ (౬౯౪)

---

౬౯౫ సజూర్ఋతుభి రిత్యస్య విశ్వేదేవా ఋషయః, వస్వాదయో మంత్రోక్తా దేవతాః, సజూర్ఋతుభి రిత్యస్య భురిక్కృతి శ్ఛన్దః, ధైవతః స్వరః, సజూర్ఋతుభి రితి ద్వితీయస్య స్వరాట్ పఙ్క్తి శ్ఛన్దః, సజూర్ఋతుభి రితి తృతీయస్య నిచృదాకృతి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.

పున స్తమేవ విషయమాహ. ఈ మంత్రము నందా విషయమునే మరల చెప్పెను.

సజూర్ఋతుభిః సజూర్విధాభిః సజూ ర్దైవైః సజూర్వయోనాధై రగ్నయే త్వా వై శ్వాన రాయాశ్వినాధ్వర్యూ సాదయతామిహ త్వా। సజూర్ఋతుభిః సజూర్విధాభిః సజూర్వసుభిః సజూర్దైవై ర్వయోనాధై రగ్నయే త్వా వైశ్వానరాయాశ్వినా ధ్వర్యూ సాదయతామిహ త్వా సజూర్ఋతుభిః సజూర్విధాభిః సజూరుద్రైః సజూర్దైవైర్వయోనాధై రగ్నయే త్వా వై శ్వానరాయాశ్వినాధ్వర్యూ సాదయతామిహ త్వా సజూర్ఋతుభిః సజూర్విధాభిః సజూరాదిత్యైః సజూర్దైవైర్వయోనాధై రగ్నయే త్వా వై శ్వానరాయాశ్వినాధ్వర్యూ సాదయతా మిహ త్వా సజూర్ఋతుభిః సజూర్విధాభిః సజూ ర్విశ్వైర్దైవైః సజూర్దైవై ర్వయోనాధై రగ్నయే త్వా వై శ్వానరాయాశ్వినాధ్వర్యూ సాదయతా మిహ త్వా ॥౭॥

సజూరితి స + జూః, ఋతుభిరిత్యృతు + భిః, సజూరితి స + జూః, విధాభిరితి వి+ధాభిః, సజూరితి స+జూః, దైవైః, సజూరితి స+జూః, వయోనాధై రితి వయః+నాధైః, అగ్నయే, త్వా, వైశ్వానరాయ, అశ్వినా, అధ్వర్యూ ఇత్యధ్వర్యూ, సాదయతామ్, ఇహ, త్వా, సజూరితి స+జూః, ఋతుభి రిత్యృతు+భిః, సజూరితి స+జూః, విధాభి రితి వి+ధాభిః, సజూరితి స+జూః, వసుభి రితి వసు+భిః, సజూరితి స+జూః, దైవైః, వయోనాధై రితి వయః+నాధైః, అగ్నయే, త్వా, వైశ్వానరాయ, అశ్వినా, అధ్వర్యూ ఇత్యధ్వర్యూ, సాదయతామ్, ఇహ, త్వా, సజూరితి స+జూః, ఋతుభి రిత్యృతు+భిః స+జూరితి స + జూః, విధాభిరితి వి+ధాభిః, సజూరితి స+జూః రుద్రైః, సజూరితి స+జూః, దైవైః, వయోనాధై రితి వయః+నాధైః, అగ్నయే, త్వా, వైశ్వానరాయ, అశ్వినా, అధ్వర్యూ ఇత్యధ్వర్యూ, సాదయతామ్, ఇహ, త్వా, సజూరితి, స+జూః, ఋతుభిరిత్యృతు+భిః సజూరితి స+జూః, విధాభిరితి వి+ధాభిః, సజూరితి, స+జూః, ఆదిత్యైః, సజూరితి స + జూః, దైవైః వయోనాధై రితి వయః+నాధైః, అగ్నయే, త్వా, వైశ్వానరాయ, అశ్వినా, అధ్వర్యూ ఇత్యధ్వర్యూ, సాదయతామ్, ఇహ, త్వా, సజూరితి స+జూః, ఋతుభిరిత్యృతు+భిః, సజూరితి స+జూః, విధాభిరితి వి+ధాభిః, సజూ

రితి సజూః, విశ్వేః, దేవైః, సజూరితి స+జూః, దేవైః, వయోనాధై రితి, వయః+
నాధైః, అగ్నయే, త్వా, వైశ్వానరాయ, అశ్వినా, అధ్వర్యూ ఇత్యధ్వర్యూ,
సాదయతామ్, ఇహ, త్వా. [7]

పదార్థః :—(సజూః)యః సమానం ప్రీణాతి సేవతే వా (ఋతుభిః)వసన్తాదిభిశ్చ సహ (సజూః)(విధాభిః)అద్భిః(సజూః) (దేవైః)దివ్యైర్గుణైః (సజూః) దివ్యసుఖప్రదైః (వయోనాధైః) వయాంసి జీవనాదీని గాయత్ర్యాదిఛన్దాంసి వా నహ్యన్తి యైః ప్రాణైస్తైః (అగ్నయే) పావకాయ(త్వా) త్వామ్(వైశ్వానరాయ)అఖిలానాం పదార్థానాం నయనాయ ప్రాపణాయ(అశ్వినా) (అధ్వర్యూ) (సాదయతామ్)(ఇహ)(త్వా)త్వాం స్త్రియం పురుషం వా (సజూః)(ఋతుభిః)(సజూః)(విధాభిః)(సజూః) (వసుభిః)అగ్న్యాదిభిరష్టభిః(సజూః)(దేవైః)దివ్యైః (వయోనాధైః) వయాంసి విజ్ఞానాని నహ్యన్తి యై ర్విద్వద్భిః (అగ్నయే)విజ్ఞానాయ (త్వా)(వైశ్వానరాయ)విశ్వస్య సర్వస్య జగతో నాయకాయ (అశ్వినా)(అధ్వర్యూ)(సాదయతామ్)(ఇహ)(త్వా)(సజూః)(ఋతుభిః) (సజూః)(విధాభిః) వివిధాని వస్తూని దధతి యాభిః ప్రాణచేష్టాభి స్తాభిః(సజూః)(రుద్రైః)ప్రాణచేష్టాభిః తాభిః(సజూః) (రుద్రైః) ప్రాణాపానవ్యానోదాన సమాన నాగ కూర్మకృకల దేవదత్త ధనంజయ జీవైః (సజూః)(దేవైః)విద్వద్భిః(వయోనాధైః)వేదాదిశాస్త్ర ప్రజ్ఞాపనప్రబంధకైః(అగ్నయే)శాస్త్రవిజ్ఞానాయ(త్వా) (వైశ్వానరాయ) విశ్వేషాం నరాణామిదంసుఖసాధకం తస్మై (అశ్వినా) (అధ్వర్యూ)(సాదయతామ్) (ఇహ) (త్వా) (సజూః)(ఋతుభిః)సహచరితైః సుఖైః(సజూః)(విధాభిః)వివిధాభిఃసత్యక్రియాధారికాభిః క్రియాభిః(సజూః)(ఆదిత్యైః)సంవత్సరస్యద్వాదశమాసైః(సజూః)(దేవైః)పూర్ణవిద్యైః(వయోనాధైః)పూర్ణవిద్యావిజ్ఞానప్రచార ప్రబంధకైః (అగ్నయే)పూర్ణాయ విజ్ఞానాయ(త్వా) (వైశ్వానరాయ)విశ్వేషాం నరాణా మిదం పూర్ణసుఖసాధనం తస్మై (అశ్వినా)(అధ్వర్యూ)(సాదయతామ్)(ఇహ) (త్వా)(సజూః) (ఋతుభిః)సర్వైః కాలావయవైః (సజూః)(విధాభిః)సమస్తాభిః సుఖవ్యాపికాభిః (సజూః)(విశ్వైః) సమస్తైః (దేవైః)పరోపకారాయ సత్యాసత్యవిజ్ఞాపయితృభిః (సజూః) (దేవైః) (వయోనాధైః) యే వయః కామయమానం జీవనం నహ్యన్తి తైః (అగ్నయే)సుశిక్షాప్రకాశాయ (త్వా) (వైశ్వానరాయ) విశ్వేషాం నరాణామిదం హితం తస్మై (అశ్వినా)(అధ్వర్యూ)(సాదయతామ్) (ఇహ)(త్వా), ॥౭॥

అన్వయః :—హే స్త్రి ! పురుష వా యం త్వా త్వామిహాధ్వర్యూ అశ్వినా వైశ్వానరాయాగ్నయే సాదయతాం వయం చ యం త్వా సాదయేమ స త్వమృతుభిః సహ సజూర్విధాభిః సహ సజూర్దేవైస్సహ సజూర్వయోనాధైర్దేవైః సహ సజూశ్చ భవ. హేపురుషార్థయుక్తే స్త్రి వా పురుష! యం త్వా త్వామిహ వైశ్వానరాయాగ్నయే ఉధ్వర్యూ అశ్వినా సాదయతాం యం త్వా వయం చ సాదయేమ స త్వ మృతుభిః సహ సజూ ర్విధాభిః సహ సజూ ర్వసుభిః సహ సజూ ర్వయోనాధైర్దేవైః సహ చ సజూర్భవ. హే విద్యాధ్యయనాయ ప్రవృత్తే బ్రహ్మచారిణి వా బ్రహ్మచారిన్! యం త్వేహ వైశ్వానరాయాగ్నయే ఉధ్వర్యూ అశ్వినా సాదయతాం యం త్వా వయం చ సాదయేమ, స త్వమృతుభిః సహ సజూర్విధాభిః సహ సజూ రుద్రైః సహ సజూర్వయోనాధై ర్దేవైః సహ చ సజూర్భవ. హే పూర్ణవిద్యే స్త్రి! పురుష వా యం త్వేహ వైశ్వానరాయాగ్నయేఉధ్వర్యూ అశ్వినా సాదయతాం యం త్వా వయం చ సాదయేమ స త్వమృతుభిః సహ సజూ ర్విధాభిః సహ సజూరాదిత్యైః సహ సజూర్వయోనాధై ర్దేవైః సహ చ సజూర్భవ. హే సత్యార్థోపదేశికే స్త్రి! పురుష! వా యం త్వేహ వైశ్వాన

రాయాగ్నయే ఽధ్వర్యూ అశ్వినా సాదయతాం యం త్వా వయం చ సాదయేమ స
సహ సజూర్విధాభిః సహ సజూ ర్విశ్వై ర్దేవైః సహ సజూర్వయోనాధై ర్దేవైః సహ చ సజూర్భవ.

భావార్థః :—సిఅస్మిన్ జగతి మనుష్యజన్మ ప్రాప్య స్త్రియో విదుష్యః పురుషా విద్వాంసశ్చ భూత్వా యేషు బ్రహ్మచర్యవిద్యా సుశిక్షాగ్రహణాదిషు శుభేషు కర్మసు స్వయం ప్రవృత్తా భూత్వా యానన్యాన్ ప్రవర్త యేయు స్తైఽతి ప్రవర్తిత్వా పరమేశ్వర మారభ్య పృథివీపర్యన్తానాం పదార్థానాం యథార్థేన విజ్ఞానేనోపయోగం సంగృహ్య సర్వేష్వృతుషు స్వయం సుఖయ న్త్వన్యాంశ్చ. ॥౭॥

పదార్థము :—ఓ స్త్రీ లేక పురుషుడా! త్వా = ఏ నిన్ను, ఇహ = ఈ జగత్తునందు, అధ్వర్యూ = రక్షించువారైన, అశ్వినా = సకలవిద్యావ్యాపకులు అధ్యాపకోపదేశకులు నగు స్త్రీపురుషులు, వైశ్వానరాయ = సకలపదార్థముల ప్రాప్తికై, అగ్నయే = అగ్నివిద్యకై, సాదయతామ్ = నియుక్త మొనర్చెదరో, మరియు మేమును, త్వా = ఏ నిన్ను స్థాపించుదుమో ఆ నీవు, ఋతుభిః = వసంతవర్షాది ఋతువులతోపాటు, సజూః = ఒకేరకమైన తృప్తి లేక సేవ కలిగియున్న వారుగను, విధాభిః = జలములతో, సజూః = ప్రీతియుక్తులును, దేవైః = మంచిగుణములతో, సజూః = ప్రీతి కలిగినవారును, వయోనాధైః = జీవనాదులతో లేక గాయత్ర్యాదిఛందస్సులతో సంబంధమొనరించుటకు హేతువులు, దేవైః = దివ్యసుఖమిచ్చు నవియునగు ప్రాణములతోపాటు, సజూః = సమానముగ సేవన మొనర్చుచుండుడు. పురుషార్థపరుడైన పురుషుడా! లేక స్త్రీ! త్వా = ఏ నిన్ను ఇహ = ఈ గృహాశ్రమమునందు, వైశ్వానరాయ = సకలజగత్తుకు నాయకుడు, అగ్నయే = విజ్ఞానదాతయు నగు నీశ్వరుని ప్రాప్తికొఱకు, అధ్వర్యూ = రక్షకులు, అశ్వినా = సకలవిద్యలందు వ్యాప్తులునైన అధ్యాపకోపదేశకులు. సాదయతామ్ = స్థాపించెదరో. త్వా = ఏ నిన్ను మేము నియమించెదమో ఆ నీవు, ఋతుభిః = ఋతువులతోపాటు, సజూః = పురుషార్థులుగ. విధాభిః = వివిధపదార్థముల ధారణమునకు హేతువులగు ప్రాణముల చేష్టలతో, సజూః = సమానముగ సేవించువారలు, వసుభిః = అగ్న్యాద్యష్టవసువులతో, సజూః = ప్రీతియుక్తులు, వయోనాధైః = విజ్ఞానసంబంధము కలిగించు, దేవైః = సుందరవిద్వాంసులతో, సజూః = సమానప్రేమ గలవారు కండు, విద్యాభ్యాస ప్రవృత్తులైన బ్రహ్మచారిణీ లేక బ్రహ్మచారీ! త్వా = ఏ నిన్ను, ఇహ = ఈ బ్రహ్మచర్యాశ్రమములో, వైశ్వానరాయ = సకలమానవులకు సుఖసాధనమగు, అగ్నయే = శాస్త్రవిజ్ఞానమునకై, అధ్వర్యూ = పాలించువారు, అశ్వినా = పూర్ణవిద్వాంసులునగు నధ్యాపకోపదేశకులు, సాదయతామ్ = నియుక్త మొనర్చెదరో మఱియు, త్వా = ఏ నిన్ను మేము స్థాపించెదమో, ఆ నీవు, ఋతుభిః = ఋతువులతో, సజూః = అనుకూలముగ సేవించువారలు, విధాభిః = వివిధములైన పదార్థముల ధారణమునకు నిమిత్తములైన ప్రాణచేష్టలతో, సజూః = సమానప్రీతి కలిగినవారు, రుద్రైః = ప్రాణాపాన వ్యానోదాన సమాన నాగ కూర్మ కృకల దేవదత్త ధనంజయ జీవాత్మలతో, సజూః = అనుసరించి సేవజేయువారు, వయోనాధైః = వేదాదిశాస్త్రములను తెలియజేయుటకు ప్రబంధమొనర్చు, దేవైః = విద్వాంసులతో, సజూః = సమానప్రీతి కలిగినవారును గండు. పూర్ణవిద్యగల పురుషుడా లేక ఓ స్త్రీ! త్వా = ఏ నిన్ను, ఇహ = ఈ సంసారమునందు, వైశ్వానరాయ = సకలమానవుల పూర్ణసుఖమునకై, అగ్నయే = పూర్ణవిజ్ఞానముకై, అధ్వర్యూ = రక్షకులు, అశ్వినా = శీఘ్ర జ్ఞానదాతలునైన వారు, సాదయతామ్ = నియమించెదరో మఱియు, త్వా = ఏ నిన్ను మేము నియుక్తమొనర్చెదమో ఆ నీవు, ఋతుభిః = ఋతువులతోపాటు, సజూః = అనుకూలాచరణులు గలవారు, విధాభిః = వివిధ

సత్యక్రియలతో, సజూః = సమానప్రీతిగలవారు, ఆదిత్యైః = సంవత్సరపు పంద్రెండు నెలలతో. సజూః = అనుకూలాహార విహారములుగలవారు, వయోనాధైః = పూర్ణ విద్యావిజ్ఞాన ప్రచారముల ప్రబంధమొనర్చు, దేవైః = పూర్ణవిద్యావంతులగు విద్వాంసులపట్ల, సజూః = అనుకూల ప్రీతిగలవారు కండు. సత్యార్థముల నుపదేశించు స్త్రీ లేక పురుషుడా ! త్వా = ఏ నిన్ను, ఇహ = ఈ జగత్తునందు, వైశ్వానరాయ = సకలమానవులకు హితకరములగు,అగ్నయే = సుశిక్షలప్రకాశమునకై, అధ్వర్యూ = బ్రహ్మవిద్యారక్షకులగు, అశ్వినా = శీఘ్రబోధకుడు_ఉపదేశకుడు ఇరువురు, సాదయతామ్ = స్థితమొనర్చెదరో మఱియు. త్వా = ఏ మిమ్ము మేము నియతమొనర్చెదమో ఆ మీరు. ఋతుభిః = కాలక్షణాదిసకలావయవములతో, సజూః = అనుకూలముగ సేవించువారు, విధాభిః = సుఖములందు వ్యాపకములగు సకలక్రియలను, సజూః = అనుసరించువారు, విశ్వైః దేవైః = సత్యోపదేశకులగు పతులతో,సజూః = సమానప్రీతిగలిగియున్నవారు, వయోనాధైః = కామించబడు జీవనముతో సంబంధముకలిగించువారు, దేవైః = పరోపకారమునకై సత్యాసత్యములను తెలుపువారునగు ప్రజలతో, సజూః = సమానప్రీతిగలవారుగ కండు. ॥౭॥

భావార్థము :_ఈ సంసారమునందు మానవజన్మపొంది స్త్రీ పురుష లిరువురు విద్వాంసులైతామే బ్రహ్మచర్య విద్యాసుశిక్షాగ్రహణాదిశుభకర్మలందు ప్రవృత్తులై యితరుల నెవరిని ప్రవర్తింపజేయుదురో వారును అందు ప్రవృత్తులై పరమేశ్వరుని మొదలుకొనిపృథ్వీపర్యంత పదార్థములను యథార్థవిజ్ఞానముతో నుపయోగించి సకలర్తువులందు తాము సుఖించవలెను.ఇతరులనుసుఖింపజేయవలెను.

---

౮. ప్రాణమ్మ ఇత్యస్య విశ్వేదేవ ఋషిః, దంపతీ దేవతే, నిచృదతి జగతీ ఛన్దః, నిషాదః స్వరః.

పున స్తమేవ విషయ మాహ. మఱల నా విషయ మిందు చెప్పబడుచున్నది.

ప్రాణమ్మే పాహ్యపానమ్మే పాహివ్యానమ్మే పాహి చక్షుర్మ ఉర్వ్యా వి భాహి శ్రోత్రమ్మే శ్లోకయ । అపః పిన్వౌషధీ ర్జిన్వ ద్విపాదవ చతుష్పాత్పాహి దివో వృష్టిమేరయ॥

ప్రాణమ్, మే, పాహి, అపానమిత్యప+అనమ్, మే, పాహి వ్యానమితి వి+అనమ్, మే, పాహి, చక్షుః, మే, ఉర్వ్యాః, వి, భాహి, శ్రోత్రమ్, మే, శ్లోకయ, అపః, పిన్వ, ఓషధీః, జిన్వ, ద్విపాదితి ద్వి+పాత్, అవ, చతుష్పాత్, చతుః పాదితి చతుః+పాత్, పాహి, దివః, వృష్టిమ్, ఆ, ఈరయ. [8]

పదార్థః :_(ప్రాణమ్)నాభే రూర్ధ్వగామినమ్(మే)మమ(పాహి)రక్ష (అపానమ్) యో నాభే రర్వాగ్గచ్ఛతి తమ్ (మే)మమ (పాహి) (వ్యానమ్) యో వివిధేషు శరీరసంధిష్వనితి తమ్ (మే) (పాహి)(చక్షుః)నేత్రమ్ (మే)(ఉర్వ్యాః)బహురూపయోత్తమ ఫలప్రదయా పృథివ్యా సహ. ఉర్వీతి పృథివీ నా.. నిఘం. ౧.౧(వి)(భాహి)(శ్రోత్రమ్) (మే) (శ్లోకయ) శాస్త్రశ్రవణాయ సంబంధయ (అపః)ప్రాణాన్(పిన్వ)పుష్ణీహి సించ (ఓషధీః) సోమయవాదీన్ (జిన్వ)ప్రాప్నుహి, జిన్వతీతి గతికర్మా..నిఘం. ౨.౧౪.(ద్విపాత్) మనుష్యాదీన్ (అవ)రక్ష (చతుష్పాత్)గవాదీన్ (పాహి)(దివః) సూర్యప్రకాశాత్ (వృష్టిమ్) (ఆ)(ఈరయ) ప్రేరయ. ॥౮॥ అన్వయః :_ హే పతేః స్త్రీ పురుషః వా త్వముర్వ్యా సహ మే ప్రాణం పాహి, మేఽపానం పాహి, మే వ్యానం పాహి, మే

చక్షు ర్విభాహి, మే శ్రోత్రం శ్లోకయాపః పిన్వౌషధీ ర్జిన్వ ద్విపాదవ చతుష్పాత్ పాహి యథా సూర్యో దివో వృష్టిం కరోతి తథా గృహకృత్యమేరయ. ॥౮॥ భావార్థః :— అత్ర వాచక లుప్తోపమాలంకారః. స్త్రీ పురుషౌ స్వయంవరం వివాహం విధాయాతిప్రేమ్ణా పరస్పరం ప్రాణప్రి యాచరణం శాస్త్రశ్రవణ మోషధ్యాది సేవనం కృత్వా యజ్ఞాద్వృష్టిం చ కారయేతామ్. ॥౮॥

పదార్థము :— ఓ పతీ ! లేక పత్నీ! నీవు, ఉర్వ్యా = అనేకవిధములైన యుత్తమక్రియలతో, మే = నాయొక్క, ప్రాణమ్ = నాభినుండి పైకినడచు ప్రాణవాయువును, పాహి = రక్షించుము, మే అపానమ్ = నాభిక్రింద గుహ్యేంద్రియ మార్గమున వెడలు నా అపానవాయువును, పాహి = రక్షించుము, మే వ్యానమ్ = అనేక విధములైన సంధులందుండు నా వ్యానవాయువును, పాహి = రక్షించుము. మే చక్షుః = నానేత్రములను, విభాహి = ప్రకాశితమొనర్చుము. మే శ్రోత్రమ్ = నా కర్ణములను, శ్లోకయ = శాస్త్రశ్రవణములతో పూరించుము. అపః పిన్వ = ప్రాణములను బలపఱచుము, ఓషధీః = యవసోమలతాద్యోషధులను, జిన్వ = పొందుము, ద్విపాత్ = రెండుకాళ్లుగల మనుష్యాది ప్రాణులను, అవ = రక్షించుము. చతుష్పాత్ = నాలుగుకాళ్లుగల గవాదులను, పాహి = రక్షించుము. సూర్యుడెటుల, దివః = స్వప్రకాశముద్వారా, వృష్టిమ్ = వర్షించుచున్నాడో అటులనే గృహకార్యములను, ఏరయ = బాగుగ నిర్వహించుము. ॥౮॥

భావార్థము :— ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. స్త్రీ పురుషులు స్వయం వర వివాహమొనర్చుకొని అత్యంత ప్రేమతో పరస్పర ప్రాణ ప్రియాచరణము, శాస్త్రశ్రవ ణము, ఓషధి సేవనముల నొనర్చ వలెను. యజ్ఞానుష్ఠానముచే వర్షింపజేయవలెను. ॥౮॥ (౯౬౮)

ఉ౯ః మూర్ధా వయ ఇత్యస్య విశ్వే దేవా ఋషయః, ప్రాజాపత్యాదయో దేవతాః, పూర్వస్య నిచృద్బ్రాహ్మీ పంక్తి [శ్ఛన్దః, పఞ్చమః స్వరః], పురుష ఇత్యుత్తరస్య బ్రాహ్మీ పంక్తి శ్ఛందః, పఞ్చమః స్వరః.

పునస్తమేవ విషయమాహ. మఱల నా విషయ మిందు చెప్పెను.

మూర్ధా వయః ప్రజాపతి శ్ఛన్దః క్షత్రం వయో మయన్దం ఛన్దో విష్టమ్భో వయోఽధిపతిశ్ఛన్దో విశ్వకర్మా వయః పరమేష్ఠీ ఛన్దో వస్తో వయో విబలం ఛన్దో వృష్ణి ర్వయో విశాలం ఛన్దః పురుషో వయస్తన్ద్రం ఛన్దో వ్యాఘ్రోవయోఽనాధృష్టం ఛన్దః సింహో వయశ్ఛదిశ్ఛన్దః పష్ఠవాడ్వయో బృహతీ ఛన్ద ఉక్షా వయః కకుప్ ఛన్ద ఋషభో వయః సతో బృహతీ ఛన్దః ॥ ॥౯॥

మూర్ధా, వయః, ప్రజాపతి రితి ప్రజా+పతిః, ఛన్దః, క్షత్రమ్, వయః, మయన్దమ్, ఛన్దః, విష్టమ్భః, వయః, అధిపతిరిత్యధి+పతిః, ఛన్దః, విశ్వకర్మేతి విశ్వ+కర్మా, వయః, పరమేష్ఠీ, పరమేష్ఠీతి పరమే+స్థీ, ఛన్దః, వస్తః, వయః, విబలమితి వి+బలమ్, ఛన్దః, వృష్ణిః, వయః, విశాలమితి వి+శాలమ్, ఛన్దః, పురుషః

వయః, తన్ద్రిమ్, ఛన్దః, వ్యాఘ్రః, వయః, అనాధృష్టమ్, ఛన్దః, సింహః, వయః, ఛదిః, ఛన్దః, పష్ఠవాడితి పష్ఠ+వాట్, వయః, బృహతీ, ఛన్దః, ఉక్షా, వయః, కకుప్, ఛన్దః, ఋషభః, వయః, సతోబృహతీతి సతః+బృహతీ, ఛన్దః. [౯]

పదార్థః:—(మూర్ధా) మూర్ధావదుత్తమం బ్రాహ్మణకులమ్ (వయః) కమనీయమ్ (ప్రజాపతిః) ప్రజాపాలకః (ఛన్దః) విద్యాధర్మశమాదికర్మ (క్షత్రమ్) క్షత్రియకులమ్ (వయః) న్యాయవినయపరాక్రమవ్యాప్తమ్ (మయన్దమ్)యన్మయం సుఖం దదాతి తత్ (ఛన్దః)బలయుక్తమ్ (విష్టమ్భః) విశో వైశ్యస్య విష్టమ్భో రక్షణం యేన (వయః) ప్రజనకః (అధిపతిః) అధిష్ఠాతా (ఛన్దః) స్వాధీనః (విశ్వకర్మా) అఖిలోత్తమకర్మకర్తా రాజా (వయః) కమితా (పరమేష్ఠీ) సర్వేషాం స్వామీ (ఛన్దః) స్వాధీనః (వస్తః) వ్యవహారైరాచ్ఛాదితో యుక్తః (వయః) వివిధవ్యవహారవ్యాపీ(విబలమ్) వివిధం బలం యస్మాత్ (ఛన్దః) (వృష్ణిః) సుఖసేచకః (వయః) సుఖప్రాపకమ్ (విశాలమ్) విస్తీర్ణమ్ (ఛన్దః) స్వాచ్ఛన్ద్యమ్ (పురుషః) పురుషార్థయుక్తః (వయః) కమనీయం కర్మ(తన్ద్రమ్) కుటుమ్బధారణమ్. అత్ర తత్రి కుటుమ్బధారణ ఇత్యస్మాదచ్ వర్ణవ్యత్యయేన తస్య దః(ఛన్దః) బలమ్(వ్యాఘ్రః) యో వివిధాన్ సమన్తాజ్జిఘ్రతి (వయః) కమనీయమ్ (అనాధృష్టమ్)ధార్ష్ట్యమ్(ఛన్దః)బలమ్ (సింహః) యో హినస్తి పశ్వాదీన్ సః (వయః) పరాక్రమమ్ (ఛదిః)అపవారణమ్ (ఛన్దః) ప్రదీపనమ్ (పష్ఠవాట్) యః పష్ఠేన పృష్ఠేన వహత్యుష్ట్రాదిః—వర్ణవ్యత్యయేన ఋకారస్యాత్రాకారదేశః (వయః) బలవాన్ (బృహతీ) మహత్త్వమ్ (ఛన్దః)పరాక్రమమ్ (ఉక్షా) సేచకో వృషభః (వయః) బలిష్ఠః (కకుప్) దిశః (ఛన్దః) ఆనన్దమ్ (ఋషభః) గతిమాన్ పశుః (వయః)బలిష్ఠః (సతోబృహతీ) (ఛన్దః) స్వాతంత్ర్యమ్. ॥౯॥ అన్వయః :—హే స్త్రి! పురుష వా మూర్ధా ప్రజాపతిరివ త్వం వయో మయన్దం ఛన్దః క్షత్రమేరయ విష్టమ్భోఽధిపతి రివ త్వం వయశ్ఛన్దః ఏరయ విశ్వకర్మా పరమేష్ఠీవ త్వం వయశ్ఛన్ద ఏరయ వస్త ఇవ త్వం వయో విబలం ఛన్ద ఏరయ. వృష్ణిరివ త్వం విశాలవయ శ్ఛన్ద పురుష ఇవ త్వం వయస్తన్ద్రం ఛన్ద ఏరయ వ్యాఘ్రఇవ త్వం వయోఽనాధృష్టం ఛన్ద ఏరయ సింహ ఇవ త్వం వయశ్ఛదిశ్ఛన్ద ఏరయ పష్ఠవాడివ త్వం బృహతీ వయశ్ఛన్ద ఏరయోక్షేవ త్వం వయః కకుప్ఛన్ద ఏరయ, ఋషభ ఇవ త్వం వయః సతో బృహతీ ఛన్ద ఏరయ ప్రేరయ, ॥౯॥ భావార్థః :— అత్ర శ్లేషవాచకలుప్తోమాలంకారౌ. ఏరయేతి పూర్వస్మాన్మన్త్రాదనువర్తతే. స్త్రీ పురుషై ర్బ్రాహ్మణాదివర్ణాన్ స్వచ్ఛన్దాన్ సంపాద్య వేదాదీన్ ప్రచార్యాలస్యాదికం త్యక్త్వా శత్రూన్నివార్య మహద్బలం సదా వర్ధనీయమ్. ॥౯॥

పదార్థము :—ఓ స్త్రీ! లేక పురుషుడా! మూర్ధా = శిరస్తుల్యమైన యుత్తమ బ్రాహ్మణవంశము, ప్రజాపతిః = ప్రజారక్షకుడైన రాజువంటివాడవునగు నీవు. వయః = కామించదగినది. మయందమ్ = సుఖదాయకము, ఛందః = బలయుక్తమునగు, క్షత్రమ్ = క్షత్రియకులమును ప్రేరేపించుము. విష్టంభః = వైశ్యులరక్షణకు హేతువవు, అధిపతిః = అధిష్ఠాతయైన నృపునివంటి వాడవునగు నీవు, వయః = న్యాయవినయములను పొందిన, ఛందః = స్వచ్ఛందపురుషుని ప్రేరేపించుము. విశ్వకర్మా = సకలఉత్తమకర్మల నొనర్చువాడవు, పరమేష్ఠీ = అందఱికి రాజువునైన నీవు,వయః ఛందః = కామించదగిన స్వతంత్రమును, ఏరయ = వృద్ధిపఱచుము. వస్తః = వ్యవహారకుశలునితో తుల్యుడ

వైన నీవు, వయః విబలమ్ = అనేకవిధముల వ్యవహారములందు వ్యాపకము. వివిధబలములకు హేతువునగు, ఛందః = ఆనందమును పెంపొందజేయుము. వృష్ణిః = సుఖవృష్టిగురిపించు వానివలెనున్న నీవు, విశాలమ్ వయః = విస్తారయుక్తము సుఖదాయకమునగు, ఛందః = స్వతంత్రమును వృద్ధిపఱచుము, పురుషః = పురుషార్థునివలెనున్న నీవు, వయః తంద్రమ్ = కోరదగిన కుటుంబ ధారణ రూపకర్మను మఱియు, ఛన్దః = బలమును వృద్ధిపఱచుము. వ్యాఘ్రః = వివిధపదార్థములను చక్కగ నాఘ్రాణించు వ్యాఘ్రజంతువువలె నుండు రాజువైన నీవు. వయః = కోరదగిన, అనాధృష్టమ్ = దృఢమైన, ఛందః = బలమును పెంచుము. సింహః = పశ్వాదులను హింసించు సింహమువలె పరాక్రమవంతుడవు రాజువు నగు నీవు, వయః = పరాక్రమముతోపాటు, ఛదిః = నిరోధమును. ఛందః = ప్రకాశమును పెంపొందించుము. పష్ఠవాట్ = వీపుమీద బరువులు మోయు ఒంటెవలెనున్న వైశ్యుడవైననీవు, బృహతీ = గొప్ప, వయః = బలయుక్తమగు. ఛందః = పరాక్రమమును ప్రేరేపించుము. ఉక్షా = సించన మొనర్చు వృభమువలెనున్న శూద్రుడవైననీవు; వయః = అతిబలమునకు హేతువగు, కకుప్ = దిక్కులను, ఛందః = ఆనందమును వృద్ధిపఱచుము. ఋషభః = శీఘ్రగంతయైన పశువువలెనున్న భృత్యుడవగునీవు, వయః = బలముతో, సతోబృహత్ = ఉత్తమమైన గొప్ప, ఛందః = స్వతంత్రమును ప్రేరేపించుము. ॥౯॥

భావార్థము :—ఈమంత్రమందు వాచకలుప్తోపమాలంకారము లున్నది. ఏరయ అను పదము [పూర్వమంత్రమునుండి] అనువృత్తమైనది. స్త్రీ పురుషులు బ్రాహ్మణాదివర్ణములను స్వచ్ఛందములుగ నొనర్చి, శాస్త్రముల ప్రచారమొనర్చి, ఆలస్యాదుల త్యజించి శత్రువులను నివారించి గొప్పబలమును సదా పెంపొందజేయవలెను. ॥౯॥ (౧౪.౯)

---

౧౪.౧౦ అనడ్వానిత్యస్య విశ్వేదేవ ఋషిః, విద్వాంసో దేవతాః, స్వరాడ్బ్రాహ్మీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
పునస్తమేవ విషయ మాహ. మఱల నావిషయ మిందు చెప్పెను.

అనడ్వాన్వయః పంక్తిశ్ఛన్దో ధేనుర్వయో జగతీ ఛన్దస్త్ర్యవి ర్వయస్ త్రిష్టుప్ ఛన్దో దిత్యవాడ్ వయో విరాట్ ఛన్దః పంచావి ర్వయో గాయత్రీ ఛన్దస్త్రివత్సో వయ ఉష్ణిక్ ఛన్ద స్తుర్యవాడ్ వయో ఽనుష్టుప్ ఛన్దః ॥ ॥౧౦॥

అనడ్వాన్, వయః, పంక్తిః, ఛన్దః, ధేనుః, వయః, జగతీ, ఛన్దః, త్రి+అవిః, వయః, త్రిష్టుప్, త్రిస్తుబితి త్రి+స్తుప్, ఛన్దః, దిత్యవాడితి దిత్య+వాట్, వయః, విరాడితి వి+రాట్, ఛన్దః, పఞ్చావిరితి పఞ్చ+అవిః, వయః, గాయత్రీ, ఛన్దః, త్రివత్స ఇతి త్రి+వత్సః, వయః, ఉష్ణిక్, ఛన్దః, తుర్యవాడితి తుర్య+వాట్, వయః, అనుష్టుప్, అనుస్తుబిత్యను+స్తుప్, ఛన్దః. [10]

పదార్థః :—(అనడ్వాన్) వృషభః (వయః) (బలమ్) (పంక్తిః) (ఛన్దః) (ధేనుః) దుగ్ధప్రదా (వయః) కామనామ్ (జగతీ) జగదుపకారకమ్ (ఛన్దః) ఆహ్లాదనమ్ (త్ర్యవిః) త్రయోఽవ్యాదయో యస్మాత్తమ్ (వయః) ప్రజననమ్ (త్రిష్టుప్) త్రీణి కర్మోపాసనాజ్ఞానాని స్తువన్తి యయా సా (ఛన్దః)

(వాట్) ఋణమ్నైర్న్రిర్వర్తన్తాన్ యవాదీన్ వహతి (వయః) ప్రాపణమ్ (విరాట్) (ఛన్దః) ఆనన్దకరమ్ (పంచావిః) పంచేన్ద్రియాణ్యవన్తి యేన సః (వయః) విజ్ఞానమ్ (గాయత్రీ) (ఛన్దః) (త్రివత్సః) త్రయః కర్మోపాసనాజ్ఞానాని వత్సా ఇవ యస్య సః (వయః) పరాక్రమమ్ (ఉష్ణిక్)యద్ దుఃఖాని దహతి తత్ (ఛన్దః) (తుర్యవాట్) తుర్యాన్ చతురో వేదాన్ వహతి యేన సః (అనుష్టుప్) అనుస్తౌతి యయా సా (ఛన్దః) సుఖసాధకమ్. అత్ర పూర్వవత్ మన్త్రత్రయ ప్రతీకాని లోకన్తా ఇన్ద్రి[౧౨.౫౪.౫౮]మితి లిఖితాని నివారితాని. ॥౧౦॥ అన్వయః :—హే స్త్రీ పురుష వాఽనడ్వానివ త్వం పంక్తిశ్ఛన్దో వయ ఏరయ, ధేను రివ త్వం జగతీ ఛన్దో వయ ఏరయ, త్ర్యవి రివ త్వం త్రిష్టుప్ ఛన్దో వయ ఏరయ, దిత్యవాడివ త్వం విరాట్ ఛన్దో వయ ఏరయ, పంచావి రివ త్వం గాయత్రీ ఛన్దో వయ ఏరయ, త్రివత్స ఇవ త్వముష్ణిక్ ఛన్దో వయ ఏరయ, తుర్యవాడివ త్వమనుష్టుప్ఛన్దో వయ ఏరయ. ॥౧౦॥ భావార్థః :—అత్ర శ్లేషవాచక లుప్తోపమాలంకారౌ. ఏరయ పదాను వృత్తిశ్చ. యథాఽనడుహాదీనాం రక్షణేన కృషీవలా అన్నాదీన్యుత్పాద్య సర్వాన్ సుఖయన్తి తథైవ విద్వాంసః స్త్రీ పురుషా విద్యాః ప్రచార్య సర్వా నానన్దయన్తి. ॥౧౦॥

పదార్థము :— ఓ స్త్రీ లేక పురుషుడా! అనడ్వాన్ = ఎద్దువలె బలవంతుడవై నీవు, పంక్తి = ప్రకటితము, ఛందః = స్వతంత్రముసునగు, వయః = బలమును ప్రేరేపించుము, ధేనుః = పాడియావువలె నీవు,జగతీ = జగత్తునకుపకారకమగు,ఛందః = ఆనందముయొక్క, వయః = కామనను పెంపొందించుము, త్ర్యవిః = మూడు-మేకలు, గొఱ్ఱెలు, ఆవులుగల వానివలె బుద్ధిమంతుడవై నీవు, త్రిష్టుప్ = జ్ఞానకర్మోపాసనముల స్తుతికి హేతువగు, ఛందః = స్వతంత్రమును, వయః = ఉత్పత్తిని వృద్ధియొనర్చుము, దిత్యవాడ్ = భూమిని త్రవ్వుటచే నుత్పన్నమగు యవాదిధాన్యములను లభింపజేయు క్రియవలె నీవు, విరాట్ = వివిధప్రకాశయుక్తము, ఛందః = ఆనందకారకమునగు, వయః = ప్రాప్తిని వృద్ధిపఱచుము.పంచావిః = పంచేంద్రియముల రక్షణకు హేతువగు నోషధివలె నీవు, గాయత్రీ = గాయత్రి, ఛందః = మంత్రముయొక్క, వయః = జ్ఞానమును పెంపొందించుము. త్రివత్సః = జ్ఞానకర్మోపాసనలు కోరువానివలె నీవు. ఉష్ణిక్ = దుఃఖముల నాశకము, ఛందః = స్వతంత్రమునగు, వయః = పరాక్రమమును పెంపొందించుము, తుర్యవాట్ = నాలుగువేదములను లంభిపజేయువానివలె నీవు, అనుష్టుప్ = అనుకూలస్తుతికి నిమిత్తము. ఛందః = సుఖసాధకమునగు, వయః = వాంఛను ప్రతిదినము వృద్ధిపఱచు చుండుము. ॥౧౦॥

భావార్థము :—ఈమంత్రమునందు శ్లేషాలంకారము, వాచకలుప్తోపమాలంకారము లున్నవి. వ్యవసాయ మొనర్చువారు వృషభాదిసాధనముల రక్షణచే నన్నాది పదార్థముల నుత్పన్న మొనర్చి అందఱికి నెటుల సుఖము నిచ్చుచున్నారో అటులనే విద్వాంసులు విద్యను ప్రచారమొనర్చి సకల ప్రాణుల కానందము చేకూర్చు చున్నారు. ॥౧౦॥ (౯౯౦॥

---

ఇన్ద్రాగ్నీ ఇత్యస్య విశ్వేదేవా ఋషయః, ఇన్ద్రాగ్నీ దేవతే, భురిగనుష్టుప్ ఛన్దః, గాన్ధారః స్వరః
పునస్తమేవ విషయ మాహ. మఱల నా విషయము నిందు జెప్పెను,

ఇన్ద్రాగ్నీ అవ్యథమానామిష్టకాం దృꣳహతం యువమ్ ।
పృష్ఠేన ద్యావాపృథివీ అన్తరిక్షం చ వి బాధసే ॥ ॥౧౧

ఇన్ద్రాగ్నీ ఇతీన్ద్రాగ్నీ, అవ్యథమానామ్, ఇష్టకామ్, దృꣳహతమ్, యువమ్,

పృష్ఠేన, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, అన్తరిక్షమ్, చ, వి, బాధసే.

పదార్థః :-(ఇన్ద్రాగ్నీ) ఇన్ద్రో విద్యుచ్చాగ్నిః సూర్యశ్చైవ (అవ్యథమానామ్) అపీడితా మచలితామ్ (ఇష్టకామ్) ఇష్టం కర్మ యస్యాస్తామ్(దృంహతమ్)వర్ధేతామ్ (యువమ్) యువామ్(పృష్ఠేన) (ద్యావాపృథివీ) ప్రకాశభూమీ (అన్తరిక్షమ్)ఆకాశమ్ (చ) (వి)(బాధసే)॥౧౧॥ అన్వయః :- హే ఇన్ద్రాగ్నీ ఇవ వర్తమానౌ స్త్రీ పురుషౌ! యువం యువా మవ్యథమానాం ప్రజ్ఞాం ప్రాప్యేష్టకా మివ గృహాశ్రమం దృంహతమ్, యథా ద్యావాపృథివీ పృష్ఠేనా న్తరిక్షం బాధేతే తథా దుఃఖాని శత్రూంశ్చ బాధేథామ్. హే పురుష! యథా త్వ మేతస్యాః స్వపత్న్యాః పీడాం విబాధసే తథా చేయ మపి తవ పీడాం బాధతామ్. ॥౧౧॥ భావార్థః :-అత్ర శ్లేష వాచకలుప్తోప మాలంకారౌ. యథా విద్యుత్సూర్యావపో వర్షిత్వౌషధ్యాదీన్ వర్ధయత స్తథైవ స్త్రీ పురుషౌ కుటుంబం వర్ధయేతామ్. యథా ప్రకాశః పృధివీ ఆకాశమాచ్ఛాదయత స్తథైవ గృహాశ్రమ వ్యవహారమలంకుర్యాతామ్. ॥౧౧॥

పదార్థము :-ఇంద్రాగ్నీ = విద్యుత్సూర్యులవలె మెలగు నో స్త్రీ పురుషులారా! యువమ్ = మీ రిరువురును, అవ్యథమానామ్ = నిశ్చలబుద్ధినిపొంది, ఇష్టకామ్ = ఇటుకవలె నున్న గృహాశ్రమమును, దృంహతమ్ = దృఢమొనర్చుడు, ద్యావాపృధివీ = ఎటుల ప్రకాశము భూమి, పృష్ఠేన = వీపుతో ఆకాశమును కట్టివేయుచున్నవో అటులనే దుఃఖములను శత్రువులను కట్టివేయుడు. ఓ పురుషుడా! ఎటుల నీవు నీ యీ స్త్రీయొక్క పీడను, విబాధసే = విశేషించి తొలగించుచున్నావో అటులనే యీ స్త్రీయు నీ సకలబాధలను హరింపజేయుచుండును గాక! ॥౧౧॥

భావార్థః :-ఈ మంత్రమునందు శ్లేషవాచకలుప్తోపమాలంకారములున్నవి, ఎటుల విద్యుత్సూర్యులు జలవర్ష ఓషధులను పెంపొందజేయుచున్నవో అటులనే స్త్రీ పురుషులు కుటుంబమును వృద్ధి జేయవలయును. ప్రకాశము పృధివి రెండు ఎటుల ఆకాశమును ఆవరించుచున్నవో అటులనే గృహాశ్రమ వ్యవహారములను పూర్ణమొనర్చుడు, ॥౧౧॥ (౬౬౯)

౨౦౦ విశ్వకర్మేత్యస్య విశ్వకర్మర్షిః, వాయు ర్దేవతా, విప్రుతి శ్ఛన్దః, మధ్యమః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మరల నావిషయమే ఈ మంత్ర మందు జెప్పెను.

విశ్వకర్మా త్వా సాదయత్వ న్తరిక్షస్య పృష్ఠే వ్యచస్వతీం ప్రథస్వతీ మన్తరిక్షం యచ్ఛా న్తరిక్షం దృꣳహా న్తరిక్షం మా హిꣳసీః । విశ్వస్మై ప్రాణాయాఽపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై చరిత్రాయ వాయుష్ట్వాఽభిఽపాతు మహ్యా స్వస్త్యా ఛర్దిషా శన్తమేన తయా దేవతయాఙ్గిరస్వద్ ధ్రువా సీద ॥ ॥౧౨॥

విశ్వకర్మేతివిశ్వ+కర్మా, త్వా, సాదయతు, అంతరిక్షస్య, పృష్ఠే, వ్యచస్వతీమితి వ్యచః+వతీమ్, ప్రథస్వతీమ్, అంతరిక్షమ్, యచ్ఛ, అన్తరిక్షమ్, దృꣳహ, అంతరిక్షమ్, మా, హిꣳసీః,విశ్వస్మై,ప్రాణాయ,అపానాయ,వ్యానాయ,ఉదానాయ, ప్రతిష్ఠాయై, చరిత్రాయ, వాయుః, త్వా, అభి, పాతు, మహ్యా, స్వస్త్యా, ఛర్దిషా,

శ న్తమేన, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువా, సీద. [12]

పదార్థః :-(విశ్వకర్మా) అఖిలశుభక్రియాకుశలః (త్వా) త్వామ్ (సాదయతు) సంస్థాపయతు (అన్తరిక్షస్య)ఆకాశస్య (పృష్ఠే) భాగే (వ్యచస్వతీమ్) ప్రశ స్తః వ్యచో విజ్ఞానం సత్కారణం విద్యతే యస్యా స్తామ్ (ప్రథస్వతీమ్)ఉత్తమవి స్తీర్ణ విద్యాయుక్తామ్(అన్తరిక్షమ్) జలమ్. అ న్తరిక్షమిత్యుదక నామ, నిఘం, ౧.౧౨, (యచ్ఛ) (అన్తరిక్షమ్)ప్రశ స్తం శోధితముదకమ్(దృంహ) (అన్తరిక్షమ్) మధురాదిగుణయుక్తం రోగనాశకముదకమ్ (మా) (హింసీః)హింస్యాః (విశ్వస్మై) సమగ్రాయ (ప్రాణాయ) (అపానాయ) (వ్యానాయ) (ఉదానాయ) (ప్రతిష్ఠాయై) (చరిత్రాయ) శుభకర్మాచారాయ (వాయుః) ప్రాణ ఇవ (త్వా) (అభి) (పాతు)(మహ్యా)మహత్యా(స్వస్త్యా) సుఖక్రియయా (ఛర్దిషా) ప్రకాశేన (శ న్తమేన) అతిశయేన సుఖకారకేణ (తయా) (దేవతయా) దివ్యసుఖప్రదానక్రియయా సహ (అఙ్గిరస్వత్) సూత్రాత్మవాయువత్ (ధ్రువా) నిశ్చలజ్ఞానయుక్తా (సీద) స్థిరా భవ. ॥౧౨॥

అన్వయః:-హే స్త్రి! విశ్వకర్మా పతి ర్యాం వ్యచస్వతీం ప్రథస్వతీ మ న్తరిక్షస్య పృష్ఠే త్వా సాద యతు, సా త్వం విశ్వస్మై ప్రాణాయాపానాయ వ్యానాయోదానాయ ప్రతిష్ఠాయై చరిత్రాయా న్తరిక్షం యచ్ఛాఽ న్తరిక్షం దృంహా న్తరిక్షం మా హింసీః యో వాయుః ప్రాణ ఇవ ప్రియ స్తవ స్వామి మహ్యా స్వస్త్యా ఛర్దిషా శ న్త మేన త్వామభిపాతు సా త్వం తయా పత్యాఖ్యయా దేవతయా సహాఙ్గిరస్వద్ ధ్రువా సీద. ॥౧౨॥ భావార్థః :-అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా పురుషః స్త్రియం సత్కర్మసు నియోజయే త్తథా స్త్ర్యపి స్వపతిం చ ప్రేరయేత్,యతః సతతమానన్దో వర్ధేత. ॥౧౨॥

పదార్థము :-ఓ స్త్రీ! విశ్వకర్మా = సంపూర్ణశుభకర్మలొనర్చుటయందు కుశలుడైనపతి. వ్యచ స్వతీమ్ = ప్రశంసిత విజ్ఞానము లేక సత్కారముతో కూడిన దానవు,ప్రథస్వతీమ్ = ఉత్తమవి స్తృత విద్యావతివియునగు, త్వా = ఏ నిన్ను, అంతరిక్షస్య పృష్ఠే = ప్రకాశముయొక్క ఒకభాగములో, సాదయతు = స్థాపించునో ఆనీవు, విశ్వస్మై ప్రాణాయ అపానాయ = సమస్తప్రాణాపాన వ్యానో దాన రూపశరీరస్థ సకల వాయువులకై, ప్రతిష్ఠాయై = ప్రతిష్ఠకొఱకు, చరిత్రాయ = శుభకర్మాచర ణలకొఱకు, అంతరిక్షమ్ = జలాదులను, యచ్ఛ = ఒసగుము [వినియోగించుము], అంతరిక్షమ్ దృంహ = ప్రశంసితము శుద్ధమునగు జలముతో కూడిన అన్నధనాదులను = వృద్ధి పఱచుము. అంతరిక్షమ్ = మాధుర్యాది గుణయుక్తములు రోగనాశకములునగు ఆకాశస్థ సకల పదార్థములను. మా హింసీః = నశింపజేయకుము. త్వా = ఏ నిన్ను, వాయుః = ప్రాణప్రియుడగుపతి, మహ్యా స్వస్త్యా = సుఖరూపమైన క్రియతోను, ఛర్దిషా = ప్రకాశముతోను, శంతమేన = అతిసుఖదాయక మైన విజ్ఞానముతోను అభిపాతు = అన్నివైపులనుండి రక్షించునో, ఆ నీవు, తయా దేవతయా = ఆదివ్యసుఖము చేకూర్చుక్రియను గలిగియున్న పతిదేవతతో, అంగిరస్వత్ = వ్యాపకవాయువు వలె, ధ్రువా = నిశ్చలజ్ఞానయుక్తురాలవై, సీద = స్థిరముగ నుండుము. ॥౧౨॥

భావార్థము :-ఈ మంత్రమున శ్లేష వాచకలుప్తోపమాలంకారము లున్నవి. పురుషుడెటుల తన స్త్రీని సత్కర్మలయందు నియోగించునో అటులనే స్త్రీయు తన పతిని సుకర్మలందు ప్రేరేపించ వలయును. దానిచే నిరంతరము ఆనందమభివృద్ధిజెందును. ॥౧౨॥ (౭౦౦)

౭౦౧ రాజ్ఞ్యసీత్యస్య విశ్వేదేవ ఋషిః, దిశో దేవతాః, విరాట్ పంక్తి శ్ఛన్దః, పఞ్చమః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల విషయ మయ్యదియే.

రాజ్ఞ్యసి ప్రాచీ దిగ్విరాడసి దక్షిణా దిక్ సమ్రాడసి ప్రతీచీ దిక్ స్వరాడస్యు
దీచీ దిగధిపత్న్యసి బృహతీ దిక్ ॥ ॥౧౩॥

రాజ్ఞీ, అసి ప్రాచీ, దిక్, విరాడితి వి+రాట్, అసి, దక్షిణా, దిక్, సమ్రాడితి
సమ్ + రాట్, అసి, ప్రతీచీ, దిక్, స్వరాడితి స్వ+రాట్, అసి, ఉదీచీ, దిక్, అధి
పత్నీత్యధి+పత్నీ, అసి,బృహతీ, దిక్. [13]

పదార్థః :-(రాజ్ఞీ) రాజమానా (అసి)(ప్రాచీ)పూర్వా (దిక్) దిగివ(విరాట్) వివిధ వినయ విద్యాప్రకాశయుక్తా (అసి) (దక్షిణా) (దిక్) దిగివ (సమ్రాట్)సమ్యక్ సుఖే భూగోలే రాజమానా (అసి) (ప్రతీచీ)పశ్చిమా(దిక్)(స్వరాట్)యా స్వయం రాజతే సా (అసి) (ఉదీచీ) ఉత్తరా (దిక్) (అధిపత్నీ) గృహేఽధికృతా స్త్రీ (అసి) (బృహతీ)మహతీ (దిక్)అధ ఊర్ధ్వా. ॥౧౩॥అన్వయః :- హే స్త్రి! యా త్వం ప్రాచీ దిగివ రాజ్ఞ్యసి, దక్షిణాదిగివ విరాడసి, ప్రతీచీ దిగివ సమ్రాడస్యుదీచీ దిగివ స్వరాడసి బృహతీ దిగివాధిపత్న్యసి సా త్వం సర్వాన్ పత్యాదీన్ ప్రీణీహి. ॥౧౩॥భావార్థః :- అత్ర వాచక లుప్తోపమాలంకారః. యథా దిశః సర్వతోఽభివ్యాప్తా విజ్ఞాపికా అక్షుబ్ధాః సన్తి తథైవ స్త్రీ శుభగుణకర్మ స్వభావైః సహితా స్యాత్. ॥౧౩॥

పదార్థము :-ఓ స్త్రీ! ఏ నీవు, ప్రాచీ దిక్ = పూర్వదిశవలె. రాజ్ఞీ అసి = ప్రకాశమానురాలవో, దక్షిణా దిక్ = దక్షిణదిశవలె. విరాట్ అసి = అనేక విధములైన వినయ విద్యాప్రకాశములుకలిగిన దానవో, ప్రతీచీ దిక్ = పశ్చిమదిశవలె, సమ్రాట్ అసి = చక్రవర్తిరాజువలె సుఖయుక్తపృధివియందు చక్కగా ప్రకాశమానురాలవో, ఉదీచీ దిగ్ = ఉత్తరదిశవలె, స్వరాట్ అసి = స్వయం ప్రకాశమానురాలవో, బృహతీ ది = క్రిందమీదలవలె, అధిపత్నీ అసి = గృహము నందధికారమును పొందినదానవై యున్నావో ఆ నీవు పతిమొదలైన వారందఱిని తృప్తపఱచుము. ॥౧౩॥

భావార్థము :-ఈ మంత్రమునందు వాచకలుప్తోపమాలంకారమున్నది. దిక్కులెటుల అన్నివైపులనుండి అభివ్యాప్తములు, బోధను కలిగింపజేయునవి, అక్షుబ్ధములు నై యున్నవో అటులనే స్త్రీ శుభగుణకర్మ స్వభావములతో గూడినదై యుండవలయును. ॥౧౩॥ (౨౦౧)

---

౨౦౨ విశ్వకర్మేత్యస్య విశ్వేదేవా ఋషయః, వాయు ర్దేవతా, స్వరాడ్బ్రాహ్మీ బృహతీ ఛన్దః, మధ్యమః స్వరః.
పున స్తమేవ విషయ మాహ. మఱల విషయ మయ్యదియే.

విశ్వకర్మా త్వా సాదయత్వన్తరిక్షస్య పృష్ఠే జ్యోతిష్మతీమ్ ।
విశ్వస్మై ప్రాణాయాఽపానాయ వ్యానాయ విశ్వం జ్యోతి ర్యచ్ఛ ।
వాయుష్టేఽధిపతి స్తయా దేవతయాఽఙ్గిరస్వద్ ధ్రువా సీద ॥ ॥౧౪॥

విశ్వకర్మేతి విశ్వ+కర్మా, త్వా, సాదయతు, అన్తరిక్షస్య, పృష్ఠే, జ్యోతిష్మతీమితి జ్యోతిః+మతీమ్, విశ్వస్మై, ప్రాణాయ, అపానాయ, వ్యానాయ, విశ్వమ్,

జ్యోతిః, యచ్ఛ, వాయుః, తే, అధిపతిరిత్యధి+పతిః, తయా, దేవతయా, అఙ్గిర
స్వత్, ధ్రువా, సీద. [14]

పదార్థః :—(విశ్వకర్మా)సకలేష్టక్రియః(త్వా)త్వామ్(సాదయతు)(అన్తరిక్షస్య)జలస్య(పృష్ఠే) ఉపరిభాగే(జ్యోతిష్మతీమ్) బహుజ్యోతి ర్విద్యతే యస్యా స్తామ్ (విశ్వస్మై) సర్వస్మై (ప్రాణాయ) (అపానాయ) (వ్యానాయ)(విశ్వమ్) సంపూర్ణమ్ (జ్యోతిః) విజ్ఞానమ్ (యచ్ఛ)గృహాణ (వాయుః) ప్రాణ ఇవ ప్రియః (తే) తవ (అధిపతిః)(తయా)(దేవతయా) (అఙ్గిరస్వత్)సూర్యవత్ (ధ్రువా) దృఢా (సీద). ॥౧౪॥ అన్వయః :—హే స్త్రి! యా జ్యోతిష్మతీం త్వా విశ్వస్మై ప్రాణాయాఽపానాయ వ్యానాయాన్తరిక్షస్య పృష్ఠే విశ్వకర్మా సాదయతు సా త్వం విశ్వం జ్యోతి ర్యచ్ఛ యో వాయు రివ తేఽధిపతిరస్తి తయా సహ ధ్రువాంగిరస్వత్ సీద. ॥౧౪॥ భావార్థః :— స్త్రీ బ్రహ్మచర్యేణ స్వయం విదుషీ భూత్వా శరీరాత్మబలవర్ధనాయ స్వాపత్యేభ్యో విజ్ఞానం సతతం ప్రదద్యాదితి ॥౧౪॥

పదార్థము:-ఓ స్త్రీ! జ్యోతిష్మతీమ్ త్వా = బహువిజ్ఞానవతియగు నే నిన్ను, విశ్వస్మై ప్రాణాయ అపానాయ వ్యానాయ = సకలప్రాణాపానవ్యానముల పుష్టికై, అంతరిక్షస్య పృష్ఠే = జలముయొక్క ఉపరితలభాగముపై, విశ్వకర్మా సాదయతు = సకల శుభకర్మలనభిలషించు పతి స్థాపించునో ఆ నీవు, విశ్వమ్ జ్యోతిః = సంపూర్ణ విజ్ఞానమును, యచ్ఛ = గ్రహించుము, వాయుః = ప్రాణప్రియుడగు నే, తే అధిపతిః = నీ భర్త యున్నాడో, తయా దేవతయా = ఆదేవతాస్వరూప పతితో, ధ్రువా = ధ్రువత్వమందుము, అంగిరస్వత్ = సూర్యునివలె, సీద = స్థిరురాలవు కమ్ము. ॥౧౪॥

భావార్థము :—స్త్రీ బ్రహ్మచర్యాశ్రమముచే తాను విదుషియై శారీరకాత్మిక బలముల వృద్ధికై స్వసంతానమునకు నిరంతరము విజ్ఞానము నొసగవలయును.

ఇంతవరకు గ్రీష్మర్తువు వ్యాఖ్యానించబడినది. ॥౧౪॥ (౬౦౨)

౬౦౩ నభశ్చేత్యస్య విశ్వదేవ ఋషిః, ఋతవో దేవతాః, స్వరాడుత్కృతి శ్ఛన్దః, షడ్జః స్వరః.
అథ వర్షర్తు ర్వ్యాఖ్యాయతే. వర్షర్తువు ఈ మంత్రమందు వ్యాఖ్యానించబడుచున్నది.

నభశ్చ నభస్యశ్చ వార్షికావృతూ అగ్నేరన్తః శ్లేషో ఽసి కల్పేతాం ద్యావాపృథివీ
కల్పన్తామాఽఽప ఓషధయః కల్పన్తామగ్నయః పృథఙ్మమ జ్యైష్ఠ్యాయ సవ్రతాః।
యే అగ్నయః సమనసోఽన్తరా ద్యావాపృథివీ ఇమే వార్షికావృతూ అభికల్పమానా
ఇన్ద్రమివ దేవా అభిసంవిశన్తు తయా దేవతయాఽఙ్గిరస్వద్ధ్రువే సీదతమ్ ॥

నభః, చ, నభస్యః,చ,వార్షికౌ,ఋతూ ఇత్యృతూ, అగ్నేః, అన్తః శ్లేష ఇత్య
న్తః శ్లేషః, అసి, కల్పేతామ్, ద్యావాపృథివీఇతి ద్యావాపృథివీ, కల్పన్తామ్, ఆపః,
ఓషధయః, కల్పన్తామ్, అగ్నయః, పృథగ్, మమ, జ్యైష్ఠ్యాయ, సవ్రతా ఇతి

స+వ్రతాః, యే, అగ్నయః, సమనస ఇతి స+మనసః, అన్తరా, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, ఇమే ఇతీమే, వార్షికౌ, ఋతూ ఇత్యృతూ, అభికల్పమానా ఇత్యభి+కల్పమానాః, ఇన్ద్రమివేతీన్ద్రమ్+ఇవ, దేవాః, అభిసంవిశన్త్విత్యభి+సంవిశన్తు, తయా దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువే ఇతి ధ్రువే, సీదతమ్. [15]

పదార్థః:—హే (నభః) నహ్యన్తి ఘనా యస్మిన్ స శ్రావణో మాసః(చ)(నభస్యః)నభస్సు భవో భాద్రపదః (చ) (వార్షికౌ) వర్షాసుభవౌ (ఋతూ)వర్షర్తుసంబంధినౌ(అగ్నేః) ఊష్మణః(అన్తః శ్లేషః) మధ్యే స్పర్శో యస్య (అసి) అస్తి (కల్పేతామ్)(ద్యావాపృథివీ) (కల్పన్తామ్)(ఆపః) (ఓషధయః) (కల్పన్తామ్)(అగ్నయః)(పృథక్)(మమ) (జ్యైష్ఠ్యాయ) ప్రశస్యభావాయ (సవ్రతాః)సమానాని వ్రతాని నియమా యేషాం తే (యే) (అగ్నయః) (సమనసః)సమానం మనో జ్ఞానం యేభ్యస్తే (అన్తరా) మధ్యే(ద్యావాపృథివీ)(ఇమే)(వార్షికౌ)వర్షాసు భవౌ (ఋతూ) వృష్టిప్రాపకౌ (అభికల్పమానాః) అభితః సుఖాయ సమర్థయన్తః (ఇన్ద్రమివ) యథా విద్యుతమ్ (అభిసంవిశన్తు) ఆభిముఖ్యేన సమ్యక్ ప్రవిశన్తు(తయా)(దేవతయా)(అఙ్గిరస్వత్)(ధ్రువే)(సీదతమ్). ॥౧౫॥ అన్వయః:— హే పురుషౌ! యువాం యౌ నభశ్చ నభస్యశ్చ వార్షికా వృతూ మమ జ్యైష్ఠ్యాయ కల్పేతాం యయోరగ్నేరన్తః శ్లేషోఽస్యస్తి యాభ్యాం సహ ద్యావాపృథివీ కల్పేతాం తాభ్యాం యువాం కల్పేతాం యథాప ఓషధయశ్చ కల్పన్తా మగ్నయః పృథక్ కల్పన్తే తథా సవ్రతాః సమనసోఽగ్నయః కల్పన్తాం య ఇమే ద్యావాపృథివీ కల్పేతే తౌ వార్షికా వృతూ అభికల్పమానా దేవా ఇంద్ర మివ తయా దేవతయా సహాఽభిసంవిశన్తు తయో రన్తరాఙ్గిరస్వద్ ధ్రువే సీదతమ్. ॥౧౫॥ భావార్థః:—అత్రోపమావాచక లుప్తోపమాలంకారౌ. మనుష్యై ర్విద్వద్వద్వర్షాసు సామగ్రీ సంగ్రాహ్యా యతో వర్షతౌ సర్వాణి సుఖాని భవేయుః. ॥౧౫॥

పదార్థము:—ఓ స్త్రీ పురుషులారా! మీ రిరువురు. నభః = ప్రబంధిత మేఘములుగల శ్రావణమాసము. చ = మఱియు, నభస్యః = వర్షమునకు మధ్యభాగమగు భాద్రపదము, చ = ఏ యీ రెండు, వార్షికౌ ఋతూ = = వర్షాకాలపు ఋతువులు, మమ జ్యేష్ఠ్యాయ = నేను ప్రశంసితుడనగుటకై సమర్థములగునో, వేనియందు, అగ్నేః = ఉష్ణస్పర్శము, అన్తఃశ్లేషః = మధ్య శీతస్పర్శము, అసి = ఉన్నదో, వేనిచే, ద్యావాపృథివీ = భూమ్యాకాశములు సమర్థములగుచున్నవో వానిభోగమునందు మీ రిరువురు, కల్పేతామ్ = సమర్థులగుదురో, ఎటుల ఋతుయోగముచే, ఆపః = జలములు, ఓషధయః = ఓషధులు, అగ్నయః = అగ్నులు. పృథక్ = జలముకంటె వేరుగ సమర్థములగునో. అటులనే, సవ్రతాః = ఒకేవిధమైన శ్రేష్ఠనియమములుగలవి. సమనసః = ఒకేవిధమైన జ్ఞానమునిచ్చునవి,అగ్నయః = తేజస్సులు, కల్పంతామ్ = సమర్థులగునో, ఏ యీ భూమ్యాకాశములు రెండు వర్షర్తుగుణములచే సమర్థములగుచున్నవో, వార్షికౌ ఋతూ = ఆ వర్షాకాల రూపములను, అభికల్పమానాః = అన్నివైపులనుండి సుఖమునకై సమర్థవంతములుగ నొనర్చు విద్వాంసులు, ఇంద్రమివ = విద్యుత్సదృశముగ, తయా దేవతయా = దివ్యమైన ఆ వర్షర్తువుతోపాటు, అభి సంవిశంతు = సమ్ముఖులై బాగుగ స్థితులగుదురో,అంతరా = ఆరెండుమాసములందు ప్రవేశించి, అంగిరస్వత్ = ప్రాణమువలె పరస్పర ప్రేమయుక్తురాలవై, ధ్రువే = నిశ్చలముగ, సీదతమ్ = ఉండుము. ॥౧౫॥

భావార్థము :- ఈ మంత్రము నందుపమా వాచక లుప్తోపమాలంకారము లున్నవి. వర్షాకాలము నందు సకలమానవులు సమస్త సుఖములు లభించు సామగ్రిని విద్వాంసులవలె సమకూర్చుకొనవలెను.

---

౨౦౪ ఇషశ్చేత్యస్య విశ్వేదేవా ఋషయః, ఋతవో దేవతాః, భురిగుత్కృతి శ్ఛన్దః, షడ్జః స్వరః,

అథ శరదృతు ర్వ్యాఖ్యాయతే. శరదృతువు వ్యాఖ్యానించ బడుచున్నది.

ఇషశ్చోర్జశ్చ శారదావృతూ అగ్నేర న్తఃశ్లేషో ఽసి కల్పేతాం ద్యావాపృథివీ కల్పన్తామాప ఓషధయః కల్పన్తామగ్నయః పృథఙ్మమ జ్యైష్ఠ్యాయ సవ్రతాః। యే అగ్నయః సమనసోఽన్తరా ద్యావాపృథివీ ఇమే శారదావృతూ అభికల్పమానా ఇన్ద్రమివ దేవా అభిసంవిశన్తు తయా దేవతయాఽఙ్గిరస్వద్ ధ్రువే సీదతమ్ ॥

ఇషః, చ, ఊర్జః, చ, శారదౌ, ఋతూ ఇత్యృతూ, అగ్నేః, అన్తః శ్లేషః, ఇత్యన్తః+శ్లేషః, అసి, కల్పేతామ్, ద్యావాపృథివీ, ఇతి ద్యావాపృథివీ, కల్పన్తామ్, ఆపః, ఓషధయః, కల్పన్తామ్, అగ్నయః, పృథక్, మమ, జ్యైష్ఠ్యాయ, సవ్రతా ఇతి స+వ్రతాః, యే, అగ్నయః, సమనస ఇతి స+మనసః, అన్తరా, ద్యావాపృథివీ ఇతి ద్యావాపృథివీ, ఇమే ఇతీమే, శారదౌ, ఋతూ ఇత్యృతూ, అభికల్పమానా ఇత్యభి+కల్పమానాః, ఇన్ద్రమివేతీన్ద్రం+ఇవ, దేవాః, అభి సంవిశన్త్వి త్యభిసంవిశన్తు, తయా, దేవతయా, అఙ్గిరస్వత్, ధ్రువే ఇతి ధ్రువే, సీదతమ్.

పదార్థః :-(ఇషః)ఇష్యతేఽసావాశ్వినో మాసః (చ) (ఊర్జః)ఊర్జన్తి సర్వేపదార్థా యస్మిన్ స కార్తికః (చ) (శారదౌ)శరది భవౌ (ఋతూ) బలప్రదౌ (అగ్నేః) (అన్తఃశ్లేషః) మధ్యస్పర్శః (అసి) అస్తి (కల్పేతామ్) (ద్యావాపృథివీ)(కల్పన్తామ్)(ఆపః) (ఓషధయః) (కల్పన్తామ్) (అగ్నయః)బహిఃస్థాః (పృథక్)(మమ)(జ్యైష్ఠ్యాయ) ప్రశస్తసుస్వభావాయ (సవ్రతాః) సనియమాః(యే) (అగ్నయః)శరీరస్థాః (సమనసః)మనసా సహ వర్తమానాః (అన్తరా)మధ్యే(ద్యావాపృథివీ)(ఇమే) (శారదౌ)(ఋతూ)(అభికల్పమానాః)(ఇన్ద్రమివ)(దేవాః) (అభిసంవిశంతు) (తయా) (దేవతయా) సహ (అఙ్గిరస్వత్)ఆకాశవత్ (ధ్రువే) నిశ్చలసుఖే(సీదతమ్)సీదతః, అత్ర పురుషవ్యత్యయః.

అన్వయః :—హే మనుష్యా యా విషశ్చోర్జశ్చ శారదావృతూ యథా మమ జ్యైష్ఠ్యాయ భవతో యే యో రన్తఃశ్లేషోఽస్యస్తి. తౌ ద్యావాపృథివీ కల్పేతా మాప ఓషధయశ్చ కల్పన్తామ్. సవ్రతా అగ్నయః పృథక్ కల్పన్తామ్. యేఽన్తరా సమనసోఽగ్నయ ఇమే ద్యావాపృథివీ కల్పేతామ్. శారదావృతూ ఇన్ద్రమివాభికల్పమానా దేవా అభిసంవిశన్తు తథా తయా దేవతయా సహ ధ్రువే సీదతం గచ్ఛతః.

భావార్థః :—అత్రోపమాలంకారః. హే మనుష్యాః యేశరద్యుపయుక్తాః పదార్థాః సన్తి తాన్ యథా యోగ్యం సంస్కృత్య సేవధ్వమ్. ॥౧౬॥

పదార్థము :- ఓ మానవులారా! ఇషః = అభిలషించదగిన ఆశ్వయుజమాసము, చ = మఱియు

